THE LARGEST CIRCULATED TELUGU EDUCATIONAL MONTHLY




# ఐక్య ఉపాధ్యాయ

మే-జూన్ 2007 ఆంధ్రప్రదేశ్ ఐక్యఉపాధ్యాయ ఫెడరేషన్ అధికార పత్రిక వెల : రూ.14/-




## ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామానికి 150 ఏళ్ళు




ఉద్యమ స్ఫూర్తిని పెంపొందించిన రాష్ట్ర మహాసభలు

Duvo1A466

# ఐక్య ఉపాధ్యాయ

విద్యా విషయక మాసపత్రిక

మే, జూన్, 2007

సంపుటి : 33 సంచిక : 5,6



ఈ సంచికలో .....



సంవత్సర చందా : రూ. 70-00

విడిప్రతి : రూ. 14-00

ఐక్య ఉపాధ్యాయ
గగన్ మహల్ రోడ్ నెం. 7, దోమల్‌గూడ,
హైదరాబాద్-29.
ఫోన్ : 27636840
UTF ఆఫీస్ ఫోన్: 27677242,
ఫ్యాక్స్: 27650366
Website: www.aputf.org.
E-mail : ikyopadhyaya@yahoo.com

# విద్యారంగ పరిరక్షణకు ఉద్యమిద్దాం

## పాఠకులందరికీ నూతన విద్యా సంవత్సర శుభాకాంక్షలు

సామాజికాభివృద్ధికి, ఆర్థికాభివృద్ధికి పునాది విద్యారంగమేనని అందరూ అంగీకరిస్తారు. కాని, విద్యారంగం పట్ల ఒక దీర్ఘ కాలిక ధృక్పథం, తదనుగుణమైన ప్రణాళిక మాత్రం ఇప్పటికీ మన ప్రభుత్వాలు రూపొందించుకోలేక పోయాయనేది వాస్తవం. మరీ 1990 తర్వాత ప్రభుత్వ విద్యా వ్యవస్థ క్రమంగా నిర్వీర్యమై ప్రజలకు నమ్మకాన్ని పోగొట్టి ప్రైవేటు విద్యవైపు పరుగులెత్తేలాగా చేసే విధానాలు ముందుకు వచ్చాయి. ప్రైవేటు రంగం బలపడటాన్ని ప్రోత్సహిస్తున్న ప్రభుత్వం ఆ రంగానికే మరింత చేయూతనిస్తే సరిపోతుందనే సిద్ధాంతాన్ని ముందుకు తెస్తోంది. దీనికి అనుగుణంగా అన్ని వైపుల నుంచి పలు రూపాల్లో ప్రభుత్వ విద్యారంగంపై దాడి ప్రారంభమయింది. దీనివలన విద్యారంగంలో తీవ్రమైన అసమానతలు గతంలో ఎప్పుడు లేనంతగా చోటుచేసుకొంటున్నాయి. దేశ అవసరాలకుగాని, సామాజిక అభ్యున్నతికి గాని, సమున్నత విలువకుగాని ఏ మాత్రం చోటు లేకుండా ఒక కృత్రిమ విద్యా విధానం మనం చూస్తుండగానే రూపుదిద్దుకోవటం ప్రారంభించింది. కృత్రిమ ప్రలోభాలవెంట ప్రజల్ని పరుగుతీయించటం మార్కెట్ లక్షణం. ఇప్పుడు ఇది విద్యారంగంలో వ్యక్తమైనంతగా మరే రంగంలోనూ కనిపించటం లేదు. క్రమంగా ప్రభుత్వం విద్యా బాధ్యతల నుంచి తప్పకోవటంతో ఇప్పటికే ప్రభుత్వ, ఎయిడెడ్, మున్సిపల్ విద్యా వ్యవస్థలు చిన్నాభిన్నమై పోయాయి. పాతికేళ్ళ ముందు ఈ పరిస్థితి లేదు. ఉన్నంతంలో ఈ సంస్థలన్నీ కళకళలాడాయి. ఇప్పుడు ఇది క్రమంగా ప్రాథమిక, సెకండరీ పాఠశాలలకు కూడ వ్యాపిస్తోంది. ఈ పరిస్థితిలో విద్యారంగాన్ని కాపాడుకోవటం ఈనాటి సామాజిక అవసరం. గతం కన్నా ఇప్పుడు దీని వలన నష్టాలు మధ్య తరగతి వర్గాన్ని కూడా చుట్టుముట్టడంతో మన విద్యా వ్యవస్థ అస్తవ్యస్తంగా ఉందన్న ఆవేదన అన్ని సెక్షన్‌లలో వ్యక్తమౌతుంది. ఏ వర్గమూ ఇప్పుడు తమ పిల్లలకు న్యాయమైన చదువునిప్పిస్తున్నామని చెప్పలేని పరిస్థితిలోకి నెట్టబడింది. ఇక పేద పిల్లలు మరో గత్యంతరం లేక ప్రభుత్వ విద్యా సంస్థలనే నమ్ముకోవటంతో ఆ వర్గపు ఊర్ధ్వచలనం దాదాపు ఇక అసాధ్యమనే పరిస్థితి దాపురించింది. ఒక సామాజిక సంక్షోభం మన కళ్ళముందు కదలాడుతున్నది.

దీనికి తోడు ఉద్యోగ భద్రత లేకపోవటం తీవ్రమైన శ్రమ దోపిడి ప్రవేశించటం, అంతా కాంట్రాక్టు మయంకావటం ఉపాధ్యాయులతోపాటు అధ్యాపకుల్ని కూడ తీవ్రంగా కలవరపరుస్తోంది. ఈ పరిస్థితుల్లో విద్యారంగాన్ని పరిరక్షించుకోవలసిన బాధ్యత మొత్తం సమాజం మీద ఉన్నప్పటికీ ఈ రంగంలోని చైతన్యవంతమైన, బాధ్యతాయుతమైన వర్గంగా ఉపాధ్యాయులు ముందు నిలబడవలసిన కర్తవ్యం చారిత్రకంగా ముందుకొచ్చింది. అన్ని కోణాలనుంచి అధ్యయనం చేసి దీనికి ఎవరు కారకులో వారిని బోనులో నిలబెడుతూ ప్రత్యామ్నాయం చూపుతూ ప్రజల్ని మన వైపు త్రిప్పకొంటూ ఎక్కువ మందిని కూడగట్టి ఒక విశాల సామాజిక ఉద్యమాన్ని విద్యారంగం చుట్టూ నిర్మించాల్సిన కర్తవ్యం మనం నిర్వహించాల్సి ఉంది. ఇందుకోసం మనం నిర్మాణాత్మకంగా పనిచెయ్యాలి. అధ్యయనం చెయ్యాలి. ప్రత్యామ్నాయాలు చూపాలి. విద్యా వ్యతిరేక విధానాలపై పోరాడాలి. ఇలా మన పోరాటం బహుముఖంగా ఉన్నప్పుడు మాత్రమే మన వెంట జనం వస్తారు. దీన్ని దృష్టిలో ఉంచుకొని స్వల్ప కాలిక, దీర్ఘకాలిక కార్యక్రమాలను మనం రూపొందించుకొందాం. ప్రభుత్వంపై ఒక సామాజిక ఒత్తిడిని తీసుకు వద్దాము.

ప్రభుత్వం ప్రకటించిన బడిబాట కార్యక్రమాన్ని స్వీకరించి ప్రభుత్వ పాఠశాలల్లో విద్యార్థుల నమోదు పెంపుదలకు కృషి చేయాలి. ప్రభుత్వ పాఠశాలలన్నింటి పైనా సమగ్రమైన సర్వే నిర్వహించి పాఠశాల లెదుర్కొంటున్న సమస్యలను సమాజం దృష్టికి తేవాలి. తగినంతమంది పిల్లలు లేరనే సాకుతో పాఠశాలల మూసివేతకు ఉపక్రమిస్తున్న ప్రభుత్వ వైఖరిని వ్యతిరేకించాలి. "మన ఊరి పాఠశాలను మనమే కాపాడుకోవాలి" అనే నినాదాన్ని ప్రజానినాదంగా మార్చాలి. విద్యార్థుల సంఖ్య తగ్గడానికి గల కారణాలను వెలుగులోకి తేవాలి. మరల ఆ పాఠశాలల్లో విద్యార్థుల నమోదుకు ప్రయత్నించాలి.

అవకాశం వున్న చోట ప్రజల, ప్రజాప్రతినిధుల భాగస్వామ్యంతో పాఠశాల సంరక్షణ కమిటీలను ఏర్పాటు చేయాలి. మంచి టీచర్లను ప్రోత్సహించాలి. మన పాఠశాలలోగల ఉపాధ్యాయుల ప్రతిభను, విద్యార్థులు సాధించిన విజయాలను విస్తృతంగా ప్రచారం నిర్వహించాలి. పూర్తి స్థాయిలో ఉపాధ్యాయులున్న కొన్ని పాఠశాలలను మోడల్ స్కూళ్ళుగా తీర్చి దిద్ది ఫలితాలు, ప్రమాణాలను సాధించడం ద్వారా ప్రభుత్వ ఉపాధ్యాయుల సమర్థతను నిరూపించాలి. ప్రైవేటు పాఠశాలలను సవాలు చేయాలి. పాఠశాలలు ఎదుర్కొంటున్న మౌలిక సమస్యలను గుర్తించి వాటి పరిష్కారం కోసం ప్రజా ఉద్యమాన్ని నిర్మించి ప్రభుత్వంపై ఒత్తిడి తేవాలి.

మే14, 15 తేదీలలో విజయవాడలో జరిగిన యు.టి.ఎఫ్. 10వ రాష్ట్ర మహాసభలు విద్యారంగ సమస్యలపైన చర్చా పత్రాన్ని విడుదల చేసి పాఠశాల ఉపాధ్యాయులు, కళాశాల అధ్యాపకులు, విద్యార్థులు, తల్లిదండ్రులతో కలిసి ఈ విద్యాసంవత్సరంలో విద్యా పరిరక్షణ ఉద్యమం నిర్వహించాలని నిర్ణయించడం ముదావహం. ఈ ఉద్యమాన్ని రాష్ట్రం నలుమూలలా విస్తరింపజేద్దాం. మన పాఠశాలలను, ప్రభుత్వ విద్యారంగాన్ని కాపాడుకుందాం. •

# "మన బడిని మనమే రక్షించుకుందాం"

మన ప్రభుత్వ విద్యా వ్యవస్థనెలా కాపాడు కోవాలి? ఇది లక్షలాది ప్రభుత్వ ఉపాధ్యాయులను, అధ్యాపకులను వేధిస్తున్న ప్రశ్న. ఒక అకడమిక్ చర్చల దశ నుండి ముందుకుపోయి నేడొక తక్షణ ఆచరణాత్మక సమస్యగా, పెను సవాలుగా ముందుకొచ్చింది.



2006 డిసెంబరులో రాష్ట్ర ప్రభుత్వం ప్రపంచ బ్యాంకుతో చర్చించి ఒక అవగాహనా పత్రంపై సంతకం చేసింది. నాలుగో విడత ఋణం మంజూరు చేయడానికి ముందస్తుగా రాష్ట్ర ప్రభుత్వం కొన్ని రంగాలలో మార్పులు చేయాలని ప్రపంచ బ్యాంకు షరతులు విధించింది. గత మూడు దఫాలుగా ఋణం మంజూరు చేసి షరతులను అమలు చేయమని చెప్పిన ప్రపంచబ్యాంకు ఈ తడవ ముందు షరతులు అమలు చేస్తేనే ఋణం విడుదల చేస్తానని చెప్పింది. ఈ షరతులు విద్య, వైద్యం, పట్టణ సంస్కరణలు, నీటి పారుదల, ప్రజా పంపిణీ వ్యవస్థలకు సంబంధించినవి. వీటిలో విద్యారంగంలోని మార్పులకే పెద్దపీట వేశారు. ఈ మార్పులన్నీ రాబోయే 18/20 నెలలలోపే పూర్తి చేసి ప్రపంచబ్యాంకు అప్పు తీసుకుని మళ్లీ ప్రజానుకూల విధానాల, నినాదాల ముసుగు తొడిగి 2009 ఎన్నికలకు సిద్ధం కావాలని కాంగ్రెస్ ప్రభుత్వం సన్నద్ధమౌతోంది.

నిజానికి విద్యారంగంలో సంస్కరణలను అమలు చేయడం ఎప్పుడో ప్రారంభమైంది. విద్యావాలంటీర్లను తెచ్చి రెగ్యులర్ పోస్టులను నింపకపోవడం, కాంట్రాక్టు లెక్చరర్ల నియామకం, అప్రెంటిస్ విధానం, ఎయిడెడ్ కాలేజీల లెక్చరర్లను రీడిప్లాయ్ చెయ్యడం, కాలేజీల్లో సెక్షన్ల రద్దు, రేషనలైజేషన్ వంటివి ప్రభుత్వ విద్యా వ్యవస్థపై ఇప్పటికీ సాగుతున్న దాడిలో భాగాలు. తాజాగా 20 మందిలోపు విద్యార్థులున్న పాఠశాలల లిస్టులు తయారు చేసి వాటిపై వేటు వేయడానికి తయారౌతున్నారు. ఈ పాఠశాలలు 5000 దాటి ఉన్నాయి. ఈ సమస్యలపై విడివిడిగా ఆయా తరగతుల ఉపాధ్యాయులు, అధ్యాపకులు పోరాడుతూనే ఉన్నారు. కాని ప్రభుత్వం మొండిగా తన నిర్ణయాల అమలులో ముందుకు పోతూనే వుంది. తానేమో విద్యా ప్రమాణాలను మెరుగు పరచడానికి, ఉపాధ్యాయుల, అధ్యాపకుల సామర్థ్యం పెంచడానికి, విద్యా సంస్థలను రక్షించడానికి చిత్త శుద్ధితో పాటు పడుతున్నట్లు పోజు పెడుతుంది. ఉపాధ్యాయులు, అధ్యాపకులు మాత్రం తమ జీత భత్యాలు, బదిలీలు, ప్రమోషన్లు తప్ప విద్యార్థులు, విద్యా ప్రమాణాలు వంటి అంశాలు పట్టించుకోకుండా బాధ్యతారాహిత్యంగా వ్యవహరిస్తున్నారన్న అభిప్రాయాన్ని ప్రజలలో కలిగించడానికి ప్రయత్నిస్తోంది.

ప్రభుత్వ రంగాన్ని ప్రైవేటీకరించాలని నిర్ణయించుకున్నాక ప్రభుత్వ రంగం అవినీతికి, అసమర్థతకు, క్రమశిక్షణా రాహిత్యానికి మారుపేరని ప్రచారం చేశారు. విద్యుత్‌రంగంలో సంస్కరణలు ప్రవేశ పెట్టినప్పుడూ ఆర్టీసీ ప్రైవేటీకరణ యోచన చేసినప్పుడు కూడ ఇదే ఎత్తుగడను అమలు చేశారు. ఏ రంగం పై దాడికి పూనుకుంటారో ఆ రంగంలోని ఉద్యోగులపై దుష్ప్రచారం చేసి వారిని ప్రజలకు దూరం చేయడానికి ప్రయత్నించడం ప్రపంచ బ్యాంకు సంస్కరణలలో భాగమే. అందుకు ఇప్పుడు ఉపాధ్యాయుల మీద, అధ్యాపకుల మీద ఈ దుష్ప్రచారం చేస్తున్నారు. ఈ మొత్తం దాడిని, దుష్ప్రచారాన్ని తిప్పికొట్టి ప్రభుత్వ విద్యా వ్యవస్థను రక్షించుకోవాలి. ఇది చిన్న పనేమీ కాదు. చాలా పెద్ద పోరాటం. ఇంత పెద్ద వ్యవహారం మన వల్ల సాధ్యం కాదేమోనన్న జంకు చాలా మంది ఉపాధ్యాయుల్లో కనపడుతోంది. "అసలే ప్రభుత్వ పాఠశాలల పట్ల ప్రజల్లో అంత సదభిప్రాయం లేదు కదా! ఈ పరిస్థితుల్లో మన ఉద్యమానికి ప్రజల మద్దత్తు ఎలా వస్తుంది" అని సందేహం వెలిబుచ్చుతున్నారు. "వేల కోట్ల టర్నోవర్‌తో సాగుతున్న కార్పొరేట్ విద్యా వ్యాపారాన్ని ప్రోత్సహిస్తూ ప్రభుత్వ విద్యా వ్యవస్థను ప్రభుత్వమే దెబ్బ తీయాలనుకుంటున్నప్పుడు మనమేం చేయగలం?" అని నిస్పృహకు లోనవుతున్నారు.

యుద్ధంలో వైరి బలాన్ని మాత్రమే చూసి తన స్వంత బలాన్ని చూడకపోతే వచ్చే భయాందోళన వంటిదే ఇది. లక్షలాదిమంది ప్రభుత్వ ఉపాధ్యాయులు, అధ్యాపకులు ఐక్యంగా పనిచేస్తే అది అటు ప్రభుత్వంపైన, ఇటు ప్రజలపైన బలంగా ప్రభావం కల్గిస్తుంది. విద్యావాలంటీర్లను, నిరుద్యోగ ఉపాధ్యాయులను మనతో కలుపుకుని పోవాలి. ఇంకోవైపు విద్యార్థులను కదిలించాలి. ప్రభుత్వ ఎయిడెడ్ విద్యా సంస్థలు దెబ్బతింటే పేద విద్యార్థులు. దళిత, గిరిజన, బలహీన వర్గాల, మైనారిటీ తరగతులకు చెందిన వారే ఎక్కువ నష్టపోతారు. వారందరినీ మనం కదిలించాలి. కలిసి ఉద్యమించాలి.

ఆయా తరగతుల తరపున పనిచేస్తున్న దళిత, గిరిజన, బిసి సంఘాలను కూడ ఈ ఉద్యమంలో కలుపుకోవాలి. ఇప్పటికే ప్రపంచ బ్యాంకుకు వ్యతిరేకంగా పోరాడుతున్న ఉద్యోగ, కార్మిక సంఘాలనేకం ఉన్నాయి. ఇన్సూరెన్స్, బ్యాంకింగ్, టెలికం, పోస్టల్, రైల్వే, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వోద్యోగులు, ప్రభుత్వ రంగ సంస్థల ఉద్యోగులు లక్షల మంది ప్రపంచ బ్యాంకు భూతాన్ని తరిమి కొట్టి పోరాటాలలో నిమగ్నమై ఉన్నారు. వారి పిల్లల్నెక్కడ చదివిస్తున్నా వారు ప్రభుత్వ విద్యా వ్యవస్థ పరిరక్షణలో మాత్రం మనతో చేయికలుపుతారు. సర్పంచ్‌లు, ఎంపిటిసిలు, జడ్‌పిటిసిలు, ఎంపిపిలు, మున్సిపల్ కౌన్సిలర్లు పంచాయితీ మెంబర్లు వంటి స్థానిక సంస్థల ప్రతినిధులు వేలాదిమంది ఉన్నారు. వీర్లు తమ పరిధిలోని పాఠశాలలు మూత బడతాయంటే ససేమిరా అంగీకరించరు. మనతో కలిసి వస్తారు. ఆయా విద్యా సంస్థల పూర్వ విద్యార్థులు అనేకమంది ఉంటారు. రిటైరైన ఉపాధ్యాయులున్నారు. వీరందరినీ కూడ కలుపుకురావాలి.

వీరందరినీ కదిలించగలిగితే ఓ మహా సైన్యమే అవుతుంది. వీరిలో అనేకమంది ప్రభుత్వ ఉపాధ్యాయుల, అధ్యాపకుల పని తీరు మీద అసంతృప్తి వ్యక్తం చేయవచ్చు. వారి విమర్శల్లో వాస్తవాలుంటే స్వీకరిద్దాం. విద్యా వ్యవస్థను దెబ్బతీస్తున్నది. ఉపాధ్యాయులు కాదనీ ఇంకా బాగా పాఠాలు చెప్పడానికి ప్రయత్నిస్తామని హామీ ఇద్దాం. ఆ హామీని నెరవేర్చడానికి చిత్తశుద్ధితో ప్రయత్నిద్దాం. ఈ వైఖరి తీసుకోగలిగితే విద్యా సంస్థల రక్షణ కోసం అన్ని తరగతుల వారూ మనకు అండగా నిలుస్తారు. ఈ రోజు ఒక ఆర్టీసీ డిపోను మూసేస్తారంటే వీల్లేదంటూ అక్కడ ఉండే స్థానిక ప్రజలు, ప్రజా ప్రతినిధులు అందరూ ఆందోళనకు దిగుతున్నారు. ఆర్టీసీని కాపాడుకోవడంలో ముందుంటున్నారు. వీరంతా ఆర్టీసీ బస్సుల్లోనే తిరుగుతున్నారా? లేదా? గతంలో వీరు ఆర్టీసీ సిబ్బంది పని తీరు పట్ల అసంతృప్తి వ్యక్తం చెయ్యలేదా? ఆర్టీసీ పరిరక్షణ ఉద్యమం సాగిన క్రమంలోనే ఆర్టీసీ సిబ్బంది పని తీరు మెరుగుపడింది. ప్రజల మద్దతూ పెరుగుతూ వచ్చింది. ఈ అనుభవాలు మన విద్యారంగాన్ని పరిరక్షించుకొనే ఉద్యమానికి కూడ వర్తిస్తాయి.

విద్య ప్రజల హక్కు. విద్యారంగాన్ని రక్షించుకోవలసింది ప్రజలు. ఆ ప్రజల్ని కదిలించి విద్యారంగ పరిరక్షణ ఉద్యమానికి కేంద్ర బిందువుగా నిలబడవలసింది మాత్రం ఉపాధ్యాయులూ, విద్యార్థులే. విద్యారంగ పరిరక్షణ ఉద్యమం విజయం సాధిస్తే ఉపాధ్యాయుల, అధ్యాపకుల పెండింగ్ సమస్యల పరిష్కారం ఇంకా తేలికౌతుందని మనం గమనించాలి.

"మా వూరి విద్యా సంస్థను మూసెయ్యడానికి వీలులేదు" అన్న నినాదం చేబట్టి ఆ ఊరి ప్రజలందరి మద్దత్తూ కూడగట్టాలి. ఆ విద్యా సంస్థ పనితీరు మెరుగుపడడానికి మనవంతుగా ఏ కృషి చెయ్యాలో దానిని వెంటనే చేపట్టాలి.



# యుటియఫ్ ప్రస్థానంలో మరో ముందడుగు
# రాష్ట్ర 10వ మహాసభోత్సవాలు

ఉత్తేజభరిత వాతావరణంలో మహోత్సాహంగా యుటియఫ్ 10వ రాష్ట్ర మహాసభలు 2007 మే 14,15 తేదీల్లో ఉద్యమాల పురిటిగడ్డ అయిన విజయవాడలో అప్పారి వెంకటస్వామి నగర్‌లో, మైనేని వేదికపై జరిగాయి. సభాప్రాంగణం అయిన తుమ్మల పల్లి క్షేత్రయ్య కళాక్షేత్రం యుటియఫ్ తోరణాలతో అరుణారుణమైంది. సభకు విచ్చేస్తున్న అతిథులకు, సోదర సంఘాల నాయకులకు స్వాగతం చెప్తూ వెలసిన బ్యానర్లు, ఉద్యమ పితామహులు చెన్నుపాటి, ఏవిఎస్, మైనేనిల చిత్రాలతో ఏర్పాటు చేసిన స్వాగత ద్వారాలు, గడచిన 9 రాష్ట్ర మహాసభల చిహ్నంగా వెలసిన 9 యుటియఫ్ భారీ పతాకాలు. ఆవిష్కరణ కోసం వేచిచూస్తున్న 10వ రాష్ట్ర మహాసభ ఉద్యమ పతాకం, ఎన్‌టిఎఫ్ఐ పతాకం అమర వీరుల స్థూపం, రంగులతో నేలపై అలంకరించిన యుటియఫ్ చిహ్నం, మహాసభకు డెలిగేట్లుగా తమ పేర్లను నమోదు చేయించుకోవడానికై మూడు కౌంటర్ల వద్ద బారులు తీరిన నాయకులు, కార్యకర్తలతో ప్రాంగణం కళకళ లాడింది.

## నూతన భవన ప్రారంభోత్సవం

**విజయవాడలోని యుటియఫ్ రాష్ట్ర ఉపకార్యాలయం చెన్నుపాటిభవన్‌ను విస్తరించి పునర్నిర్మించిన మొదటి అంతస్తు భవనాన్ని 10వ రాష్ట్ర మహాసభల సందర్భంగా మే 14న ఉదయం 9 గం॥లకు రాష్ట్ర అధ్యక్షులు సిహెచ్. సుభాష్ చంద్రబోస్ ప్రారంభించారు. యుటియఫ్ సీనియర్ నాయకులు, ఎంఎల్‌సి డి. రామిరెడ్డి కార్యాలయంపై పతాకాన్ని ఆవిష్కరించారు. ఈ భవనంలో సకల సౌకర్యాలతో కూడిన సంఘ కార్యాలయము, ఉపాధ్యాయులకు వసతి, అతిథి గృహం, ప్రచురణల కమిటీ గోడౌన్, మినీ మీటింగ్ హాల్, లైబ్రరీ రూమ్ ఏర్పాటు చేయబడినవి. భవనాన్ని ప్రారంభించిన సందర్భంగా బోస్ మాట్లాడుతూ ఈ భవనంలో అకడమిక్ పరిశోధనలకు, విద్యారంగ ఆవిష్కరణలకు ఉపయోగపడే విధంగా గ్రంథాలయాన్ని ఏర్పాటు చేయాలనే యోచన ఉందన్నారు. ఈ కార్యక్రమంలో రాష్ట్ర ప్రధాన కార్యదర్శి ఎన్. నారాయణ, గౌరవాధ్యక్షులు పి. కృష్ణమూర్తి, సహాధ్యక్షులు ఎన్. రమణయ్య శాస్త్రి, సంయుక్త ప్రధాన కార్యదర్శి ఐ. వెంకటేశ్వర రావు తదితరులు పాల్గొన్నారు. భవన నిర్మాణాన్ని సీనియర్ కార్యకర్తలు డి. మస్తాన్‌రావు, గంపా వెంకటేశ్వర్లు పర్యవేక్షించగా సాంకేతిక సహకారం ప్రముఖ ఇంజనీర్ ఎస్. రాజగోపాల్ రెడ్డి అందించారు**

## ప్రారంభ సభ విశేషాలు

శాసన మండలి ఎన్నికల్లో అనితర సాధ్యమైన విజయాలను యుటియఫ్ స్వంతం చేసుకున్నది. ఆ విజయోత్సహంతో కార్యకర్తలు సభా ప్రాంగణానికి విచ్చేస్తున్న ఎంఎల్‌సిలకు, సీనియర్ నాయకులకు జేజేలతో స్వాగతం పలికారు. ఉదయం 10 గంటలకు ప్రాంగణంలో యుటియఫ్ పతాకాన్ని రాష్ట్ర గౌరవాధ్యక్షులు పి. కృష్ణమూర్తి, ఎస్‌టిఎఫ్ఐ పతకాన్ని ఉద్యమ సీనియర్ నేత ఎం.ఏ.కె. దత్తు ఆవిష్కరించారు. ఉద్యమ నినాదాలతో సభా ప్రాంగణం మారుమ్రోగిపోయింది. ఉద్యమ గీతాన్ని టి.వి. చలం బృందం ఆలాపించిన అనంతరం అమర వీరుల స్థూపం వద్ద పుష్పాంజలి ఘటించారు. అందంగా ఆకర్షణీయంగా అలంకరించిన సభా వేదిక వద్దకు చేరుకున్న నాయకులకు, ప్రతినిధులకు సాదర స్వాగతం లభించింది. మహాసభల నిర్వహణ బాధ్యతలో ప్రధాన పాత్ర పోషించిన రాష్ట్ర కార్యదర్శి బి. నాగేశ్వర రావు అతిథులను వేదికపైకి ఆహ్వానించారు. రాష్ట్ర కార్యవర్గ సభ్యులు అతిథులకు, రాష్ట్ర అగ్ర నాయకత్వానికి పుష్పగుచ్ఛాలిచ్చి సత్కరించారు. ఉద్యమ రథ సారధి, రాష్ట్ర ప్రధానకార్యదర్శి ఎన్. నారాయణ అధ్యక్షత వహించిన ఈ ప్రారంభసభలో అధ్యక్షులు సి.హెచ్. సుభాష్‌చంద్రబోస్, గౌరవాధ్యక్షులు పి. కృష్ణమూర్తి, యుటియఫ్ ఉద్యమ నిర్మాతల్లో అగ్ర గణ్యులు. ఎంఎల్‌సి డి. రామిరెడ్డి, ప్రముఖ విద్యా వేత్త ఎంఎల్‌సి డా॥ చుక్కా రామయ్య, జనవిజ్ఞాన వేదిక నాయకులు, ఎంఎల్‌సి వి. బాలసుబ్రహ్మణ్యం, ఎంఎల్‌సి లక్ష్మణరావు, ఎంఎల్‌సి జార్జివిక్టర్, ఎంఎల్‌సి ఎం.వి.ఎస్. శర్మ, ప్రముఖ రాజకీయ విశ్లేషకులు, ఎంఎల్‌సి కె. నాగేశ్వర్‌రావు పాల్గొన్నారు. వీరితోపాటు జెఏసి చైర్మన్, ఏపిఎన్‌జిఓ సంఘ అధ్యక్షులు వి. గోపాలరెడ్డి, ఏపిఎన్‌జిఓ సంఘ ప్రధానకార్యదర్శి సుబ్బరాయన్, జెఏసి సెక్రటరీ జనరల్, టిఎన్‌జిఓ సంఘ అధ్యక్షులు డి. సుధాకర్, జెఏసి నాయకులు, పబ్లిక్ సెక్టార్ ఎంప్లాయిస్ సంఘ రాష్ట్ర చైర్మన్ ఎం. జనార్ధన్ రెడ్డి, సిఐటియు నాయకులు డి.వి. కృష్ణ, ఎస్ఎఫ్ఐ నాయకులు కృష్ణ, జనవిజ్ఞాన వేదిక రాష్ట్ర కార్యదర్శి టి. రమేష్, డివైఎఫ్ఐ రాష్ట్ర ఉపాధ్యక్షులు ప్రసాద్‌లు వేదికపై ఆసీనులైనారు. సభా ప్రారంభానికి ముందుగా ఉపాధ్యాయ ఉద్యమానికి ఊపిరులూది నేటికీ అనేక ఉపాధ్యాయ సంఘాలు ఉద్యమ పితామహుడిగా పేర్కొంటున్న అమరజీవి చెన్నుపాటి చిత్రపటానికి డి. రామిరెడ్డి, యుటియఫ్‌కు పునాదులు వేసి వ్యవస్థాపక ప్రధానకార్యదర్శిగా, పత్రికా సంపాదకులుగా ఉద్యమానికే వన్నె తెచ్చిన అమరులు అప్పారి వెంకటస్వామి చిత్రపటానికి సిహెచ్. సుభాష్‌చంద్రబోస్, ఐక్య ఉపాధ్యాయ పత్రికను తన మానస పుత్రికగా ప్రారంభించి పెంచి పోషించి పత్రికను ఉద్యమ కరదీపికగా ప్రజ్వరిల్ల చేసిన అమరులు మైనేని వెంకటరత్నం చిత్ర పటానికి గౌరవాధ్యక్షులు పి. కృష్ణమూర్తి, పూల మాలలు వేసి శ్రద్ధాంజలి ఘటించారు. అమరజీవుల ఆశయాల స్ఫూర్తితో కడ దాకా సాగుతామని పులకరించిన భావోద్వేగంతో ప్రతినిధులు నినదించారు.

ఉపాధ్యాయులుగా పదవీ విరమణ పొందినా సంఘంలో ఏ పదవులూ లేక పోయినా ఉద్యమంతో మమేకమై యువతకు స్ఫూర్తినిచ్చే రీతిలో పని చేస్తున్న డి. మస్తాన్ రావు, గంపా వెంటేశ్వర్లు విజయవాడ భవన పునర్నిర్మాణంలో అవిశ్రాంతగా కృషి చేశారు. భవన పునర్నిర్మాణానికి పధక రచన చేసి రూపుదిద్దిన వారు ఇంజనీరు ఎస్. రాజగోపాల్ రెడ్డి ఈ ముగ్గురి సేవలను గుర్తిస్తూ చిరు కానుకగా నూతన వస్త్రాలతో, శాలువాలతో రాష్ట్ర నాయకత్వం వారిని సత్కరించింది.

సభాధ్యక్షులు ఎన్. నారాయణ అధ్యక్షోపన్యాసం చేస్తూ యుటియఫ్ ఉద్యమ ప్రస్థానాన్ని, వైశిష్ట్యాన్ని పేర్కొంటూ ఉపాధ్యాయ ఉద్యమాల్లో ఆందోళనా పోరాటాల్లో యుటియఫ్ పాత్రను వివరించారు. ప్రభుత్వం చేపడుతున్న ప్రజా వ్యతిరేక, ఉద్యోగ వ్యతిరేక విధానాలకు నిరసనగా జెఏసి చేపట్టిన, చేపడుతున్న కార్యక్రమాలను వివరిస్తూ పిఆర్‌సి సాధించడంలో జెఏసి నాయకత్వం చేసిన కృషిని ప్రశంసించారు. ప్రపంచబ్యాంకు నీడలో పరిపాలన సాగిస్తున్న రాష్ట్ర ప్రభుత్వం ఉపాధ్యాయ, ఉద్యోగ కార్మికులకు విఘాతం కలిగించే చర్యలను చేపట్టే ఆలోచన చేస్తున్నదనీ, ఖాళీల భర్తీ చేపట్టకపోగా అనేక ప్రభుత్వ శాఖలను, పాఠశాలలను మూసివేతకు గురి చేస్తున్నదనీ ఈ చర్యలను వ్యతిరేకిస్తూ జెఏసి పక్షాన పోరాటం చెయ్యాలన్నారు. రెండున్నర దశాబ్దాల అనంతరం జరిగిన శాసనమండలి ఎన్నికల్లో యుటియఫ్ బలపరచిన ఏడుగురు అభ్యర్థులు గెలవడం వెనుక యుటియఫ్ కృషి, అభ్యుదయకర శక్తుల సహకారం దాగి ఉన్నదని, వారి గెలుపు విద్యారంగ పరిరక్షణకు, ప్రభుత్వరంగ పరిరక్షణకు మేలు మలుపు అవుతుందని విశ్వాసం వ్యక్తం చేశారు. కాన్సెప్టు స్కూళ్ళ పేరుతో పేదలకు చదువును దూరం చేసి కార్పొరేటు శక్తులకు అండగా నిలిచే ప్రభుత్వ చర్యలను తీవ్రంగా విమర్శించారు.

డి. రామిరెడ్డి ప్రారంభోపన్యాసం చేస్తూ ఉద్యమం అనేక మైలు రాళ్ళను దాటి నేటికి రాష్ట్రంలో అత్యున్నత, అత్యుత్తమ ఉద్యమంగా గణుతికెక్కిన వైనాన్ని వివరించారు. రాష్ట్రంలో విద్యారంగ పరిస్థితిని సమీక్షించారు. కెజి నుండి పిజి వరకు ప్రతి స్థాయిలోనూ ప్రైవేటీకరణ జపం చేస్తున్న రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాలు తమ బాధ్యత నుండి తప్పుకుంటున్నాయని విమర్శించారు. సంపూర్ణ

అక్షరాస్యతా కార్యక్రమాన్ని ఒక సామాజిక కార్యక్రమంగానో, రాజకీయ ఎజెండాగానోకాక ప్రపంచబ్యాంకును సంతృప్తి పరచడం కోసం చేపట్టిన పథకంలా తయారు చేశారన్నారు. విద్యారంగంలో కాంట్రాక్ట్ సిస్టం, విద్యావాలంటీర్ల సిస్టం ప్రవేశ పెట్టి ప్రభుత్వం డబ్బులు మిగుల్చుకో చూస్తున్నదనీ, ప్రభుత్వ పాఠశాలలు నిర్వీర్యమై పోతే బడుగులకు చదువు అందదని ఆవేదన వ్యక్తం చేశారు. మధ్యాహ్న భోజన పథకాన్ని సమర్థవంతంగా ప్రభుత్వమే నిర్వహించాలనీ, ప్రభుత్వ పాఠశాలలను మూసివేయకుండా మరిన్ని తెరిచి అవసరమైన బోధనా సిబ్బందిని ఇవ్వడం ద్వారానే సంపూర్ణ అక్షరాస్యత సాధించాలని ప్రభుత్వాన్ని డిమాండు చేశారు. ప్రజలను చైతన్యపరచడం ద్వారా మాత్రమే ప్రభుత్వ రంగాలైన విద్య, వైద్యాలను కాపాడుకోగలుగుతామని ఉపాధ్యాయులు సామాజిక కార్యకర్తలుగా కూడా తోడ్పడాలని మహాసభకు పిలుపునిచ్చారు.

## "గురుతరమైనది మీ బాధ్యత, ధన్యం మీ జీవితం"

-వి. గోపాలరెడ్డి,

జెఏసి చైర్మన్ వి. గోపాల్ రెడ్డి సందేశమిస్తూ "ఏ స్థాయికి ఎదిగిన ఉన్నతులైనా, రాజకీయ నాయకులైనా మీ ముందు నిలబడి మీ చేత అక్షరాభ్యాసం చేయించుకున్న వారే. మీ చేతి చలవ వల్లే వారికా స్థాయి లభ్యమైంది. ఆ విధంగా మీరంతా ధన్యు"లంటూ ఉపాధ్యాయ వృత్తిని, వృత్తికి గల గౌరవాన్ని తన మాటల్లో ప్రశంసించారు. పాఠశాలలకు కంప్యూటర్లు ఇస్తున్నారు. కానీ విద్యుత్ సౌకర్యం లేదు. కనీస వసతులులేని పాఠశాలల గోడు ప్రభుత్వం పట్టించుకోవడం లేదు. రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాలు దుర్మార్గమైన కొత్త పెన్షన్ విధానాన్ని ప్రవేశ పెట్టి ఉద్యోగులను ఆందోళనకు గురి చేస్తున్నాయని, ప్రభుత్వాలు అనుసరిస్తున్న ఉద్యోగ, ఉపాధ్యాయ కార్మిక, ప్రజావ్యతిరేక చర్యలను సమైక్యంగా తిప్పికొట్టాలని పిలుపునిచ్చారు.

## "హేతుబద్ధత మీ సిద్ధాంతం - ఆచరణీయం ఆసాంతం"

-డి. సుధాకర్

జెఏసి సెక్రటరీ జనరల్ డి. సుధాకర్ మాట్లాడుతూ రాష్ట్రంలో ఉన్న ఉద్యోగ, ఉపాధ్యాయ, కార్మిక సంఘాలలో యుటియఫ్ ప్రబలమైన శక్తిగా ఉన్నదని చెప్పడానికి గర్విస్తున్నానన్నారు. జెఏసి కార్యాచరణలో యుటియఫ్ ప్రధాన భూమికను పోషిస్తున్నదని, ఇతర సంఘాలకు భిన్నంగా హేతు బద్ధతతో పని చేస్తున్నదని ప్రశంసించారు. ప్రభుత్వాలు ఉద్యోగుల, ఉపాధ్యాయుల హక్కులను కాలరాయ చూస్తున్నాయని, ఇందుకు కారణం సంస్కరణలేనని భారత దేశ భవిష్యత్తు ఉపాధ్యాయుల చేతుల్లో ఉందని, సంస్కరణల పుణ్యమాని విద్య, వైద్యరంగాలు చిక్కి శల్యమైనాయని అన్నారు. దేశ భవిష్యత్ రూపకర్తలైన ఉపాధ్యాయులకు నేడు సర్వీసు రూల్సులేని దౌర్భాగ్య పరిస్థితి ఉన్నదని ఇది ప్రభుత్వానికి సిగ్గుచేటని విమర్శించారు. ప్రస్తుత ప్రభుత్వ నేతలు గతంలో ప్రతిపక్షంలో ఉన్నప్పుడు యిచ్చిన హామీలన్నింటిని గాలికి వదలి వేసారని, చిత్తశుద్ధిలేమి స్పష్టమవుతున్నదనీ అన్నారు. అనామలీస్ కమిటీ రిపోర్టు ఆలస్యం అవుతున్న కారణంగా 2008 పిఆర్‌సి ఆలస్యం అవుతుందని కొందరు ఆందోళన చెందుతున్నారనీ, అలా జరగన్వివమనీ, జెఏసి ఎట్టి పరిస్థితుల్లోనూ ఉద్యోగ, ఉపాధ్యాయులకు నష్టం కలిగించే చర్యలను చూస్తూ ఊరుకోదని భరోసా యిచ్చారు.

ఏపిఎన్‌జిఓ సంఘ ప్రధాన కార్యదర్శి సుబ్బారాయన్ సందేశమిస్తూ కార్పొరేటు సంస్థలు ఎన్‌రోల్‌మెంటు పెంచుకోవడానికి వివిధ రకాల ఎత్తుగడలు అనుసరిస్తున్నాయని వీటిని ప్రభుత్వం ప్రోత్సహిస్తున్నదని అన్నారు. ప్రైవేటు విద్యా సంస్థలకు ధీటుగా ప్రభుత్వ పాఠశాలల అభివృద్ధికై పోరాడాలనీ, ప్రభుత్వ పాఠశాలలు బలపడడానికి ఎంఎల్‌సిల సహకారం తప్పనిసరి అని అన్నారు. ఎం. జనార్ధన్ రెడ్డి మాట్లాడుతూ ప్రపంచబ్యాంకు విధానాలను వ్యతిరేకిస్తూ యుటియఫ్ 9వ రాష్ట్ర మహాసభల్లోనే సంఘీభావం ప్రకటించామని ఆ ఒరవడితోనే నేటి కాంట్రాక్టు సిస్టాన్ని రద్దు చేసి రెగ్యులర్ పోస్టింగ్సు ఇవ్వాలని డిమాండు చేస్తున్నామన్నారు. అన్ని రంగాల, వర్గాల వారిని ఒకే వేదికపైకి తీసుకురావడం యుటియఫ్ కర్తవ్యమని, అది యుటియఫ్‌కే సాధ్యమని అన్నారు.

## "యుటియఫ్ చరిత్ర సృష్టించింది"

-డా|| సి. రామయ్య

డా|| చుక్కా రామయ్య ప్రసంగిస్తూ ప్రభుత్వాల ఆలోచనలు, విధానాలు వేగంగా మారుతున్నాయని, ప్రజాస్వామ్య వ్యతిరేక చర్యలను వ్యతిరేకిస్తూ యుటియఫ్ చేస్తున్న ఆందోళనా పోరాటాలు ప్రశంసనీయంగా ఉన్నాయన్నారు. రాష్ట్ర పరిణామాలను అధ్యయనం చేయడంలో యుటియఫ్ కీలక పాత్ర పోషిస్తున్నదని, శాసనమండలికి ఏడుగురు ఎంఎల్‌సిలను గెలిపించుకుని యుటియఫ్ చరిత్ర సృష్టించిందని అన్నారు. ఆర్థిక సమస్యల పరిష్కారం కోసం కాక మంచి సమాజ నిర్మాణం కోసం కృషి చేయమని ప్రతినిధులకు పిలుపునిచ్చారు. విద్యా రంగాన్ని పూర్తి వ్యాపార రంగంగా మార్చిన ఘనత మన ప్రభుత్వాలదని అన్నారు. ప్రపంచబ్యాంకు విధానాలను సమర్థిస్తున్న పాలకులు అప్రజాస్వామిక పద్ధతులకు పాల్పడుతున్నారని విమర్శించారు. ఏ సంఘం కూడా ఒంటరిగా పోరాడి విజయం సాధించలేదని ఐక్య పోరాటాల ఆవశ్యకత పెరుగుతున్నదని అందుకు యుటియఫ్ చోదక శక్తి కావాలని ఆకాంక్షించారు. శాసనమండలి ఎన్నికైన ఎంఎల్‌సిలు పైరవీకారులు కారని అందరూ పోరాట యోధులేననీ ఆందోళనా, పోరాటాలకు సహకరిస్తామన్నారు. వి. బాలసుబ్రహ్మణ్యం సందేశమిస్తూ ఎంఎల్‌సిలను గెలిపించుకోవడంతో యుటియఫ్ బాధ్యత మరింత పెరిగిందన్నారు. ఉద్యమ విస్తరణకు ఈ గెలుపును ఉపయోగించుకోవాలని అందుకు తగిన ప్రణాళికలను సిద్ధం చేసుకోవాలని పిలుపునిచ్చారు. ప్రభుత్వ విద్యారంగాన్ని కాపాడుకోవాలంటూ ప్రచారం కావిస్తామని ఎంఎల్‌సి జార్జివిక్టర్ హామీ యిచ్చారు.

## "ప్రజా చైతన్యానికి నిలువెత్తు సాక్ష్యం ఈ విజయం"

- డా|| కె. నాగేశ్వర్

ఎంఎల్‌సి కె. నాగేశ్వర్ సందేశమిస్తూ ఎంఎల్‌సిల విజయం ఒక గొప్ప ఆత్మ విశ్వాసాన్ని కలిగించిందన్నారు. ప్రపంచబ్యాంకు విధానాలకు వ్యతిరేకంగా ఉద్యమించిన ప్రజా చైతన్యానికి ఈ విజయం నిలువెత్తు సాక్ష్యం అన్నారు. ఈ ఎన్నికలు ప్రపంచ బ్యాంకుకు, మత ఛాందస వాదులకు గట్టి బుద్ధి చెప్పాయనీ అన్నారు. ఎయిడెడ్ పాఠశాలలను మూసి వేస్తారనీ, గ్రాంటు నిలిపివేస్తారనే ప్రచారాలు జరుగుతున్నాయి. ప్రభుత్వ విద్యారంగాన్ని రక్షించడానికి యుటియఫ్ ఆధ్వర్యంలో ఒక బలమైన ప్రజా ఉద్యమాన్ని నిర్మించాలనీ, ప్రైవేటు పాఠశాలల్లోని ఉపాధ్యాయులను కూడా యుటియఫ్ జెండా నీడకు చేర్చాలనీ, రాబోయే ఎన్నికల్లో విద్య అన్ని రాజకీయ పార్టీలకు ప్రధాన ఎజెండాగా మారాలని ఆ వైపు కృషి సాగించాలని అన్నారు.

జనవిజ్ఞాన వేదిక రాష్ట్ర కార్యదర్శి టి. రమేష్, సిఐటియు నాయకులు డి.వి. కృష్ణ, ఎస్ఎఫ్ఐ నాయకులు కృష్ణ, డివైఎఫ్ఐ నాయకులు ప్రసాదు మహాసభకు సందేశాలిచ్చారు. సభ ప్రారంభంలోను, మధ్య మధ్య కళాకారులు అభ్యుదయ గీతాలనాలాపించి సభికులను ఉత్సాహపరిచారు. యుటియఫ్ ఉద్యమాలపై కృష్ణా జిల్లా శ్రీనివాస్ ఎం.ఫిల్. పరిశోధనా పత్రానికి సంబంధించిన విశేషాలు, అతనిని సభకు పరిచయం చేయడం ప్రారంభ సభలో ఒక విశేషం. సంయుక్త ప్రధానకార్యదర్శి ఐ. వెంకటేశ్వరరావు వందన సమర్పణ చేశారు.

## రాష్ట్ర వ్యాప్తంగా ఉద్యమాలను, జిల్లాల నిర్మాణాలను సమీక్షించిన ప్రతినిధుల సభ

రాష్ట్ర నాయకత్వం, వెటరన్స్, ప్రత్యేక ఆహ్వానితులు, ప్రతినిధులతో మే 14వ తేదీ మధ్యాహ్నం ప్రతినిధుల సభ ప్రారంభమైంది. రాష్ట్ర అధ్యక్షుల్లు సిహెచ్. సుభాష్‌చంద్రబోస్, గౌ|| అధ్యక్షులు పి. కృష్ణమూర్తి, సహాధ్యక్షులు ఎన్. రమణయ్య శాస్త్రి, రాష్ట్ర కార్యదర్శి సి. కమలకుమారి అధ్యక్షవర్గంగా వ్యవహరిస్తుండగా సభను ప్రారంభిస్తూ ఎంవిఎస్ శర్మ విద్యారంగ ధోరణుల గూర్చి వివరిస్తూ మాట్లాడారు. ప్రాథమిక పాఠశాలలను మూసి వెయ్యడమే తన ప్రథమ కర్తవ్యంగా రాష్ట్ర ప్రభుత్వం భావిస్తున్నదన్నారు. 'గాట్సు'లో విద్యను

చేర్చడానికి డబ్ల్యుటిఓ 2000 సII నుండి ప్రయత్నిస్తున్నదనీ, విద్య గాట్సులో చేరితే విదేశీ చదువులకు తలుపులు బార్లా తెరిచినట్లేనని అన్నారు. మొత్తం ప్రపంచ వ్యాప్తంగా ఉన్నత విద్యపై 55 వేల కోట్ల రూపాయల వ్యాపారం జరుగుతుంటే భారతీయ విద్యార్థులు చెల్లించేది 14 వేల కోట్లు ఉందన్నారు. విద్యను సరుకుగా మార్చారని, విద్యపై పెట్టే ఖర్చును అనవసర ఖర్చుగా భావిస్తున్నారని, గ్లోబలైజేషను ప్రమాదాన్ని ఎదుర్కొవడానికి కొత్త మార్గాలను కనిపెట్టాలన్నారు. ఈ విధానాల వల్ల నష్ట పోతున్న వారిని, వాటిని ఎదిరించి నిలిచి పోరాడుతున్న వారిని గుర్తించి ఐక్య పరిచి ఉద్యమాలు నిర్వహించాలన్నారు. ఉపాధ్యాయ సంఘాలన్నింటిని ఏకతాటిపైకి తీసుకు వచ్చే ప్రయత్నం యుటియఫ్ చేయాలనీ కోరారు. 'విద్యారంగ పరిరక్షణ' అనే డిమాండ్ ప్రధాన ఎజెండాగా ముందుకొస్తున్నదనీ విశాల ప్రజానీకాన్ని కలుపుకుని ఉద్యమించాలన్నారు. విద్యారంగం ఎదుర్కొంటున్న సమస్యలను ప్రస్తావించారు. ప్రభుత్వ విద్యారంగాన్ని పటిష్ఠం చేయకుండా ప్రైవేటు, కార్పొరేటు శక్తులకు విచ్చలవిడిగా అనుమతి ఇస్తున్న ప్రభుత్వ వైఖరిని తూర్పారబట్టారు. వందల ఎకరాలు అప్పనంగా అప్పచెప్పే కాన్సెప్ట్ స్కూళ్ళ ప్రక్రియకు ప్రభుత్వం ఎందుకు ఉత్సాహం చూపుతున్నది? అందులో మతలబు ఏమిటి? అనే విషయాల్ని మనం గమనించాలనీ, ఉచిత నిర్బంధ ప్రాథమిక విద్యను అందించాల్సిన ప్రభుత్వం తన బాధ్యత నుండి తప్పుకునే వైఖరికి పాల్పడడం క్షంతవ్యంకాదనీ, పాలకుల వైఖరి మారకపోతే ఉద్యమాలే శరణ్యం అని అన్నారు. శాఖోపశాఖలుగా విస్తరించిన మన ఉద్యమం ప్రతీ ఉపాధ్యాయుడిని అక్కున చేర్చుకునే మహావృక్షమైందని అభివర్ణించారు.

ప్రధానకార్యదర్శి ఎన్. నారాయణ 9వ మహాసభ నుండి 10వ మహాసభ వరకు జరిగిన కార్యకలాపాల నివేదికను మహాసభకు అందించారు. నివేదికలోని అంశాలను వివరిస్తూ సంస్కరణలకు వ్యతిరేకంగా యుటియఫ్ రాజీలేని పోరు సల్పుతున్నది. రాబోయే కాలంలో చేపట్టవలసిన కార్యక్రమాలకు ఈ మహాసభ దిశా నిర్దేశం చేయాలి. విద్యారంగంలో ప్రధానంగా పాఠశాల విద్యారంగంలో అవినీతి, కుంభ కోణాలవంటి అంశాలు ఎంతో ఆందోళన కలిగిస్తున్నాయి. దొంతర దొంతరలుగా వస్తున్న సమాంతర కార్యక్రమాలను నిర్వహించడం జరుగుతున్నది. సామాజిక న్యాయం కోసం, ఆర్థిక పోరాటాలు జరిపాము. సర్వీసు రూల్సు విషయంలో ప్రభుత్వం నిర్లిప్తంగా ఉండడంతో ఆలస్యం జరుగుతున్నది. ట్రైబల్ వెల్ఫేర్ వారికి సర్వీసు రూల్స్ విషయంలో రెంటికి చెడిన రేవడిలా ఆ డిపార్ట్మెంటు తయ్యారయింది. మేనేజిమెంటు వారీ సమస్యల పరిష్కారం కోసం అనేక పోరాటాలు చేశాము. కులాల పేరుతో ఉపాధ్యాయులను చీల్చే ఉపాధ్యాయ సంఘాల ప్రాబల్యాన్ని తగ్గించే ప్రయత్నం చేశాము. వేర్పాటు ధోరణులను అరికట్టడానికి మనం చేసిన కృషి ఫలించింది. ఈ మూడు సంవత్సరాల కాలంలో స్వతంత్ర కార్యాచరణను ఎంతగా విజయవంతం చేశామో ఐక్య ఉద్యమాలను అంతే విజయవంతం చేశాము. ఇరవై మూడు సంవత్సరాల తరువాత ఐక్య ఉద్యమాలకు నాయకత్వం వహించే స్థాయికి చేరుకున్నాము. కార్యకర్తలందరూ శ్రమించడం వల్లనే మన ఉద్యమానికీ స్థాయి లభించింది. ఎయిడెడ్ సమస్యలపై ఐక్య ఉద్యమం చేపట్టడంలో వైఫల్యం చెందాము. మనవంతు కృషి మనం చేస్తున్నాము. అఖిల భారత ఉద్యమంలో కీలక పాత్రపోషిస్తున్నాము. ఎస్టిఎఫ్ఐ, మహాసభలను, పిలుపులను విజయవంతం చేశాము. కార్యకర్తలను చైతన్యోన్ముఖులను చేసేందుకు ఉద్యమ తరగతులు నిర్వహించుకున్నాము.

స్పెషల్ విద్యావాలంటీర్ల సమస్యల విషయంలో న్యాయ పోరాటం ముమ్మరం చేయవలసిన అవసరం ఉన్నది. అదనపు అర్హతల, కుటుంబ నియంత్రణ ఇంక్రిమెంట్లు రికవరీల నిలుపుదలకై చేసిన న్యాయ పోరాటం ఫలించింది. కులవివక్ష వ్యతిరేక పోరాటానికి, కాంట్రాక్టు లెక్చరర్ల ఆందోళనకు, పూర్తి సహాయ సహకారాలు అందిస్తున్నాము. మనం చేస్తున్న బహుముఖ కార్యక్రమాల వలన మనకు ఆదరణ పెరిగింది. అనేక జిల్లాల్లో ఇతర సంఘాల నుండి మన సంఘానికి వలసలు ప్రారంభమైనాయి. ఎంఎల్సి ఎన్నికల్లో మన సంఘం మాత్రమే ఐక్యంగా పనిచేసింది. మిగిలిన సంఘాలన్ని అనైక్యతతో బజారుకెక్కాయి. అంతర్గత కుమ్ములాటలతో వాటి ఉనికి ప్రశ్నార్థకమయ్యే పరిస్థితులు తలెత్తుతున్నాయి. ఈ పరిస్థితుల్లో మన విస్తరణ సులభ సాధ్యమని కార్యకర్తలు గుర్తించాలి. తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాల నియోజకవర్గంలో మన ఓటమి బాధాకరమైనది. కార్పొరేటు శక్తుల ప్రాబల్యాన్ని అంచనా వేయడంలో లోపం జరిగింది. నిబంధనావళికి సమూల మార్పులు చేసి మహాసభల నిర్వహణకు పూనుకున్నాం. 2003లో జరిపిన 9వ మహాసభ నాటికి 1,02,000గా ఉన్న సభ్యత్వం ఈ మహాసభ నాటికి 1,07,000కు పెరిగింది. మనం చేపట్టిన కార్యక్రమాలకు ధీటుగా సభ్యత్వం పెరగలేదు భవిష్యత్తులో సభ్యత్వం, జనరల్ ఫండ్లపై ప్రత్యేక శ్రద్ధ కనపరచాలి, అన్ని స్థాయిల్లోను ఉద్యమాన్ని ప్రగతి పథంలో నడిపించే కృషిలో ప్రతి ఒక్క సభ్యుడు భాగస్వామి కావాలని కోరుతున్నానంటూ ముగించారు.

కోశాధికారి శ్రీమతి సంయుక్త ఆర్థిక నివేదికను ప్రవేశ పెట్టారు. ఐక్య ఉపాధ్యాయ పత్రిక ప్రధాన సంపాదకులు చావ రవి పత్రిక నివేదికను ప్రవేశ పెడ్తూ పత్రిక స్థాయి పెంచే కృషి చేశామని, కొత్త రచయితలను ప్రోత్సహిస్తున్నామని, పాఠకుల ఉత్తరాలే పత్రికకు మెరుగు పెడతాయని కానీ పాఠకులు ఉత్తరాలే రాయడం లేదని అన్నారు. పత్రిక చందాలు సభ్యత్వ దామాషాకు అనుగుణంగా లేవని, సంవత్సర చందాలతోపాటు, దశాబ్ది చందాల సేకరణపై జిల్లా, మండల కమిటీలు తగు శ్రద్ధ వహించాలని కోరారు. పత్రిక నాణ్యత పెంచడానికి సూచనలు, సలహాలు ఇవ్వవలసిందిగా ప్రతినిధులను కోరారు. రాష్ట్ర ఆడిట్ నివేదికను కన్వీనర్ జి. చిట్టిబాబు, విజయవాడ భవన పునర్నిర్మాణ నివేదికను బాధ్యులు డి. మస్తాన్‌రావు ప్రవేశ పెట్టారు. రాష్ట్ర సహాధ్యక్షులు ఎన్. రమణయ్య శాస్త్రి తీర్మానాలను ప్రవేశ పెట్టారు. నివేదికపై చర్చల్లో అన్ని జిల్లాల ప్రతినిధులు పాల్గొన్నారు. ఎస్. పురుషోత్తమ రావు, ఆర్. నరసింహాచారి (రంగారెడ్డి), ఏ. నర్సిరెడ్డి, ఎన్. బలరామ్ (నల్గొండ), పి.వి.ఎస్.ఆర్.పి. వర్మ (విశాఖ), గిరిధర్ (శ్రీకాకుళం), డి. రాము (విజయనగరం), ఎం. వెంకటేశ్వర్ రెడ్డి, శ్రీనివాసరావు (ప్రకాశం), వై. శ్రీనివాస్ రెడ్డి - (చిత్తూరు), ఎం. సోమేశ్వర్లు (నిజామాబాద్), బి. నరసింహారావు, రాజశేఖర్ (ఖమ్మం), ఎస్. సాల్మీ (పశ్చిమగోదావరి), వెంకటప్ప (మహబూబ్ నగర్), ఎన్. తాండవ కృష్ణ, డి. ప్రభుదాస్ (గుంటూరు), పి. ఇంద్రజిత్ (హైదరాబాదు), ప్రభాకరవర్మ, కె. సత్తిరాజు (తూర్పుగోదావరి), డి. స్వామిరెడ్డి, నారాయణరెడ్డి (ఆదిలాబాద్), పరంధామయ్య (నెల్లూరు), టి. లక్ష్మారెడ్డి(మెదక్), సంజీవ రెడ్డి, ఎన్. పార్వతీశం (కృష్ణ), రమేష్ (అనంతపురం), డి. లక్ష్మీరాజా(కడప), కె. సురేష్ కుమార్ (కర్నూలు), ఎస్. సదానంద్ (వరంగల్), మహిళా ప్రతినిధులు పద్మావతి (గుంటూరు), దుర్గాభవాని (ఖమ్మం), ఆర్.దేవవాణి(తూర్పుగోదావరి) చర్చలో పాల్గొన్నారు.

## విజయవంతమైన మహాసభ

అతి స్వల్ప వ్యవధిలోనే రాష్ట్ర పిలుపునకు స్పందించిన కృష్ణాజిల్లా కమిటీ, విజయవాడనగర కమిటీ మహాసభల నిర్వహణకు మంచి కృషి చేసాయి. రాష్ట్ర కార్యదర్శి బి. నాగేశ్వర రావు నేతృత్వంలో రాష్ట్ర నాయకత్వం సలహాలతో మహాసభల పనులకు ఉద్యుక్తులైనారు. భోజన ఏర్పాట్లు చేయడంలో నిర్వాహకులు, వాలంటీర్లు బాగా కష్టపడ్డారు. భోజన ఏర్పాట్లకు సంబంధించి విజయవాడ ఎం.పి. లగడ పాటి రాజగోపాల్, 1,00,000/-, ఎంఎల్సి చిగురు పాటి వరప్రసాద్ రావు 25,000/- విరాళంగా అందించారు. అతిథులకు, నాయకులకు అందించిన మెమోంటోల నిమిత్తం కృష్ణా జిల్లా పూర్వ ప్రధాన కార్యదర్శి రమేష్ చందు 15,000/- విరాళం అందించారు.

రెండురోజుల మహాసభ విజయవంతంగా ముగిసింది. "విద్యారంగ పరిరక్షణే" తమ ధ్యేయంగా ప్రతినిధులు తమ తమ ప్రాంతాలకు తరలి వెళ్ళారు.

## రాష్ట్ర నూతన కార్యవర్గం ఎన్నిక

రాష్ట్ర ఆడిట్ కమిటీ కన్వీనర్ జి. చిట్టి బాబు, గౌ॥అధ్యక్షులు పి. కృష్ణమూర్తి, ఎన్నికల అధికారులుగా వ్యవహరించి నిర్వహించిన ఎన్నికలలో 120 మంది రాష్ట్ర కార్యవర్గ సభ్యులను మహాసభ ఏకగ్రీవంగా ఎన్నుకొన్నది. అనంతరం కార్యవర్గం రాష్ట్ర ఆఫీస్ బేరర్లను, ఆడిట్ కమిటీని ఏకగ్రీవంగా ఎన్నుకున్నది.

### ఆఫీస్ బేరర్స్

గౌరవ అధ్యక్షులు : సిహెచ్. సుభాష్‌చంద్రబోస్
అధ్యక్షులు : ఐ. వెంకటేశ్వర రావు
సహాధ్యక్షులు : ఎన్. రమణయ్యశాస్త్రి
ప్రధానకార్యదర్శి : ఎన్. నారాయణ
కోశాధికారి : ఎం. సంయుక్త
కార్యదర్శులు : సి. కమలకుమారి (ఆదిలాబాద్), పి. మాణిక్ రెడ్డి (రంగారెడ్డి) బి. నాగేశ్వర రావు (కృష్ణా), పి. బాబురెడ్డి (నెల్లూరు), ఎన్. సోమచంద్రారెడ్డి (చిత్తూరు), సి.కె. నాగేంద్రబాబు (అనంతపురం), ఎన్. కిష్టయ్య (యం. నగర్), కె. విజయగౌరి (విజయనగరం), కె. వెంకట్రావు (ప్రకాశం), సిహెచ్. రవి (ఖమ్మం), ఏ. ఇజ్రాయెల్ రాజు (ప॥గో॥), కె.ఎస్.ఎస్. ప్రసాద్ (తూ॥గో॥), ఎ. నర్సిరెడ్డి (నల్లగొండ), జి. ప్రభుదాస్ (గుంటూరు).

### ఆడిట్ కమిటీ

కన్వీనర్ : సిహెచ్.వి. రాజన్‌బాబ్ (హైదరాబాద్),
సభ్యులు : ఏ. శ్రీనివాస్ (వరంగల్), వి. మాలకొండారెడ్డి (ప్రకాశం) బి.వి. రమణమూర్తి (ప॥గో॥),ఎస్.ఎం. జిలాన్ (అనంతపురం).

### కార్యవర్గ సభ్యులు

డి. రామిరెడ్డి, ఎంఎల్‌సి, వి. బాల సుబ్రహ్మణ్యం, ఎంఎల్‌సి, కె. జార్జివిక్టర్, ఎంఎల్‌సి, పి. కృష్ణమూర్తి, ఎస్‌డి. జియావుద్దీన్, పి. సోమరాజు, కె.ఎస్.వి. దుర్గారావు, జి. చిట్టిబాబు, ఎం.ఏ.కె. దత్తు, డి. మస్తాన్ రావు, కె. కేశవరెడ్డి, (సెంటర్) బి. భాస్కర్ రావు, జి. గిరిధర్, బి. మోహన్ రావు(శ్రీకాకుళం), కె. శేషగిరి, డి. రాము, యస్. మురళీ మోహన్ రావు (విజయనగరం), పి.వి.ఎస్.ఆర్.పి. వర్మ , యన్. సుబ్బారావు, యం. రామసుబ్బారెడ్డి (విశాఖపట్టణం), కె. సత్తిరాజు, జి. ప్రభాకర్ వర్మ, యస్. జ్యోతిబసు, టి. సూర్యనారాయణ, కె. సత్యనారాయణ (అమలాపురం), యన్. అరుణకుమారి (తూర్పుగోదావరి), కె. పార్థసారథి, యస్.కె. సాల్టీ, యస్. సత్యవతి, ఎం.ఐ. విజయకుమార్, జి. రవికుమార్, జి. కృష్ణ (పశ్చిమగోదావరి), యస్. పార్వతీశం, పి. వెంకటేశ్వరరావు, కె. సంజీవరెడ్డి, కె.ఎ. ఉమామహేశ్వర రావు, సిహెచ్. పద్మావతి (కృష్ణా), యన్. తాండవకృష్ణ, టి.ఎస్.ఎన్. మల్లేశ్వరావు, పి. అనంతలక్ష్మి, కె. శ్రీనివాస్ రెడ్డి, ఏ.వి. సత్యనారాయణ,యం. పోలయ్య (గుంటూరు), యమ్. వెంకటేశ్వర రెడ్డి, కె. శ్రీనివాసరావు, పి. రాజసులోచన, కె. వీరాంజనేయులు, కె. తిరుపతి రెడ్డి, టి. రమేష్, టి. రమేష్ (ప్రకాశం), కె. పరాంధామయ్య, అజయ్ సంపత్ కుమారి, సి. చంద్రశేఖర్, ఎం.వి. చలపతి, టి. కొండాచారి (నెల్లూరు), జి. శ్రీరామమూర్తి, వై. శ్రీనివాస్ రెడ్డి, డి. నిర్మల, కె. రమణయ్య, వై. చంద్రశేఖర్ రెడ్డి (చిత్తూరు), బి. సుబ్బారెడ్డి, డి. లక్ష్మీరాజ, పి.వి. రమణారెడ్డి (కడప), యన్. నరసింహుడు, కె. సురేష్ కుమార్, డి. రామశేషయ్య (కర్నూలు), బి. నరసింహారావు, జి. రాశేఖర్, యం. ఇందిరా జ్యోతి, కె. నాగేశ్వర రావు, జి.వి. నాగమల్లేశ్వర రావు (ఖమ్మం), సి. స్వామిరెడ్డి, ఎ.వెంకట్, పి. ప్రభాకర్ రావు (ఆదిలాబాద్), యస్. సదానంద్, యం. జయప్రకాశ్ (వరంగల్), ఏ.పి. మల్లయ్య, కె. రామదాస్ (మహబూబ్‌నగర్), యన్. బలరామ్, జి. ఉషాదేవి, పి. లక్‌పతినాయక్, సిహెచ్. రాములు (నల్గొండ), ఏ. పోశెట్టి, యం.వి. సోమేశ్వర్లు (నిజామాబాద్), రియాజ్ అహ్మద్ ఖాన్, లక్మారెడ్డి (మెదక్), యన్. పురుషోత్తమ రావు, ఆర్. నరసింహాచారి, డిఎల్. ప్రసన్న కుమారి (రంగారెడ్డి).

8వ పేజీ తరువాయి

## చర్చాపత్రం

సభలో రూపొందించుకోవాలి. విద్యా రంగంలో పనిచేసే వారందరితో నిత్య సంబంధాలు పెట్టుకొని చైతన్య పరచి సదస్సులు, చర్చా గోష్టులతో ప్రారంభించి క్రమంగా నిరసన ప్రదర్శనలు ఇతర ఆందోళన రూపాలలో, పాల్గోనేలా చేయాలి. విద్యాహక్కు బిల్లు చట్ట బద్ధం చేయటానికి పోరాటం చేయాలి. అందులోని ఉపాధ్యాయ వ్యతిరేక అంశాలు తొలిగించబడాలి.

శాస్త్రీయమైన హేతుబద్ధమైన సిలబస్, పాఠ్య పుస్తకాల రచనకు ఉద్యమించాలి. పరీక్ష విధానంలో విప్లవాత్మక సంస్కరణలు రావాలి. ప్రజాస్వామ్యయుత , పారదర్శకమైన అవినీతిరహిత పాలనా వ్యవస్థకు పోరాడాలి. పేద పిల్లలందరికి హాస్టల్ సౌకర్యం పెంచాలి. మధ్యాహ్న భోజన పథకం తమిళనాడులో లాగ అమలుచేయాలి. పాఠ్య పుస్తకాలు సకాలంలో సప్లయి చేయాలి. నియామకాలు, బదిలీలు, శిక్షణ వేసవి సెలవులలోనే ఇచ్చి పాఠశాల మొదటి పని దినం నుండి పూర్తి విద్యా సం॥ పని చేసేలా ప్రభుత్వ చర్యలు ఉండాలి.

ఉపాధ్యాయ సమస్యల పరిష్కారానికి మండల స్థాయినుండి రాష్ట్ర స్థాయి వరకు ప్రభుత్వం - ఉపాధ్యాయ సంఘాల సమన్వయ కమిటీలు (**Co-Ordination Committee**) ఏర్పాటు చేయాలి. ప్రతి రెండు నెలలకు ఈ కమిటీలు సమావేశం కావాలి. ప్రభుత్వం నేడు విద్యారంగంలో దాదాపు 10 రకాల సంస్కరణలను తీసుకురాబోతోంది.

మరీ విచిత్రకరమైన పరిస్థితి ఏమిటంటే ప్రభుత్వ సొమ్ముతో ప్రైవేటు స్కూల్సు ఎస్. ఎమ్. సి. ఏర్పాటు, 1 నుండి 10వ తరగతుల వరకు ఒకేసారి రికగ్నిషన్సు ఇవ్వటం, మౌలిక వసతుల లేమి, కాన్సెప్ట్ స్కూల్సు, టెంపరరీ స్ట్రక్చర్‌ను అభివృద్ధి చేయటం, పాఠశాలల మూసివేత, పోస్టులను కుదించడం, 3+1వంటి డిగ్రీ కోర్సులు, ఉన్నత విద్యారంగంలో దేశ వ్యాప్తంగా 1500 విదేశీ యూనివర్సిటీల స్థాపనకు అనుమతులు, సర్వీసు రూల్సు పట్ల నిర్లక్ష్య వైఖరి వంటివి విద్యారంగ భవిష్యత్‌కు, సామాన్యులకు విద్యనందించే క్రమంలో ఆందోళన కలిగించే అంశాలుగా ఉన్నాయి.

ఈ పరిస్థితులను సమీక్షించుకుని విద్యారంగ పరిరక్షణ కోసం, ప్రభుత్వ విద్యా సంస్థలపై జరుగుతున్న దాడిని త్రిప్పికొట్టడానికి విశాల వేదికను నిర్మించి, ఉపాధ్యాయ, విద్యా ప్రయోజనాల రక్షణకు ఈ విద్యా సంవత్సర ప్రారంభానికి ముందుగానే కార్యాచరణతో ముందుకు పోవాల్సిన కర్తవ్యం మహాసభపై ఉంది.

### తక్షణ కార్యాచరణ :

1. పాఠశాలల భౌతిక, మౌలిక పరిస్థితులపై సర్వేచేసి, ఆ పరిస్థితులపై ఆందోళన, ప్రచార కార్యక్రమాలు నిర్వహించడం.
2. విద్యారంగానికి రాబోయే ప్రమాదాలను కరపత్ర రూపంలో అన్ని వర్గాలలో ప్రచారం చేయడం.
3. జూన్ నెలలో ప్రభుత్వం నిర్వహిస్తున్న బడిబాటలో చురుకుగా పాల్గొని ఎన్‌రోల్‌మెంటు కొరకు కృషి చేయాలి.
4. బడిబాట కొరకై మన సంఘంగా పోస్టర్‌ను విడుదల చేయడం
5. గ్రామాలలో వివిధ వర్గాల ప్రజానీకంతో పాఠశాలలు ప్రారంభించిన తరువాత సభలు నిర్వహించడం.
6. విద్యారంగ పరిరక్షణపై రాష్ట్రస్థాయి సదస్సు జూన్ 4వ వారంలో నిర్వహిచండం.
7. మండల, డివిజన్ స్థాయిల్లో ఉపాధ్యాయులతో సదస్సులను నిర్వహించడం.
8. గిరిజన, మైదాన ప్రాంతాలలో విద్య సమగ్రాభివృద్ధికోసం పాదయాత్రలు, చైతన్య యాత్రలు నిర్వహించడం వంటి కార్యక్రమాలతో విశాలమైన మద్దతును కూడ గట్టడానికి విద్యారంగ పరిరక్షణకు దిశానిర్దేశంగా మన కృషి ఉండాలని ఆకాంక్షిస్తున్నాము.

**(సమయాభావం వల్ల ఈ ముసాయిదాపై మహాసభలో పాక్షికంగానే చర్చ జరిగింది. కూలంకషంగా చర్చించి వీలైనంత త్వరగా సమగ్రమైన కార్యాచరణను రూపొందించేటందుకు కార్యవర్గానికి అనుమతి యివ్వ బడింది.)**

# యుటియఫ్ రాష్ట్ర మహాసభ ఆమోదించిన ముఖ్యమైన తీర్మానములు

1. నూతన పెన్షన్ విధానాన్ని ఉపసంహరించుకోవాలి.
2. కాన్సెప్టు స్కూల్స్ విధానాన్ని విడనాడాలి.
3. జిపిఎఫ్ వడ్డీ రేటును 12%గా పెంచాలి.
4. జనవరి 2007 వాయిదా డిఏను విడుదల చేయలి.
5. ఏకీకృత సర్వీసు రూల్సును పునరుద్ధరించాలి.
6. గ్రేడ్-2 పండితుల అప్‌గ్రేడేషన్ ఉత్తర్వులను వెనుకటి తేదీ నుండి రద్దు చేస్తూ యిచ్చిన యాక్టు 1/2005ను ఉపసంహరించాలి.
7. ఎయిడెడ్, మున్సిపల్ పాఠశాలలోని ఖాళీ పోస్టులను భర్తీ చేయాలి.
8. యాక్ట్ 37/2005 వెంటనే ఉపసంహరించు కోవాలి. ఎయిడెడ్ ఉపాధ్యాయుల అన్ ఎయిడెడ్ సర్వీసు యింక్రిమెంట్లకు రక్షణ కల్పించాలి.
9. ఎయిడెడ్ ఉపాధ్యాయులకు పిఎఫ్ స్కీమును అమలు చేయాలి.
10. ఎయిడెడ్ సిబ్బంది జీతాలపై బడ్జెట్ కంట్రోల్ తొలగించాలి. 010 హెడ్ ద్వారా జీతాలు చెల్లించాలి.
11. ఎయిడెడ్, మున్సిపల్, గిరిజన సంక్షేమ హైస్కూళ్లకు ఇంగ్లీషు, ఫిజికల్ సైన్స్ స్కూల్ అసిస్టెంట్స్ మరియు గ్రేడ్-2 పి.డి. పోస్టులు మంజూరు చేయాలి.
12. విద్యాశాఖలో అవినీతిని అరికట్టాలి. ఎస్ఎస్ఏ కుంభకోణాలపై దర్యాప్తు జరిపి దోషులను శిక్షించాలి.
13. మహిళా ఉపాధ్యాయులకు ప్రసూతి సెలవును 135 రోజులకు మంజూరు చేయాలి.
14. మహిళలకు గర్భకోశ ఆపరేషన్ జరిగినప్పుడు 30 రోజులు వేతనంతో కూడిన సెలవు మంజూరు చేయాలి.
15. ఉచిత పాఠ్యపుస్తకాలను సకాలంలో స్కూల్ పాయింట్‌కు అందించాలి.
16. ఫ్యామిలి ప్లానింగ్ యింక్రిమెంటు, అదనపు అర్హతలకు అదనపు యింక్రిమెంట్లు రికవరీని కోర్టు నిలుపుదల చేసింది. కావున ఎనామలీస్ కమిటీ ఈ విషయాన్ని దృష్టిలో పెట్టుకొని కుటుంబ నియంత్రణ యింక్రిమెంట్లు, అదనపు అర్హత యింక్రిమెంట్లను చెల్లించే విధంగా ప్రభుత్వానికి సిఫారసు చేయాలి.
17. అన్ని జిల్లాలలో ఉప విద్యాధికారి పోస్టులను రెట్టింపు చేసి విద్యారంగ పర్యవేక్షణను పరిపుష్టి చేసేందుకు తగు చర్యలు తీసుకోవాలి.
18. మండల విద్యాధికారి కార్యాలయాలన్నింటికి జూనియర్ అసిస్టెంట్, కంప్యూటర్ ఆపరేటర్, పోస్టులు, సృష్టించి పూర్తి ప్రతిపత్తి కల్పించాలి.
19. పాఠశాల విద్యా కమిటీలకు నియంతృత్వపు నామినేషన్ పద్ధతిని రద్దు చేయాలి.
20. 2003 పిఆర్‌సిలో 12.5% ఇంటి అద్దెగల ప్రాంతాలలో ప్రకటించిన హైదరాబాద్‌ను ఆనుకునియున్న ప్రాంతాలకు గతంలో ఇచ్చిన 20% ఇంటి అద్దెను యధాతథంగా కొనసాగిస్తూ వివరణ ఉత్తర్వులివ్వాలి.
21. అన్ని అప్‌గ్రేడెడ్ హైస్కూళ్ళకు ప్రధానోపాధ్యాయుల పోస్టులను మంజూరు చేయాలి. స్టాఫ్ పేట్రన్ ప్రకారం అన్ని పాఠశాలలకు పోస్టులను మంజూరు చేయాలి.
22. 1989 డిఎస్‌సి బ్యాచ్‌లో 90 తరువాత నియమింపబడిన ఉపాధ్యాయులకు కూడా జి.ఓ. 91ను వర్తింపజేయాలి.
23. అన్ని షెడ్యూల్డ్ ఏజెన్సీ ప్రాంతాలకు ఎస్‌సిఏ ఇచ్చే విధంగా జి.ఓ.ను సవరించాలి. మండల కేంద్రాల స్లాబ్ రేట్లనే నాన్ మండల్ గ్రామాలకు వర్తింప చేయాలి.
24. కొఠారి కమీషన్ సూచన ప్రకారం రాష్ట్ర బడ్జెట్‌లో 30% కేంద్ర బడ్జెట్‌లో 10% విద్యారంగానికి కేటాయించాలి.
25. ప్రైవేటీకరణను, ప్రభుత్వ శాఖల కుదింపును మరియు ఔట్ సోర్సింగ్ విధానాలను నిలుపుదల చేయాలి.
26. ప్రభుత్వ విద్యా వ్యవస్థను నాశనం చేసే ఓచరు విధానం ఆలోచనను విరమించాలి.
27. ఆదాయపు పన్ను మినహాయింపు కొరకు ఇస్తున్న 122 రకాల రాయితీలను తొలగించాలనే ప్రతిపాదనను విరమించుకోవాలి.
28. టెలికాం, రక్షణ, బ్యాంకు, ఇన్సూరెన్సు, బొగ్గు రంగాలలో విదేశీ పెట్టుబడులను నిషేధించాలి.
29. గిరిజన సంక్షేమ మరియు మున్సిపల్ ఉపాధ్యాయులకు ఏకీకృత సర్వీసు రూల్స్‌ను వర్తింప చేయాలి.
30. స్పెషల్ విద్యావాలంటీర్ల సర్వీసును రెగ్యులర్ సర్వీస్‌గా గుర్తించాలి.
31. స్పెషల్ విద్యావాలంటీర్లు మరియు 2003 డిఎస్‌సి ఉపాధ్యాయులకు పాత పెన్షన్ విధానం వర్తింప చేయాలి.
32. ఏజెన్సీ ప్రాంతంలో స్పెషల్ డిఎస్‌సి నిర్వహించి ఉపాధ్యాయ ఖాళీలు భర్తీ చేయాలి.
33. ఎస్‌సి, ఎస్‌టి బ్యాక్‌లాగ్ పోస్టులలో నియామకమైన ఆన్‌ట్రైన్డ్ ఉపాధ్యాయులకు నోషనల్ ఇంక్రిమెంట్లు మంజూరు చేయాలి.

## ప్రమోషన్ ప్రాథమిక హక్కు కాదు : సుప్రీం

ప్రమోషన్ అనేది ప్రభుత్వ ఉద్యోగుల ప్రాథమిక హక్కు కాదని సుప్రీంకోర్టు రూలింగ్ ఇచ్చింది. ఒకవేళ వారికి తగిన అర్హతలున్నప్పటికీ ప్రతిభ, అర్హత అనేవి కేవలం ప్రాథమిక పరిశీలనాంశాలేనని తెలిపింది. 16వ అధికరణ క్రింద ప్రమోషన్ ఏ వ్యక్తి ప్రాథమిక హక్కూ కాదని, కానీ దానిని అడిగే హక్కు మాత్రం ఉద్యోగికి ఉందని ఎస్.బి.సిన్హా, సి.కె.ఠక్కర్‌తో కూడిన ధర్మాసనం వివరణ ఇచ్చింది. ప్రభుత్వ ఉద్యోగాలకు సంబంధించి అందరికీ సమాన అవకాశాలుండాలని 16వ అధికరణం స్పష్టం చేస్తోంది. ఎస్.డి.మజుందార్ అనే ఉద్యోగికి ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్‌గా పదోన్నతి కల్పిస్తూ మిజోరం ప్రభుత్వం తీసుకున్న చర్యను సమర్థిస్తూ ధర్మాసనం ఈ వ్యాఖ్యలు చేసింది. మజుందార్ విషయంలో ఆయన ఉన్నతాధికారి ఇచ్చిన ఏసిఆర్.(వార్షిక రహస్య నివేదిక) ఆధారంగా ప్రమోషన్ ఇవ్వడాన్ని ఆయన సహచరుడు ఎస్.బి. భట్టాచార్జీ సవాలు చేశారు. తనకు మజుందార్ కంటే మరింత మంచి రికార్డు (ఏసిఆర్) ఉందని గౌహతి హైకోర్టులో దాఖలు చేసిన పిటిషన్‌లో ఆయన పేర్కొన్నారు. తన ఏసిఆర్‌ను డిపార్ట్‌మెంటల్ ప్రమోషన్ కమిటీ సరిగా పట్టించుకోలేదని వాదించారు. ఈ పిటిషన్‌ను విచారించినప్పటికీ హైకోర్టు డివిజన్ బెంచ్ మాత్రం మజుందార్‌కు ప్రమోషన్ ఇవ్వడాన్ని సమర్థించింది. మజుందార్‌కు ప్రభుత్వం నిర్దేశించిన అన్ని అర్హతలూ ఉన్నాయని పైగా భట్టాచార్జీ కంటే మజుందార్ 16 సంవత్సరాల సీనియర్ అని పేర్కొంది. ఈ నేపథ్యంలో భట్టాచార్జీ సుప్రీంకోర్టులో అప్పీల్ దాఖలు చేశారు. రికార్డులన్నీ పరిశీలించిన ఉన్నత న్యాయస్థానం, సరైన నిబంధనలు లేని పక్షంలో డిపార్ట్‌మెంటల్ ప్రమోషన్ కమిటీ నివేదికనే ఏకైక అర్హతగా కోర్టు పరిగణించి ఉండేదని తెలిపింది. కానీ ఇలాంటి కేసుల్లో అనుసరించాల్సిన పద్ధతులపై ప్రతిభ, అర్హతల విషయంలో రాష్ట్రానికి కొన్ని విధానాలున్నాయని, అందువల్ల కమిటీ కూడా ఇదే విధానాన్ని స్ఫూర్తిగా తీసుకోవాలని ఉన్నత ధర్మాసనం స్పష్టం చేసింది. అందువల్ల రాష్ట్ర ప్రభుత్వ నిబంధనల ప్రకారం మజుందార్ ప్రమోషన్‌ను సమర్థిస్తూ డివిజన్ బెంచ్ తీసుకున్న నిర్ణయం సరైనదేనని సుప్రీంకోర్టు తీర్పు చెప్పింది.

# యుటియఫ్ రాష్ట్ర మహాసభలలో విద్యారంగ సమస్యలపై ప్రతిపాదించబడిన

# ముసాయిదా చర్చా పత్రం

మనకు స్వాతంత్ర్యం వచ్చి 60సం॥ అయింది. 1950లో రాజ్యాంగం రాసుకున్నపుడు 45 ఆర్టికల్‌లో స్పష్టంగా 10సం॥లో 0-14 సం॥ విద్యార్థులందరికీ నిర్బంధ ఉచిత విద్య అందించడం ప్రభుత్వ బాధ్యత అని వ్రాసుకున్నాం. ఈనాటికి కూడ ఆ లక్ష్యాన్ని సాధించలేక పోయాం. 2001 జనాభా లెక్కల ప్రకారం మన అక్షరాస్యత శాతం 65.2% యస్. సి.,యస్.టి.ల అక్షరాస్యత చాల తక్కువగా ఉంది. మహిళల అక్షరాస్యత 54.16%

ఈ అక్షరాస్యత కూడా దేశమంతటా ఒకే విధంగా లేదు. రాష్ట్రానికి, రాష్ట్రానికి వ్యత్యాసం ఉంది. దక్షిణాది నాల్గు రాష్ట్రాలు - తమిళనాడు, కేరళ, కర్నాటక, పాండిచ్చేరి, కంటే మన అక్షరాస్యత తక్కువగా ఉంది. చాలా మంది విద్యను, అక్షరాస్యతను కలగాపులగం చేస్తున్నారు. కేవలం చదవటం రాయటం వస్తే అది అక్షరాస్యత (లిటరసి) అవుతుంది. దానితోపాటు సంపూర్ణ మనోవికాసం, విషయ పరిజ్ఞానం కూడా వస్తేనే అది విద్య అవుతుంది.

స్వాతంత్ర్యం వచ్చిన 2-5 సం॥ల లోపు దక్షిణ కొరియా, జపాన్, క్యూబా, చైనాలు 96% పిల్లలందరికి విద్య అందించగా శ్రీలంకలో 90% అక్షరాస్యత సాధించారు. లక్ష్యానికి అనుగుణంగా బడ్జెట్ కేటాయింపు జరగాలి. అభివృద్ధి చెందిన దేశాలన్నీ విద్యపై జి.డి.పి.లో 6% డబ్బు ఖర్చు చేసాయి. మనదేశం మొదటి పంచవర్ష ప్రణాళిక నుండి 11వ ప్రణాళిక వరకు విద్యకు కేటాయించిన నిధులు 1-3.5%దాటలేదు. కొంత మంది మనకు వనరులు లేవని మనది పేద దేశం అని వాపోతుంటారు. వాస్తవానికి మనకు మానవ సంపద, ప్రకృతి సంపద పుష్కలంగా ఉంది. దాని వినియోగమే ప్రధాన సమస్య. మనం రాజకీయ నాయకులు, బ్యూరాక్రటిక్ అధికారుల మీద రోజుకు 10 కోట్లు మించి ఖర్చుచేస్తున్నాం. రక్షణ రంగానికి కోరినంత డబ్బు సమకూరుస్తున్నాం. ఒక అత్యాధునిక విమానానికి పెట్టే ఖర్చుతో మన దేశంలోని పిల్లలందరకు మధ్యాహ్న భోజనం అందించ వచ్చు.

విద్యారంగానికి పునాది ప్రాథమిక విద్య . ఆ తరువాత సెకండరీ, కాలేజి, యూనివర్శిటి విద్య. పునాది బలంగా లేని భవనాన్ని నిర్మించినట్లు ఐఐటి లాంటి కొద్ది సంస్థల మీద విపరీతంగా ఖర్చు చేస్తున్నాం, అచ్చట తయారైన మేధావులంతా విదేశాలకు సేవ చేయటానికి పరుగెత్తి పోతున్నారు. దేశ అభివృద్ధికి ఉన్నత విద్య కీలకం అయినది. స్వాతంత్ర్యం వచ్చిన 15సం॥లలో అవసరం మేరకు యూనివర్శిటీల మీద కొంత అధికంగా ఖర్చు చేసారు. ప్రస్తుతం అవసరం తీరిందని వాటికే ప్లాన్ గ్రాంట్ తగ్గించారు. పరిశోధనలు పల్చపడ్డాయి. సెల్ఫ్‌ఫైనాన్స్ కోర్సుల ద్వారా బ్రతకమన్నారు. అందువల్ల య.సి., యస్.టి, పేద పిల్లలు యూనివర్శిటీలకు దూరం అవుతున్నారు. ఈదశలో విదేశీ యూనివర్శిటీలకు ద్వారాలు తెరిచారు. వాటి దుష్ఫలితాలను అధ్యయనం చేయాలి.

కాలేజీ విద్య వ్యాపారంగా మారింది. కార్పోరేట్ విద్య శరవేగంతో అభివృద్ధి చెందుతున్నది. ప్రభుత్వ కాలేజీలను కబళిస్తోంది. ప్రపంచ బ్యాంకు విధానాలకు అనుగుణంగా ప్రభుత్వం కూడా ప్రభుత్వ, ఎయిడెడ్ కాలేజీలను నాశనం చేసి కార్పొరేట్ విస్తరణకు తోడ్పడుతోంది. ప్రభుత్వ కళాశాలల్లో ఖాళీ పోస్టులు నింపటం లేదు.రెగ్యులర్ లెక్చరర్‌లకు బదులు కాంట్రాక్ట్ లెక్చరర్‌లను నియమిస్తున్నారు. కాలేజీలకు ఇన్‌ఫ్రాస్ట్రక్చర్‌కు నిధులు నామ మాత్రంగా ఇస్తున్నారు. కాలానుగుణమైన కోర్సులు ప్రభుత్వ కాలేజీలలో ప్రవేశపెట్టడం లేదు. ప్రజాస్వామ్య మేనేజ్‌మెంట్ స్థానంలో చందా మార్కుల పాలన సాగుతోంది. ఇంజనీరింగ్, మెడికల్ కాలేజీలు కూడా 90% ప్రైవేట్ రంగంలోనే అనుమతిస్తున్నారు. వాటిలో కనీస ప్రమాణాలు లేవు. దొంగరోగులు , దొంగ వైద్యులు పుట్టుకువస్తున్నారు.

ఉన్నత విద్య మార్కెట్ శక్తుల పరమైనది. అందువల్ల కోర్సులన్నీ లాభానికి ఉపయోగపడేవేగాని దేశ అవసరాలకు అనుగుణంగా లేవు. విద్య, వైద్య రంగాలలో బోధనకు మంచి అభ్యర్థులు దొరకటం లేదు. ప్రైవేటు రంగ విస్తరణ వల్ల పేద విద్యార్థులకు ఉన్నత విద్య సాంకేతిక విద్యలలో అవకాశాలు తగ్గిపోతున్నాయి. డబ్బు కలవారికే నాణ్యమైన విద్య అందుబాటులో ఉన్నది.

ప్రాథమిక, ఉన్నత విద్య కూడా సంక్షోభంలో ఉన్నాయి. ఈ రంగంలో కూడా రోజురోజుకు ప్రైవేటు పాఠశాలలు పెరిగిపోతున్నవి. ప్రభుత్వం వారికి కోరిన వరాలు ఇస్తున్నది. గతంలో రికగ్నిషన్ నియమాలు ఉండేవి. ప్రస్తుతం వాటన్నిటిని తుంగలో తొక్కి భవనాలు ఉన్నా లేకున్నా ఆటస్థలాలు లేకున్నా ఒకేసారి పది తరగతులకు 10 సం॥లకు రికగ్నిషన్ ఇస్తోంది. ఈ పాఠశాలల్లో సిబ్బంది అర్హతలు, కనీస సౌకర్యాల గూర్చి ప్రభుత్వం ఏమీ పట్టించుకోవటం లేదు. సంపూర్ణ మానవునిగా వికసించాల్సిన ఈ వయస్సులో పిల్లలు మర మనుషుల్లా మారిపోతున్నారు. కార్పోరేట్ శక్తులు పిల్లలను ఆకర్షించటానికి ఇంగ్లీష్‌మీడియం, కంప్యూటర్ కోర్సులు , ఐఐటి శిక్షణ అంటూ ఆకర్షణీయంగా ప్రచారం చేస్తూ ప్రజలను మభ్య పెడుతున్నారు. ప్రభుత్వ రంగ పాఠశాలలోనైనా కోఠారి కమీషన్ చెప్పిన ప్రమాణాలు పాటించడం లేదు. ప్రతి పాఠశాలకు విశాలమైన తరగతిగదులు, మంచినీరు, మరుగుదొడ్లు, విశాలమైన ఆటస్థలం , గ్రంధాలయం ఉండాలని, ఉపాధ్యాయులకు ఆకర్షణీయ మైన వేతనాలు ఉండాలని, పాఠశాలలో ఆహ్లాదకరమైన విద్యా వాతావరణం ఉండాలని కోఠారి చెప్పారు. కాని నేడు ప్రభుత్వాలు ఈ రంగంమీద సొంత నిధులను ఖర్చు పెట్టకుండా విదేశీ నిధులు మాత్రమే ఖర్చు చేస్తున్నాయి. అందులో పాఠశాల నిర్వహణ, ఉపాధ్యాయుల సర్వీస్ కండిషన్‌లన్ని ప్రపంచ బ్యాంకు చేతులమీదుగా జరుగుచున్నవి.

విద్యా శాఖకు సమాంతరంగా డి.పి.ఇ.పి, సర్వశిక్షా అభియాన్‌లు నడుస్తున్నాయి. నేడు దానికి ప్రత్యేక మంత్రికూడా తోడైనారు. ఒక వరలో రెండు కత్తులు ఇమడవు.

రెగ్యులర్ ఉపాధ్యాయుల బదులు విద్యావాలంటీర్‌లు వచ్చారు. రిటైర్‌మెంట్ సౌకర్యాలు పూర్తిగా రద్దు చేశారు. 2004 సెప్టెంబర్ తరువాత నియమించ బడిన వారికి పెన్షన్ తొలగించారు. ఈ విద్యావాలంటీర్‌లు ఎంత కాలం వాలంటీర్‌లుగా ఉండాలో., ఎప్పుడు రెగ్యులర్ అవుతారో తెలియకుండా ఏళ్ళ తరబడి పని చేస్తున్నారు. అనేక ఉన్నత, ప్రాథమికోన్నత పాఠశాలలో వాచ్‌మెన్, ప్యూన్‌లు లేరు. మంచినీళ్ళు, మరుగుదొడ్లు కూడా 80% పాఠశాలల్లో లేవు. ఖాళీలు ఏళ్ళ తరబడి భర్తీ చేయటం లేదు. ప్రభుత్వ, పంచాయితీ రాజ్ స్కూళ్ళల్లో కూడా సంవత్సరాల తరబడి స్టాఫ్ ప్యాటరన్ ప్రకారం పోస్టులు మంజూరు చేయటం లేదు. ఉపాధ్యాయ విద్యార్థి నిష్పత్తి ఇష్టం వచ్చినట్లు పెంచుతున్నారు. దాని ప్రకారం రేషనలైజెషన్ చేసి ప్రాథమిక పాఠశాలలను మూసివేస్తున్నారు. ఫలితంగా పేదల కాలనీలల్లో పాఠశాలలు మూత పడుతున్నవి. ఈ పాఠశాలలు రక్షించుకొనడానికి తల్లిదండ్రులను సన్నద్ధం చేయాలి.

ప్రాథమిక విద్య వరకైనా తెలుగు మీడియంలో చదవాలనే నిర్బంధం రాష్ట్రంలో లేదు. అందుచేత ఎల్.కె.జి. నుండి ఇంగ్లీష్ మీడియం పాఠశాలలు పుట్టగొడుగుల్లా పుట్టుకొస్తున్నాయి. ప్రభుత్వం కూడా పాఠశాలల బరువు దించుకోవడానికి కాన్సెప్ట్ పాఠశాలల పేరుతో ప్రైవేటు రంగానికి ఎర్ర తివాచీలు పరుస్తోంది. అనేక చోట్ల ఎన్.జి.వోలకు పాఠశాలలు దత్తత ఇస్తోంది. ఇప్పటికే 3, 4 సంస్థలకు వందలాది స్కూళ్ళు దత్తత ఇచ్చారు. వీరు లాభసాటి పాఠశాలలను ఎన్నుకొని దత్తత తీసుకొన్నారు. రెడ్డి ల్యాబ్స్ పరిశోధనల కొరకు గిరిజన గ్రామాలు ఎన్నుకుంటే, బైర్రాజు ఫౌండేషన్ సామాజిక వర్గాన్ని దృష్టిలో పెట్టుకొని పశ్చిమ గోదావరి జిల్లాలో కొన్ని ప్రాంతాలు ఎన్నుకొన్నది.

ఉపాధ్యాయుల న్యాయమైన సమస్యలు కూడా ప్రభుత్వం పరిష్కరించటం లేదు ఉపాధ్యాయులు అంకిత భావంతో పనిచేసే వాతావరణం లేదు. అయినా యు.టి.ఎఫ్. తనకున్న సామాజిక దృక్పధాన్ని, బాధ్యతలను నేరవేర్చటానికి కృషి చేయాలి. ప్రభుత్వం పన్నిన ఉచ్చులో మనం ఇరుక్కొని ప్రభుత్వం సక్రమంగా వ్యవహరించటం లేదు కాబట్టి మనం ప్రేక్షకుల్లా చూస్తూ ఉండటమా? లేక ప్రభుత్వం అనుసరిస్తున్న ఈ ప్రజా వ్యతిరేక విద్యా విధానాన్ని ఎదిరిస్తూ ప్రజలను, విద్యార్థులను చైతన్య పరచి పెద్ద ప్రజా ఉద్యమాన్ని నిర్మించటమా? ఏది మన కర్తవ్యమో చర్చించాలి. దానికి తగు కార్యాచరణ కూడా ఈ మహా

**(తరువాయి 6వ పేజిలో)**

**సంస్మరణ**

# తొలి స్వాతంత్ర్య సంగ్రామం నేర్పుతున్న పాఠాలు

ఆధునిక భారతదేశ చరిత్రలో 1857 తిరుగుబాటు ఒక మూల మలుపు. అది బ్రిటిష్ పాలనకు ఎదురైన మొదటి జాతీయ స్థాయి సవాలుగా చరిత్రలో నిలిచిపోతుంది. భారతదేశంలో జాతీయవాద రాజకీయాలకు ఈ తిరుగుబాటు ఊపిరిపోసింది. బ్రిటిష్ ఇండియాలో అనేక రాజ్యాంగపరమైన మార్పులకు ఈ తిరుగుబాటు శ్రీకారం చుట్టింది. నేడు 150 సంవత్సరాల తర్వాత ఈ తిరుగుబాటును మనం స్మరించు కుంటున్నాము. జాతీయ పునఃనిర్మాణ కార్యక్రమంలో నిమగ్నమైన వారికి ఈ సంస్మరణ నూతనోత్తేజాన్నిస్తుంది.




19వ శతాబ్దంలో సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా తిరుగుబాట్లు చెలరేగాయి. స్పెయిన్ ఆధిపత్యానికి వ్యతిరేకంగా లాటిన్ అమెరికాలో సైమన్ బొలివర్, విప్లవాత్మక భావాలు అలవర్చుకున్న మతబోధకుడు హిడాల్గోల నేతృత్వంలో సాగిన తిరుగుబాట్లు ఈ కోవలో శీర్షస్థానం ఆక్రమిస్తాయి. కానీ తిరుగుబాటులో పాల్గొన్న వివిధ సామాజిక వర్గాల వైవిధ్యం, తిరుగుబాటు విస్తరించిన ప్రాంతాల వైశాల్యం గమనంలోకి తీసుకొంటే 1857లో భారతదేశంలో జరిగిన తిరుగుబాటు మహత్తరమైనదిగా నిలిచిపోతుంది. కొవ్వు పూసిన తూటాలు ఉపయోగించటం అన్న సమస్యపై మొదటిగా ఈ తిరుగుబాటు మొదలైంది. ఈస్టిండియా కంపెనీ అనుసరించిన రాజకీయ వ్యవస్థతో ఛిద్రమైన జీవనాన్ని గడుపుతున్న సామాన్య పౌరులు పెద్ద సంఖ్యలో ఈ తిరుగుబాటులో పాల్గొన్నారు. ఆ విధంగా మొదట్లో సిపాయి తిరుగుబాటుగా ఉన్న ఈ తిరుగుబాటు తర్వాత కాలంలో సాధారణ ప్రజల తిరుగుబాటుగా రూపాంతరం చెందటంతో 1857 సంగ్రామానికి ప్రజల జాతీయ సాయుధ తిరుగుబాటు స్వభావం వచ్చింది. తిరుగుబాటు మొదలైన తొలినాళ్లలో, జూలై 28న అమెరికాకు చెందిన న్యూయార్క్ ట్రిబ్యూన్ అన్న పత్రికలో రాస్తూ కారల్ మార్క్స్ **"ఇది కేవలం సైనిక తిరుగుబాటు కాదు. జాతీయ తిరుగుబాటు"** అని వ్యాఖ్యానించారు. అదే పత్రికలో సెప్టెంబరు 14, 1857న రాసిన వ్యాసంలో మార్క్స్ ఈ సంగ్రామాన్ని 1789 ఫ్రెంచి విప్లవంతో పోల్చారు.

ఫ్రాన్స్‌లో నియంతృత్వానికి మొదటి ప్రతిఘటన సంపన్న వర్గాల నుండే ఎదురైంది. రైతాంగం నుండి కాదు. అదే విధంగా భారతీయ తిరుగుబాటు సైతం మొదటి బ్రిటిష్ వాళ్ల చేతుల్లో వేధింపులకు, చిత్రహింసలకు గురవుతున్న, నిలువునా అవమానాలకు లోనవుతున్న రైతాంగం నుండి ప్రారంభం కాలేదు. దీనికి భిన్నంగా బ్రిటిష్ వాళ్ల చేత పెంచి పోషించబడిన సైనికుల నుండే ఈ తిరుగుబాటు ప్రారంభమైంది

మన దేశానికి చెందిన విద్యావంతులైన చరిత్రకారులు ఈ తిరుగుబాటులో ప్రజల పాత్రనుగానీ జాతీయ స్వభావాన్ని గానీ గుర్తించ నిరాకరిస్తూ దాన్ని కేవలం సిపాయిల పితూరీగానే కొట్టి పారేయటం దురదృష్టకరం. ఈ రకమైన తప్పుడు అభిప్రాయంలో ఉన్న డొల్ల తనాన్ని ఈ మధ్యకాలంలో వెలువడిన అనేక పరిశోధనలు వెల్లడిచేయటం అభినందనీయం. ప్రస్తుతం 1857 తిరుగుబాటు యొక్క జాతీయ స్వభావాన్ని భారతదేశంలోనే కాక విదేశీ చరిత్ర కారులు కూడా అంగీకరిస్తున్నారు.

1857, మార్చి 29 నాడు బారక్‌పూర్‌లోని 34వ పదాతిదళానికి చెందిన మంగళ్ పాండే మొదటి సమిధగా మారినప్పుడే ఈ తిరుగుబాటు మొదలైంది. మొదలైన అనతి కాలంలోనే తిరుగుబాటు తూర్పు, ఉత్తర భారతావనికి వ్యాపించింది. ఢిల్లీ, పట్నా, అర్రాహ్, అజాంగడ్, అలాహాబాద్, గోరఖ్‌పూర్, ఫైజాబాద్, ఫతేపూర్, ఝాన్సీ, లక్నో, కాన్పూరు, ఇటావా, ఫతేగడ్, గ్వాలియర్, షహజాన్‌పూర్, ఆగ్రా, భరత్‌పూర్, రోహిలాకండ్, మధుర, హతరాస్, ఢిల్లీ, మీరట్, బరేలీ, రూర్కిలకు తిరుగుబాటు సెగలు విస్తరించటంతో స్వల్ప వ్యవధిలోనే ఈ పట్టణాలన్నీ తిరుగుబాటుకు ముఖ్యమైన కేంద్రాలుగా మారాయి. 1857, మే 11న మీరట్ రెజిమెంట్ సైన్యం ఢిల్లీని వశపర్చుకుంది. మొఘల్ వంశంలో చివరి వాడైన బహదూర్‌షా జాఫర్‌ను తమ నేతగా ప్రకటించుకుంది.

ఈ ప్రాంతంలో ఉద్యోగాలు కోల్పోయిన తాలూక్‌దార్లు, చితికిపోయిన రైతాంగం, వృత్తిపనివారు సిపాయిలతో జతకట్టి బ్రిటిష్ ఆధిపత్యాన్ని సవాలు చేశారు. భూమి శిస్తు విషయంలో కంపెనీ పాలన సాగించిన ప్రయోగాల వల్ల భూస్వాములు, తాలూక్‌దార్లు తమ భూములు, ఎస్టేట్లు కోల్పోయారు. వారి సామాజిక హోదాకు భంగం కలిగింది. దీంతో పాటు భూ సంబంధాల్లో వచ్చిన ఈ మార్పులు రైతాంగంపై మోయలేని భారాలు వేశాయి. అదేసమయంలో ఇంగ్లాండ్ నుండి కారు చౌకగా పారిశ్రామిక ఉత్పత్తులు దేశంలో కుమ్మరించటంతో పట్టణ ప్రాంతంలో కేంద్రీకృతమైన వృత్తి పనివాళ్లు భారీ సంక్షోభంలో మునిగి పోయారు. ఈ దిగుమతులకు తోడు సాంప్రదాయకంగా వస్తున్న స్థానిక ప్రభువుల పోషణ కూడా వీరికి కరువైంది. ఫలితంగా వీళ్లు వలసపోవటమే కాక జీవనోపాధి కోల్పోయారు. తమ వర్గ వైరుధ్యాలు మర్చి పోయిన జమీందార్లు, రైతులు, చేతివృత్తులవాళ్లు ఇంగ్లీషు ఆధిపత్యాన్ని సవాలు చేస్తూ చేతులు కలిపారు. ఒక అంచనా ప్రకారం 1857 నాటికి దేశంలో ఉన్న జనాభాలో ఐదోవంతు జనాభా ప్రత్యక్షంగా గానీ, పరోక్షంగా గానీ ఈ తిరుగుబాటులో పాల్గొన్నారు.

ఉత్తరప్రదేశ్ అంతటా బ్రిటిష్ వారి ఆధిపత్యం దాదాపుగా కుప్పకూలింది. రోహిలాకండ్‌లో దాదాపు సంవత్సరం పాటు బ్రిటిష్ వాళ్ల ఉనికే కనిపించలేదు. అవధ్‌లోను, దాని చుట్టుపక్క ప్రాంతాల్లోను తిరుగుబాటుదారుల్లో సిపాయిలు ఎవరు, రైతులు ఎవరు అన్నది గుర్తు పట్టటం చాలా కష్టమైన పనిగా మారిందని సమకాలీన బ్రిటిష్ అధికారులు రాశారు. బిజ్నోర్ వంటి చోట్ల సిపాయిల నుండి ఎటువంటి సహకారం అందక ముందే పౌరులు తిరుగుబాటు బావుటా ఎగురవేశారు. బులంద్‌షహర్ వంటి చోట్ల ఆగ్రా నుండి వచ్చిన తిరుగుబాటు సైన్యాలు నగర ప్రవేశం చేయటం, స్థానిక పౌరులు తిరగబడడం ఒకే సమయంలో జరిగాయి. అందువల్లనే తాజా పరిశోధకులు 1857 తిరుగుబాటు చెలరేగిన అన్ని ప్రాంతాల్లోనూ సైనికుల తిరుగుబాటు ముందుగానీ, తర్వాత గానీ సాధారణ ప్రజలు పెద్ద ఎత్తున తిరగబడటం ప్రధాన ధోరణిగా ఉన్నదన్న విషయాన్ని గుర్తిస్తున్నారు. ప్రజల తిరుగుబాటు యూరోపియన్లపై దాడులు చేయటం, చంపటం, ఆంగ్లేయుల నివాసాలు, కార్యాలయాలు ధ్వంసం చేయటం, నీలిమందు ఫ్యాక్టరీలు, భూమి రికార్డులకు సంబంధించిన పత్రాలు తగల బెట్టడం వంటి రూపాల్లో వ్యక్తం అయింది. కొన్ని ప్రాంతాల్లో ఆంగ్లేయులకు స్థానిక ప్రతినిధులుగా ఉన్న వ్యాపార వర్గాలు, వడ్డీ వ్యాపారులపై దాడుల రూపంలో కూడా ఈ ప్రతిఘటన వ్యక్తం అయ్యింది. వాయవ్య ప్రాంతంలో కంపెనీ పాలన ప్రారంభించిన నూతన శిస్తు విధానం కారణంగా భూములు కోల్పోయిన రైతాంగం తమ భూములు తిరిగి సంపాదించుకునే లక్ష్యంతో ఆంగ్లేయులపై తిరుగుబాటు చేశారు. ఆ కాలంలో గంగా నది మొదలుకుని యమునా నది మధ్య వరకు విస్తరించిన ప్రాంతంలో ఏ మతానికి చెందిన వాడైన బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా లేని వ్యక్తిని గుర్తించటం కష్టసాధ్యమైందని "కే" వంటి సమకాలీన చరిత్రకారులు వ్యాఖ్యానించారు. ఈ తిరుగు బాటు పట్ల బెంగాల్ అప్పట్లో శీతకన్ను వేసిందన్న ఆరోపణలు ఉన్నప్పటికీ ఈ మధ్య కాలంలో బెంగాల్ చరిత్రకారులు సాగిస్తున్న పలుపరిశోధనల్లో బెంగాల్‌లో కూడా తిరుగు బాటు ప్రభావం పడిందని, వివిధ ప్రాంతాల్లో అలజడి మొదలైందన్న వాస్తవం వెలుగు చూస్తున్నట్లు తెలుస్తోంది.

ఈ తిరుగుబాటులో ముఖ్యంగా గమనించాల్సిన మరో కీలకమైన అంశం జాతి, కుల, మత ప్రాంత విభేదాలకతీతంగా ప్రజల మధ్య ఏర్పడ్డ సంఘీభావం. తిరుగుబాటుదారుల మధ్య మత సామరస్యం ఉండాలని తిరుగు బాటునేతలు ప్రకటనలు విడుదల చేశారు. ఆంగ్లేయులను పారద్రోలటానికీ, తమ మత సాంప్రదాయాలు, అలవాట్లు కాపాడుకోవటానికీ హిందూ -ముస్లింలు చేతులు

కలపాలని పిలుపు నిచ్చారు. లక్నోలో తిరుగుబాటు సమయంలో ఇస్లాం విజయం అన్న పేరుమీద వెలువడిన కరపత్రాన్ని ఈ సందర్భంగా ప్రస్తావించటం సముచితంగా ఉంటుంది. అజాంగఢ్ ప్రకటనలో భారతీయులందరూ ఏ మతానికి చెందిన వారైనా, వర్గానికి చెందిన వారైనా మతం పట్ల విశ్వాసం లేని ఆంగ్లేయులకు వ్యతిరేకంగా తిరుగుబాటు చేయాలని ప్రజలకు పిలుపు నిచ్చింది. 1857 ఆగష్టు లో తిరుగుబాటు నేత ఫిరోజ్ షా విడుదల చేసిన ప్రకటనలో సైతం ఈ తరహా జాతీయ స్ఫూర్తి స్పష్టంగా విదితం అవుతుంది.

ఆ కాలంలో భారతదేశంలోని హిందూ - ముస్లిం ప్రజలందరూ కంపెనీ ఇనుపగిట్టల కింద నలిగిపోతున్నారన్నది తిరుగులేని సత్యం. కొన్ని ప్రాంతాల్లో తిరుగుబాటుకు నాయకత్వం వహిస్తున్న ముస్లిం నేతలు హిందు ముస్లింల మధ్య విభేదాలు తలెత్తకుండా ఉండటానికి ఈద్ పండుగ సదర్భంగా కూడా కోవధకు పాల్పడరాదని కోరుతూ ప్రకటనలు జారీ చేసినట్లు చరిత్రకారులు వెల్లడిస్తున్నారు.

19వ శతాబ్దికి చెందిన భారతీయులకు అఖిలభారత జాతీయ రాజ్యం అన్న భావన లేనందున ఈ తిరుగుబాటుకు జాతీయ స్వభావం లేదన్న నిర్ధారణకు కొందరు చరిత్రకారులు రావటం దురదృష్టకరం. కానీ పరాయి పాలనకు వ్యతిరేకంగా ప్రజలు తిరగబడ్డఈ ఉద్యమానికి జాతీయ స్వభావం లేదని ఎలా తిరస్కరించగలము ? అదికూడా ఈ తిరుగుబాటు భౌగోళికంగానూ, భాగస్వామ్యం రీత్యాను విస్తరించి ఉన్నప్పుడు ఇది ఎలా సాధ్యమవుతుంది? ఈ ఒక్క ప్రాతిపదిక ఆధారంగానే యూరప్‌లో అనేక దేశాల్లో జరిగిన విప్లవాలను జాతీయ విప్లవాలుగా పరిగణించి, అంగీకరించిన విషయాన్ని మనం మర్చిపోరాదు. ఉదాహరణకు రష్యాలో జరిగిన రైతాంగం నెపోలియన్‌కు వ్యతిరేకంగా పోరాడటం, జోన్ ఆఫ్ ఆర్క్ నాయకత్వంలో ఫ్రెంచి ప్రజలు ఆంగ్లేయులకు వ్యతిరేకంగా పోరాడటం, ఇటలీ ఐక్యత కోసం సాగిన ఉద్యమాలు ఈ కోవకే వస్తాయి. ఇవన్నీ కూడా రష్యాగానీ, ఇటలీగానీ, ఫ్రాన్స్‌గానీ ఇప్పుడు మనం చెప్పుకుంటున్న ఆధునిక అర్థంలో సంపూర్ణ జాతీయ రాజ్యాలుగా పరిణతి చెందక పోయినా ఆ తిరుగుబాట్లు, విప్లవాలను జాతీయ విప్లవాలుగా అంగీకరించాము. పాశ్చాత్య దేశాల పరిణామాలను ఒక గాటన కట్టి, ప్రాచ్య దేశ పరిణామాలను మరో గాటన కట్టే చారిత్రక విశ్లేషణలోని వివక్షను విడనాడాల్సి ఉంది.

1857 తిరుగుబాటు విఫలం అయ్యిందన్న మాట వాస్తవమే. ఆ తర్వాత భారతీయులపై కంపెనీ ప్రభువులు సాగించిన అణచివేత తీవ్రతను కొలిచేందుకు ఏ కొలమానాలు చాలవు. ఇవన్నీ ఎలా ఉన్నా ఈ తిరుగు బాటు నూతన జాతీయ భావాలకు పునాదులు వేసిందన్న విషయాన్ని మాత్రం అంగీకరించాలి. ఇర్ఫాన్ హబీబ్ వంటి ప్రముఖ చరిత్ర పరిశోధకులు చెప్పినదాన్ని బట్టి తిరుగుబాటు నేతలు మత సామరస్యాన్ని కాపాడటానికి ప్రాధాన్యత ఇవ్వటంతో పాటు నూతన జాతీయ వ్యవస్థను కూడా చూడగలిగారు. ఎన్నికల ద్వారా అధికారానికి వచ్చే సైనిక పాలనను ఏర్పాటు చేయాలని ప్రతిపాదించారు. జమీందార్లకు, రైతాంగానికి, వృత్తిదార్లకు ఆర్థిక రాయితీలు హామీ ఇచ్చారు. సిపాయిలకు మెరుగైన వేతనాలు ఇస్తామని వాగ్దానం చేశారు. దేశంలో జాతీయవాదం, ఆధునిక బూర్జువా ఆలోచనలు మొలకెత్తని రోజుల్లో ఈ తరహా జాతీయ దృక్పథంతో ఆలోచించినందుకుగాను తిరుగుబాటు నేతలకు జోహార్లు అర్పించాలి.

1857 తిరుగుబాటు నుండి మనం నేర్చుకోవాల్సిన పాఠం ఏమిటి ? ఎన్ని ఆటు పోట్లు వచ్చినా సామ్రాజ్యవాదాన్ని ఎదిరించి పోరాడక తప్పదని ఈ తిరుగుబాటు నేర్పుతోంది. 1857 తిరుగుబాటుదారులు ఒక లక్ష్యం కోసం పోరాడారు ప్రాణాలర్పించారు పరాయి పాలన నుండి దేశాన్ని విముక్తి చేయాలన్నది వారి లక్ష్యం. భారతదేశంలో కంపెనీ పాలన తారాస్థాయికి చేరుకున్న రోజుల్లో వాళ్లు తిరుగుబాటు స్థాయిని కూడా పెంచారు. ఆఖరి గడియ వరకు భుజం భుజం కలిపి జాతీయ లక్ష్యం కోసం విరామం లేకుండా పోరాడారు. ఈ పోరాటంలో జాతి కుల మత వ్యత్యాసాలు, చీలికలు మర్చిపోయారు. నేడు మన భారత సమాఖ్యకు ఉన్న లౌకిక, ప్రజాతంత్ర విలువల కోసం మనం పోరాటం సాగిస్తున్న ఈ సమయంలో, జాతి ఐక్యతను బలోపేతం చేయటానికి పోరాడుతున్న ప్రస్తుత నేపథ్యంలో, నయా సామ్రాజ్యవాదపు పథకాలను విఫలం చేయటానికి పోరాడుతున్న ఈ సమయంలో 1857 అమరవీరుల నుండి మనం స్ఫూర్తి పొందాలి ఈ తిరుగుబాటు ఉత్సవాలు ఘనంగా జరుపుకోవటానికి కేంద్ర ప్రభుత్వం ప్రత్యేక కమిటీ నియమించటం అభినందనీయం. ఈ ఉత్సవాలు కేవలం ఉన్నత స్థాయి మేధావులు జరుపుకునే ఆలోచనాత్మక సభలకు మాత్రమే పరిమితం కారాదు. భారత చరిత్రలో ఈ గొప్ప సంఘటన పట్ల ఉన్న అన్ని రకాల వికృత వ్యాఖ్యలనూ, వక్రీకరణలనూ సరి చేయటానికి ఈ సందర్భాన్ని ఉపయోగించుకోవాలి ప్రాంతీయ భాషల్లో ఈ తిరుగుబాటులోని మహత్తర ఘట్టాల గురించిన సమాచారాన్ని ప్రచురించాలి. ప్రజలకు అందుబాటులోకి తేవాలి. ప్రాంతీయ భాషల్లోనే అయితే అన్ని స్థాయిల్లోని ప్రజలు అర్థం చేసుకోగలుగుతారు. సాధారణ ప్రజలందరికీ ఈ తిరుగుబాటు నేర్పుతున్న పాఠాలను అందేలా చేయాలి. అప్పుడు మాత్రమే మన స్వాతంత్ర్యోద్యమంలో ఒక మహత్తర ఘట్టంగా ఉన్న ఈ తిరుగుబాటు సంస్మరణ బహుముఖ ప్రయోజనకారిగా ఉండగలదు. ఈ అమరులకు అప్పుడు మాత్రమే నిజమైన నివాళులు అర్పించినట్లు అవుతుంది. మనదేశానికి మరింత మెరుగైన పరిస్థితులు తెచ్చి పెట్టే కృషిలో ప్రాణాలర్పించిన వారికి మనం నివాళి అర్పించినట్లు అవుతుంది. ●

**సంపాదకునికి లేఖ**

## డిఎస్‌సి నియామకాలకు సహకరించండి

**ఆర్యా !**

ప్రతి సంవత్సరం డిఎస్సీ నిర్వహిస్తామని చెప్పి 2004 సం॥లో అధికారంలోకి వచ్చిన కాంగ్రెస్ ప్రభుత్వం అనేక యువజన సంఘాల ప్రతిపక్షాల ఒత్తిడితో 2006 సెప్టెంబరులో డిఎస్సీ పరీక్షలు నిర్వహించింది. ఫలితాలు విడుదలై 6 నెలలు కావస్తున్నా నియామకాలు చేపట్టడంలో ప్రభుత్వం నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నది. నియామకాల కోసం ముఖ్యమంత్రిని, ఇతర అధికారులను కలసి ప్రాధేయపడి నప్పటికి ప్రయోజనం లేకపోయింది. రాష్ట్రంలో 80 వేల టీచర్ పోస్టులు ఖాళీగా వుంటే 20,000 పోస్టులను భర్తీ చేయడానికి నోటిఫికేషన్ ఇచ్చి సరిపుచ్చుకుంది. అధికారంలోకి వచ్చిన తరువాత నిర్వహించిన మొదటి డిఎస్సీని కూడా సంపూర్ణంగా నిర్వహించలేక పోయింది.

డిఎస్సీ నోటిఫికేషన్ మెరిట్ లిస్టు ప్రకటించకుండా నియామకాలు చేపట్టకుండా కోర్టు కేసులు, సర్వీసు రూల్సు పేరుతో కాలయాపన చేస్తూ వస్తున్నది. మంత్రివర్గం ఎ.పి. సబార్డినేట్ సర్వీస్ రూల్స్ అత్యవసర నియామకం నిబంధన 10ఎ(1) కింద నియమిస్తామని ప్రకటనలు గుప్పించడం తప్ప ఆచరణలో చిత్త శుద్ధి కనబరచుట లేదు. అటు ఏ ఉపాధి లేక ఇటు ప్రభుత్వం నియామకాలు చేపట్టకపోవటం వలన అభ్యర్థుల పరిస్థితి అగమ్యగోచరంగా తయారైంది. మీరైనా మా బాధను అర్థంచేసుకొని మా సమస్యపై ప్రభుత్వాన్ని గట్టిగా నిలదీసి మాకు న్యాయం జరిగేలా ఒత్తిడి తేవాలని కోరుతున్నాము.

పి. శ్రీశ్రీ
కన్వీనరు
డిఎస్‌సి 2006 సాధన సమితి, ఆం.ప్ర.

**[illegible]**

**ఖమ్మం జిల్లాకు :-** ఎస్ రాంప్రసాద్, ఎస్‌జిటి(డిఎస్‌సి-2003), పిఎస్ మామిడిపల్లి, రాయికోడ్ (మం), మెదక్ జిల్లా. సెల్ : 9441693981

**పశ్చిమగోదావరి జిల్లాకు :-** జి. అనురాధ, ఎస్‌జిటి, పిఎస్ సిరిపూర్‌కాగజ్ నగర్,(పెట్రోల్‌పంపు), ఆదిలాబాద్ జిల్లా. సెల్ : 9392360199

**విజయనగరం, విశాఖ, శ్రీకాకుళం జిల్లాలకు :-** టి. సూర్య ప్రకాష్, ఎస్‌జిటి, డిఎన్‌టిపిఎస్ బంజరుతండా, నాగిరెడ్డి పేట(మం), నిజామాబాద్ జిల్లా. సెల్ : 9346355374

**ఇంటర్వ్యూ**

# బడిబాట కాదు భూమి బాట కావాలి

దళిత, గిరిజన, బలహీన వర్గాల పిల్లలందరూ బడిలో చేరి నిలకడగా కొనసాగాలన్నా, ఆయా వర్గాలలో విద్యాభివృద్ధి జరగాలన్నా ప్రభుత్వం నిర్వహించాల్సింది బడిబాట కాదు భూమి బాట అని అభిప్రాయ పడుతున్నారు. వ్యవసాయ కార్మిక సంఘం రాష్ట్ర ప్రధానకార్యదర్శి బి. వెంకట్. ఇళ్ళ కోసం, ఇళ్ళ స్థలాల కోసం, సాగుభూముల కోసం రాష్ట్ర వ్యాప్తంగా 195 ప్రజా సంఘాల ఆధ్వర్యంలో గత నెల రోజులుగా ఉధృతంగా సాగుతూ అందరి దృష్టినీ ఆకర్షించిన భూ పోరాట ఉద్యమానికి నాయకత్వం వహిస్తున్న బి. వెంకట్‌తో ఆ ఉద్యమ స్వరూప, స్వభావాలు, అనుభావాలపై ఇంటర్వ్యూ....



బి. వెంకట్

❖ గత నెల రోజులుగా రాష్ట్రంలో ముమ్మరంగా సాగుతున్న భూ ఆక్రమణ ఉద్యమం ప్రాధాన్యత ఏమిటి?

సుదీర్ఘకాలం తర్వాత రాష్ట్రంలో భూ సమస్య ప్రధాన ఎజెండాగా మారింది. 1985 తర్వాత రాష్ట్ర స్థాయి భూ ఉద్యమం జరగటం యిదే మొదటిసారి.

❖ ఈ ఉద్యమంలో భాగస్వాములెవరు? ఎవరి సహకారంతో ఉద్యమం నిర్వహిస్తున్నారు?

లక్షలాదిమంది దళితులు, గిరిజనులు, బలహీన వర్గాలు, మైనార్టీలు, మధ్య తరగతి ప్రజలు, అగ్రవర్ణ పేదలు సైతం ఈ ఉద్యమంలో ప్రత్యక్షంగా పాల్గొంటున్నారు. మహిళలు కూడా పెద్ద సంఖ్యలో పాల్గొంటున్నారు. వ్యవసాయ కార్మికుల సంఘం మొదలు రిటైర్డ్ ఐఏఎస్ అధికారుల వరకు గల 195 ప్రజా సంఘాలు ఐక్యంగా ఈ ఉద్యమానికి నాయకత్వం వహిస్తున్నాయి. ఈ ఉద్యమాన్ని అధికార పార్టీ నాయకులు మినహా అందరూ సమర్థిస్తున్నారు.

❖ మీ పోరాటం ప్రధానంగా ఇళ్ళ స్థలాల కోసమేనా?

పట్టణ ప్రాంతాలలో ఇళ్ళ స్థలాల కోసం, గ్రామీణ ప్రాంతాలలో సాగుభూముల కోసం పోరాడుతున్నాం. గ్రామీణ ప్రాంతాలలో భూమిపైనే ఆధారపడి జీవించే దళిత, గిరిజన వ్యవసాయ కార్మికులు సాగుభూముల కోసం గిరిజన ప్రాంతాలలో పోడు భూములు, అన్యాక్రాంతమైన భూముల స్వాధీనం కోసం పోరాడుతున్నాం. నగరాలు, పట్టణాలలోపై సామాజిక వర్గాలతో పాటు, పేద మైనార్టీలు, మధ్య తరగతి ప్రజలు కూడా పోరాటాలలోకి వస్తున్నారు.

❖ రాష్ట్ర ప్రభుత్వమే అర్హులైన వారందరికీ భూమి పంచుతామని, పేదలకు ఇళ్ళు నిర్మిస్తానని అంటున్నది కదా! అటువంటప్పుడు మీ పోరాటం అవసరమా?

ప్రభుత్వం చేస్తున్నది వాగాడంబరమే కాని వాస్తవం కాదు. అదే నిజమైతే మండటెండల్ని, పోలీసు చర్యలనూ సైతం లెక్క చేయకుండా ఇంత పెద్ద సంఖ్యలో, ఇంత సుదీర్ఘకాలం పోరాటాలలో ప్రజలెలా ర్యాలీ అవుతున్నారు? భూ ఆక్రమణ ఉద్యమానికి లభిస్తున్న మద్దతే ప్రభుత్వ వైఫల్యాన్ని తెలియజేస్తున్నది.

వ్యవసాయ కార్మిక సంఘం ఆధ్వర్యంలో రాష్ట్ర వ్యాప్తంగా 127 మండలాలలోని 127 మొదటి దశ ఇందిరమ్మ ఆదర్శ గ్రామాలలో సర్వే నిర్వహించాము. ప్రభుత్వ లెక్కల ప్రకారమే ఆగ్రామాలలో 38,363 మంది పేదలను ఇండ్ల స్థలాలు పొందడానికి అర్హులుగా గుర్తించారు. అందులో కేవలం 5768 మందికి మాత్రమే (22.12%) స్థలాలిచ్చారు. ఇక ఈ గ్రామాలకు మంజూరు చేసిన పక్కా గృహాలు 37090. నిర్మాణం పూర్తయినవి. కేవలం 5375 (14.49%) ఇప్పటివరకు అసలు పనులే మొదలు పెట్టనివి 15,928 ఆదర్శ గ్రామాల పరిస్థితే ఇంత అధ్వాన్నంగా వుంటే మిగిలిన గ్రామాల పరిస్థితి ఊహించగలం కదా!

ప్రభుత్వం రాజీవ్ గృహకల్ప, రాజీవ్ స్వగృహం అంటూ పథకాలు ప్రనకటించి ప్రజలలో ఆశలు రేకెత్తించి, అర్థాంతరంగా నిలిపివేయడం మినహా నిజంగా పేదలకు ఉపయోగపడింది లేదు. అంతెందుకు ఉద్యోగ, ఉపాధ్యాయులందరికీ ఇళ్ళ స్థలాలు ఇస్తామని ముఖ్యమంత్రి ఘనంగా ప్రకటించారు. ప్రభుత్వం జి.ఓ.లు కూడా యిచ్చింది కదా! మరి మీకెవరికైనా ఇంటి స్థలం లభించిందా? చెప్పండి!

❖ భూ ఆక్రమణ ఉద్యమంలో మధ్యతరగతి వారు కూడా పాల్గొంటున్నా రంటున్నారు కదా? వారికి కూడా ఉచితంగా భూములివ్వాలనడం సమంజసమా?

పేదలకు సాగుభూమి, నివాస స్థలం ఉచితంగా పంపిణీ చేయాల్సిందే! - మధ్యతరగతి ప్రజలకు ఉచితంగా కావాలనటం లేదు. కొనుక్కోగలిగే విధంగా రేటును నిర్ణయించి భూమిని కేటాయించమంటున్నారు. ప్రభుత్వ విధానాల వల్ల నగరాలు, పట్టణాలు మండల కేంద్రాలలో కూడ భూ మాఫియా మొత్తం భూములను తమ స్వాధీనంలోకి తీసుకొని ధరలను విపరీతంగా పెంచడం వల్ల ఇల్లు కట్టుకోగల్గిన వారు కూడా భూములు కొనలేని దుస్థితి దాపురించింది. తమకళ్ళెదుటే తమ పరిసరాలలోని భూమిని మాఫియాలు కబ్జా చేస్తుంటే తట్టుకోలేక, పెరిగే ధరలకు కొనలేక గత్యంతరం లేని స్థితిలో మధ్య తరగతి ప్రజలు కూడా చారెడు నేల కోసం తెగించి పోరాటంలో పాల్గొంటున్నారు.

❖ భూ ఉద్యమంలో మీరు ఎవరి భూములు ఆక్రమిస్తున్నారు?

ఖాళీగావున్న ప్రభుత్వ భూములు, ధనవంతులు చట్ట విరుద్ధంగా కబ్జా చేసిన ప్రభుత్వ భూములు, అన్యాక్రాంతమైన పేదల అసైన్డ్ భూములు మాత్రమే ఆక్రమిస్తున్నాము. చట్టాలకు లోబడి వ్యక్తుల స్వాధీనంలో వున్న భూముల జోలికి పోవడం లేదు.

❖ మీ భూ పోరాటం ఇద్దరు రైతుల ప్రాణాలను బలి తీసుకున్నదంటున్నారు వాస్తమేనా?

పచ్చి అబద్ధం. భూ ఉద్యమానికి, ఆ రైతుల మరణానికి సంబంధమే లేదు. వారి భూములలోకి మేం పోలేదు. ప్రైవేటు వ్యక్తుల స్వంత భూములను ఆక్రమించుకోవటం మా విధానం కానే కాదు. ఈ విషయంలో న్యాయ విచారణకు మేం సిద్ధం. ఇది కేవలం భూ ఉద్యమాన్ని అప్రతిష్టపాలు చేయడానికి అధికార పార్టీ చేస్తున్న దుష్ప్రచారం మాత్రమే.

❖ భూ పోరాటం చట్ట విరుద్ధం కాదా? చట్ట ప్రకారం న్యాయం కోసం ప్రభుత్వం పైన వత్తిడి తేవచ్చు లేదా న్యాయ స్థానాలకు వెళ్ళవచ్చుకదా?

మీ వాదన సమంజసమే! కాని చట్టాలను అమలు జరిపే సంకల్పం, న్యాయ స్థానాల తీర్పులను గౌరవించే విజ్ఞత, చిత్త శుద్ధి ఈ ప్రభుత్వానికి లేవు. కనుకనే ప్రత్యక్ష చర్యకు పూనుకున్నాము.

ఈ రాష్ట్రంలో ఎన్ని రకాల భూములు, ఎందరు పేదలకు పంపిణీ చేసే వీలుందో వివరాలు సేకరించి సమగ్రమైన ప్రతిపాదనలను 2004 ఆగస్ట్ 2న ముఖ్యమంత్రికి అందజేశాము. వాటిని పరిశీలించేందుకు కోనేరు రంగారావు కమిటీని నియమించారు. 2 సం॥ల వరకు ఆ కమిటీ సిఫారసు లేమిటో తెలియదు. ఇటీవల మా భూ పోరాటం తర్వాతనే బలవంతంగా ఆ నివేదిక బహిర్గతం చేశారు. ఆ సిఫారసుల అమలుకు కూడా యింకా అధ్యయనం చేస్తామంటున్నారు. మరి ఈ ప్రభుత్వాన్నెలానమ్ముమంటారు?

పేదలకు అనుకూలమైన అసైన్‌మెంట్ చట్టాన్ని సవరించి, పేదల భూములు సేకరించి పెద్దలకు కట్టబెడుతూ ప్రభుత్వం తిరోగమన భూ

(తరువాయి 14వ పేజీలో)

# ఆంధ్రప్రదేశ్‌లో ప్రాథమిక, మాధ్యమిక విద్యా వ్యాప్తి

ఆంధ్రప్రదేశ్ విస్తీర్ణము, జనాభాలో భారత దేశంలో 5వ స్థానంలో ఉంది. కాని విద్యా విషయకంగా 28వ స్థానంలో ఉంది. 1991లో 4.09% ఉన్న అక్షరాస్యత 2001 నాటికి 61.11%కు చేరింది.

1990 వరకు విద్యా రంగానికి విదేశీ సహాయం తక్కువగా వచ్చేది. రాష్ట్ర ప్రభుత్వం కేంద్ర నిధులపై ఆధారపడి విద్యారంగానికి కేటాయింపులు చేసేది. అరకొర నిధులతో చాలినన్ని పాఠశాలలు కాని, తగినంత మంది ఉపాధ్యాయులుగాని, పాఠశాలలలో తగినన్ని తరగతి గదులు, మంచినీటి సౌకర్యం, మూత్రశాలలు, లైబ్రరీలు మొ॥ అన్ని రకాల అవసరాలు నామ మాత్రంగా తీరేవి. అయినా విద్యారంగంలో ప్రభుత్వ పాత్ర గణనీయంగా ఉండేది. ప్రైవేటు పాఠశాలలున్నా అవి ప్రభుత్వ గ్రాంట్ల మీద ఆధారపడేవి. అప్పటికి విద్య వ్యాపార వస్తువుగా మారలేదు.

1990లో దేశంలో నూతన ఆర్థిక సంస్కరణలు ప్రారంభమైన తర్వాత "విద్య" కూడ లాభసాటి వ్యాపారంగా మారింది. నూతనంగా ధనవంతులైన వర్గాలు నాణ్యమైన విద్య పేరుతో ప్రైవేటు పాఠశాలలకు పిల్లలను పంపడం ప్రారంభించారు. ప్రైవేటు యాజమాన్యాలు కూడా ప్రభుత్వ గ్రాంటును తిరస్కరించి, స్వేచ్ఛగా దోపిడి చేయడం ప్రారంభించారు. ఆంగ్ల భాషా వ్యామోహం పెంచారు. రకరకాల ఆకర్షణలు ప్రవేశ పెట్టారు. ఇండ్లకు వచ్చి పిల్లలను తీసుకొని వెళ్లే పద్ధతి ప్రవేశ పెట్టారు. పిల్లలకు విశ్రాంతి లేకుండా రాత్రింబవళ్లు బట్టీ పద్ధతి అమలులోకి వచ్చింది. ఫలితంగా మన రాష్ట్రంలో 2000-01లో ప్రభుత్వ ప్రాథమిక పాఠశాలలు 54606; అన్ ఎయిడెడ్ 1295, 2004-05 నాటికి అవి వరుసగా 56914-4766కు పెరిగాయి. అప్పర్ ప్రైమరీ 6713 ; 3111 (అన్ఎయిడెడ్) నుండి 2004-05 నాటికి 12,276; 4391కు పెరిగాయి. ప్రైవేటు ప్రాథమిక పాఠశాలల పెరుగుదల గణనీయంగా లేదు. కాని ఉన్నత పాఠశాలలు : 2000-01లో 7749(ప్రై); 2528 (అన్ ఎయిడెడ్); 2004-05లో 9924-4497కు పెరిగాయి.



దీనిని బట్టి ప్రాథమిక విద్యలో ప్రభుత్వ పాత్ర సంతృప్తిగా ఉన్నా ఉన్నత విద్యలో నిరాశగా ఉంది. ఈ ధోరణి కొనసాగితే మరో 10 సం॥లలో ప్రైవేటు పాఠశాలలు ప్రభుత్వ పాఠశాలలను అధిగమిస్తాయి. ఉన్నత పాఠశాలలో గత 5 సం॥లలో కొన్ని మంచి చర్యలు ప్రారంభించారు. 1000 పాఠశాలల్లో కంప్యూటరు విద్య ప్రవేశ పెట్టారు. ఆంగ్లభాష బోధనకు, నాచురల్ సైన్సు బోధనకు ప్రత్యేక ఉపాధ్యాయ పోస్టులు మంజూరు చేశారు. లేబొరేటరీ పరికరాలకు కేటాయింపులు పెంచారు. కాని ముఖ్యమైన ప్రధానోపాధ్యాయ పోస్టులు మంజూరు చేయడం, ఖాళీలు భర్తీ చేయడం నిర్లక్ష్యం చేశారు. ప్రతి పాఠశాలకు తప్పనిసరిగా వాచ్‌మన్, ప్యూన్ నియామకం చేయాలనే విధానం రాలేదు. కంప్యూటర్లిచ్చినా టీచర్లను ఔట్ సోర్సింగు ద్వారా నియమించారు. రెగ్యులర్ బోధనకు, దీనికి సమన్వయం లేదు. కేరళలో 4 సం॥ క్రితం కంప్యూటర్ బోధన ప్రారంభించారు. అన్ని పాఠశాలల్లో ఏక కాలంలో ఈ బోధన చేయడమేగాక గత సంవత్సరం నుండి 10వ తరగతి పబ్లిక్ పరీక్షలలో పరీక్ష సబ్జెక్టుగా చేశారు. మన ప్రభుత్వం కూడ ప్రతి సంస్కరణ శాస్త్రీయంగా, ఏక కాలంలో చెయ్యాలి.

"అందరికీ విద్య" పథకం క్రింద ప్రాథమిక విద్యకు విదేశీ నిధులు విరివిగా వస్తున్నాయి. United Kingdom Overseas Development Authority -ODA సహాయంతో 1984-85 విదేశీ సహాయ కార్యక్రమాలు ప్రారంభమయ్యాయి. మొదట్లో కేవలం టి.సి. సెంటర్లకు భవనాలు నిర్మించడం, బోధనా పద్ధతులలో ఉపాధ్యాయులకు శిక్షణ ఈయడం, అదనపు తరగతి గదులు నిర్మించడం మాత్రమే చేసి విదేశీ సహాయాన్ని మనకు రుచి చూపారు. ఈ పథకం రెండు దశలుగా 1996 వరకు సాగింది. ఈ పథకం క్రింద 1,62,000 మంది ఉపాధ్యాయులకు శిక్షణ యిచ్చారు. 3393 తరగతి గదులు, 1104 టి.వి. సెంటరు భవనాలు నిర్మించారు. దీని కొరకు 72.74 కోట్లు సహాయం చేశారు.

1999లో థాయ్‌లాండులోని "జుమిటన్"లో జరిగిన అంతర్జాతీయ శిఖరాగ్ర సమావేశ నిర్ణయం వల్ల కాని, తర్వాత సెనెగల్ దేశంలోని "డాకార్"లో జరిగిన సదస్సు ఫలితంగా 2015 సం॥ ప్రపంచమంతా నిరక్షరాస్యత నిర్మూలించాలని తీర్మానించారు. దానికనుగుణంగా ప్రాథమిక విద్యకు విదేశీ నిధులు పెద్ద మొత్తంలో వచ్చాయి. 1996-97లో 5 జిల్లాల్లోను (విజయనగరం, నెల్లూరు, కర్నూలు, కరీంనగర్ మరియు వరంగల్లు) రెండవ దశగా 1998 నుండి 2003 వరకు 14 జిల్లాలలో డిపిఇపి పథకం క్రింద నిధులు వచ్చాయి. ఈ మొత్తం విలువ రు. 956.59 కోట్లు. ఈ డబ్బుతో ప్రాథమిక విద్యాభివృద్ధి ప్రత్యేక లక్షణాలతో ప్రారంభమయింది. విద్యాశాఖకు సమాంతరంగా రిజిష్టరు సొసైటీలు పెట్టారు. జిల్లా, రాష్ట్ర స్థాయిలో ఈ సొసైటీలు రిజిష్టరు చేయబడ్డాయి. ఈ నిధులన్నీ ఈ సొసైటి ద్వారానే ఖర్చువుతాయి. విద్యాశాఖ నిర్వీర్యమయింది. పాఠశాలల పర్యవేక్షణా విభాగం పూర్తిగా నాశనమయింది. రెగ్యులర్ టీచరుకు బదులు విద్యావాలంటీర్లు వచ్చారు. వీరికి సర్వీసు భద్రత గాని, చాలినంత వేతనం కాని ఉండదు. తరగతికొక టీచరుకు బదులు ఒకే టీచరు అనేక తరగతులకు బోధించడం చట్టబద్ధమైంది.

ఈ పథకం ముగిసే సమయానికి 2002లో కేంద్ర ప్రభుత్వం సర్వశిక్షా అభియాన్ అనే క్రొత్త పథకం ప్రారంభించింది. అమలులో ఉన్న అన్ని పథకాలు దీనిలో విలీనం చేయబడ్డాయి. ప్రస్తుతం ఈ పథకం ద్వారానే పనులు నిర్వహించబడుతున్నాయి. పాఠశాలలో పిల్లలను చేర్చడానికి, వారు పాఠశాలలు వదలకుండా చూడడానికి, విద్యా ప్రమాణాలు పెంచడానికి రకరకాల పథకాలు అమలు పరచబడుతున్నాయి.

పాఠశాలలు అందుబాటులో ఉండడానికి 5023 ఎడ్యుకేషన్ గ్యారెంటీ స్కీమ్ కేంద్రాలు ప్రారంభించబడ్డాయి. "చదువుకుందాం రా" "బడిబాట" లాంటి ప్రచార కార్యక్రమాలు చేపట్టారు. ప్రజలను భాగస్వాములు చేయడానికి విద్యా కమిటీలు చట్టబద్ధంగా ఏర్పాటు చేయబడ్డాయి. బడిబయట ఉండే పిల్లలను ప్రోగుచేసి, కనీస విద్యా స్థాయి కల్పించి రెగ్యులర్ పాఠశాలలో చేర్పించడానికి 1276 బ్రిడ్జి కోర్సు క్యాంపులు ప్రారంభించారు. మధ్యాహ్న భోజన పథకం అన్ని పాఠశాలలో అమలు జరుగుతున్నది.

పాఠశాలలలో తరగతి గదులు అదనంగా నిర్మించడం, ఉపాధ్యాయుల కొరత ఉన్నచోట విద్యావాలంటీర్లను నియమించడం, ఉపాధ్యాయులకు ఇన్ సర్వీసు శిక్షణ యిచ్చి నాణ్యమైన విద్యా బోధనా పద్ధతులు అమలు జరపడం జరుగుతున్నది. రంగురంగుల పాఠ్య పుస్తకాలు ముద్రించి అందరికీ ఉచితంగా ఈయడం, రెసిడెన్షియల్ పాఠశాలలను, హాస్టళ్లను ఎక్కువగా ప్రారంభించడం జరుగుతున్నది.

యం.ఇ.ఒ.లకు సహాయకారులుగ ప్రతి మండలంలో 3/4 యం.ఆర్.పిలను నియమించి పాఠశాలలలో నిరంతర పర్యవేక్షణతో ఉపాధ్యాయులకు బోధనలో సహాయపడడానికి చర్యలు గైకొనబడ్డాయి. కొఠారి కమీషన్ సిఫారసుల మేరకు స్కూల్ కాంప్లెక్సులు 7000 ఏర్పాటు చేశారు. 10-15 ప్రభుత్వ, జిల్లా పరిషత్ మండల పరిషత్, మున్సిపాలిటీ పాఠశాలలను కలిపి ఈ సముదాయం ఏర్పాటైంది. కేంద్రంలో ఉండే ఉన్నత పాఠశాలగాని, అప్పర్ ప్రైమరీ పాఠశాలగాని లీడ్ స్కూల్ గా ఉంటుంది. ప్రతినెలా ఉపాధ్యాయ సమావేశాలు జరగడం, ఉమ్మడిగా వనరులను వినియోగించుకోవడం దీని ప్రధాన లక్ష్యం.

ఉపాధ్యాయ విద్యార్థి నిష్పత్తి 1:40గా నిర్ణయించారు. కనీసం ప్రతి పాఠశాలలో ఇద్దరు ఉపాధ్యాయులు రెగ్యులర్ లేక విద్యావాలంటీర్లను నియమించారు. ప్రతి రెండు ప్రాథమిక పాఠశాలలకు ఒక అప్పర్ ప్రైమరీ పాఠశాల ఉండాలి అనే విధానాని కనుగుణంగా 4352 ప్రాథమిక పాఠశాలలను అప్పర్ ప్రైమరీ పాఠశాలలుగా మార్చారు. విద్య తక్కువగా ఉన్న ప్రాంతాలలో 313 రెసిడెన్షియల్ పాఠశాలలు (283.40%) ప్రారంభించారు. వెలుగు పథకం క్రింద 60 రెసిడెన్షియల్ పాఠశాలలు ప్రారంభించారు. 1648 ఉన్నత పాఠశాలలకు అదనపు సిబ్బందిని, వసతులు కల్పించారు.

గత 5 సం॥లలో 1.5 లక్షలమంది ఉపాధ్యాయులను, 50 వేల మంది విద్యావాలంటీర్లను నియమించారు. 18081 పాఠశాలలకు రంగుల టెలివిజన్లు, 7000 పాఠశాలలకు విసిపిలు, 48485 పాఠశాలలకు రెడియో మరియు క్యాసెట్ ప్లేయర్లు సప్లయి చేశారు. సి-బి మరియు కె.వి.-బి ఛానళ్ల ద్వారా విద్యా బోధన సాగిస్తున్నారు.

3-5 సం॥లోపు పిల్లలను పాఠశాలకు తయారు చేయడానికి అంగన్ వాడి కేంద్రాలతో పాటు Early Child Hood Education(E.C.E) లు ప్రారంభించారు. వీటి ద్వారా 2003-04 సంవత్సరం నాటికి 5359 సెంటర్ల నుండి 1,17,898 మంది పిల్లలను 1వ తరగతిలోకి చేర్చారు. ఇంకా 19780 నివాస ప్రాంతాలలో ఈ సెంటర్లు ప్రారంభించడానికి ప్రణాళిక వేస్తున్నారు.

ప్రతి పాఠశాలలో సాధారణ రిపేర్లు మొ॥ చేయడానికి ప్రతి పాఠశాలకు సం॥ రు.2000/-లు బోధనోపకరణాలు తయారు చేయడానికి ప్రతి ఉపాధ్యాయునికి రు.500/-లు యిస్తున్నారు. దీని వల్ల ఉపకరణముల సహాయంతో బోధన మెరుగుపడింది. అనియత విద్యా కేంద్రాల ఏర్పాటు మన రాష్ట్రంలో పెద్ద ఎత్తున చేపట్టారు. రెగ్యులర్‌గా పాఠశాలకు రాని పిల్లలను రాత్రిపూటగాని, సాయంత్రం సమయాలలో గాని చదువు చెప్పడం దీని లక్ష్యం. 96-97 సం॥ నాటికి 31,245 అనియత విద్యా కేంద్రాలు ప్రారంభించారు. వీటిలో ఎక్కువ భాగం స్వచ్ఛంద సంస్థలు నడుపుతున్నాయి. దీని కొరకు ఒక్కొక్క కేంద్రానికి రు. 6280/-లు ఖర్చు చేశారు. అయితే ఈ పాఠశాలల్లో చదివిన వారిలో 13.5% మాత్రం రెగ్యులర్ పాఠశాలలో చేరారు. వారిలో కూడ బోగస్ విద్యార్థులు గణనీయంగా ఉన్నారు. రెగ్యులర్ పాఠశాలల్లో చదివే పిల్లల పేర్లే అనియత విద్యా కేంద్రాలలో వ్రాసి వారు అచ్చట చదువుకుని తర్వాత రెగ్యులర్ పాఠశాలల్లో చేరినట్లు రికార్డులలో నమోదు చేశారు.

ఇంత కృషి జరుతున్నా యింకా 4,39,676 మంది పిల్లలు బడి బయట ఉన్నారు. బాలకార్మికులను బడిలోకి రప్పించే కార్యక్రమం మొక్కుబడిగానే జరుగుతున్నది. బాలికలు బడికి రావడం పెరిగింది. పాఠశాలలో మహిళా ఉపాధ్యాయుల నియామకం 35% దాటింది. అది కూడ దీనికి కొంతవరకు తోడ్పడింది.

డిపెప్ పథకాలు గాని, సర్వశిక్షా అభియాన్ గాని కాలపరిమితి వరకే ఉంటాయి. ఆ కాల పరిమితి ముగిసేలోపే రాష్ట్ర ప్రభుత్వం స్వంత వనరులతో స్వంత పథకాలతో 21వ శతాబ్దికి సరితూగే సాంకేతిక పరిజ్ఞానంతో ముందుకు పోవడానికి కృషి చెయ్యాలి. 6-14 సం॥ వయస్సు గల వారందరికీ విద్య రాజ్యాంగ హక్కుగా ఉచిత, నిర్బంధ ప్రాథమిక విద్యా బిల్లు రాబోతుంది. బిల్లు రాలేదు కాని ఆ పేరుతో 3% అదనపు సెస్సు విధించి కేంద్ర ప్రభుత్వం ఏటా వేల కోట్లు అదనపు నిధులు సమకూర్చుకొంటూ అందులో రాష్ట్రాలకు 4 వేల కోట్లు అతి కష్టం మీద ఖర్చు చేస్తుంది.

అందరికీ విద్య ప్రభుత్వ బాధ్యతగా భావించడంలేదు.కాని 70% పేదవారు చదివే ఈ పాఠశాలలను కాపాడడంలో మనకు కూడా బాధ్యత ఉంది. సామాజిక బాధ్యత గుర్తించి ప్రతి ఉపాధ్యాయుడు విద్యా అభివృద్ధిలో పాలు పంచుకోవాలి. సమస్యల కొరకు పోరాడుతూనే ఈ బాధ్యత నిర్వహించాలి.

11వ పేజి తరువాయి

## భూమి బాట ...

సంస్కరణలు అమలు జరుపుతున్నది. ఈ ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన తర్వాత పేదలకు చెందాల్సిన 5 లక్షల ఎకరాలు పెద్ద పెద్ద కంపెనీలకు, వ్యక్తులకు దారాదత్తం చేశారు. స్వయంగా ముఖ్యమంత్రి కుమారునికి, అతని భాగస్వామ్యం ఉన్న రఘురాం సిమెంట్స్, బ్రాహ్మణి స్టీల్స్ తదితర సంస్థలకు 15000 ఎకరాలు కారు చౌకగా కట్టబెట్టారు. ఈ భూముల కేటాయింపు కోసం ఏ ఆటంకమూ లేకుండా పైళ్ళెంత వేగంగా కదులుతాయో గమనిస్తున్నాం. మరి పేదలకు కనీస అవసరమైన ఇంటి జాగా యివ్వాలంటే మాత్రం ఎన్ని ఆటంకాలో, ఎంత నిర్బంధమో చూశారా!

కోకాపేటలో పేదల భూములను ప్రభుత్వం అమ్మితే హైకోర్టు నిలిపి వేసింది. అసైన్‌మెంట్ భూములకు నష్ట పరిహారం చెల్లించాలని హైకోర్టు ఆదేశిస్తే సుప్రీంకోర్టు నుండి స్టే తెచ్చింది. ఇదీ కోర్టు తీర్పులపైన, ప్రభుత్వాని కున్న "గౌరవం" పేదల సంక్షేమంపై ఉన్న "చిత్తశుద్ధి".

ప్రభుత్వం చట్టాన్ని ఉల్లంఘిస్తూ వుంటే, చట్టాన్ని సక్రమంగా అమలు జరపమని మాత్రమే మేం పోరాటం చేస్తున్నాం.

❖ రాజకీయ లబ్ధి కోసమే ఈ పోరాటం నిర్వహిస్తున్నారని కొందరంటున్నారు కదా?

భూ ఆక్రమణ ఉద్యమం ద్వారా రాజకీయ లబ్ధి కలుగుతుందనుకుంటే అలాంటి అభిప్రాయం ఉన్నవారు ఎవరైనా ఈ పోరాటానికి నాయకత్వం వహించి ఆ లబ్ధి పొందవచ్చు కదా! రాజ్యాంగ యంత్రమంతా తమ చేతుల్లోనే వున్న అధికార పార్టీ మరింత సులభంగా భూములు పంపిణీ చేసి అత్యధిక లబ్ధిని పొందవచ్చు కదా! ఎవరి నాయకత్వంలో పేదలకు భూములు దక్కినా మేం సతోషిస్తాం.

❖ ఈ భూ పోరాటంలో ఏం సాధించారు. వచ్చిన అనుభవాలేమిటి?

23 జిల్లాలలో 750 కేంద్రాలలో 75000 ఎకరాల భూమిని పేదలు ఆక్రమించుకున్నారు. పోలీసులు 12 వేలమందిపై కేసులు పెట్టారు. 2 వేలమందిని జైళ్ళకు పంపారు. మహిళలని కూడా చూడకుండా పాశవికంగా లాఠీచార్జీ జరిపి వేలాదిమందిని గాయపరచారు. అయినా ఉద్యమం ఆగలేదు. గత్యంతరం లేని స్థితిలో కొందరు అధికారులు, ఉద్యమకారులు ఆక్రమించుకున్న భూములను సర్వే చేసి పేదలకు కేటాయించటానికి ముందుకొచ్చారు. ఇది మా పోరాట విజయం. మా ఉద్యమంలోని సమంజసత్వానికి నిదర్శనం.

❖ ఈ పోరాటం ఇంకెన్నాళ్ళు కొనసాగిస్తారు?

ప్రతి పేద కుటుంబానికి సాగుభూమి, నివాస స్థలం, మధ్య తరగతి కుటుంబాలకు నివాస స్థలం లభించే వరకు మా పోరాటం కొనసాగిస్తాం.

❖ విద్యారంగం, ఉపాధ్యాయ వర్గంపైన మీ పోరాట ప్రభావం ఏమైనా వుంటుందా?

తప్పనిసరిగా వున్నది. ప్రజలకు భూమి లభిస్తే ఆర్థిక పరిస్థితి మెరుగు పడుతుంది. కొనుగోలు శక్తి పెరుగుతుంది. విద్య పట్ల ఆసక్తి కలుగుతుంది. అందువల్ల తమ పిల్లలకు కనీస అవసరాలు తీర్చి పాఠశాలలకు పంపించ గల్గుతారు. డ్రాపౌట్స్ నిరోధించబడతాయి. ఉత్తీర్ణతా శాతం పెరుగుతుంది. ఉపాధ్యాయుల శ్రమకు తగ్గ ఫలితం దక్కుతుంది. అందుకని ప్రభుత్వం ప్రతియేటా బడిబాటను నిర్వహించే కంటే భూమి బాటను నిర్వహించి పేదలందరికీ సాగుభూమిని, నివాస స్థలాలను పంపిణీ చేయగలిగితే విద్యారంగం సత్వరం అభివృద్ధి సాధిస్తుంది.

**విద్యారంగ వికాసం ఉపాధ్యాయ సంక్షేమం సామాజిక అభ్యున్నతి కొరకు పోరాడే యుటియఫ్‌లో సభ్యులుగా చేరండి**

# సు'దర్శనం'

సుదర్శనం ఇల్లంత సందడిగా ఉంది.

వచ్చే పోయే వాళ్ళతో హడావిడిగా ఉంది.

తెలిసినవాళ్ళు, తెలియనివాళ్ళు, ఎప్పుడూ మాట్లాడే వాళ్ళు, ఎప్పుడూ మాట్లాడని వాళ్ళు, అపుడప్పుడూ మాట్లాడే వాళ్ళు, మిత్రులు, శత్రువులు, అంతా వచ్చి సుదర్శనానికి శుభాకాంక్షలు చెప్పి వెళుతున్నారు.

వచ్చిన అతిథులకు 'టీ'లు సరఫరా చేయలేక ఇంట్లో వాళ్ళు తెగ హైరాన పడిపోతున్నారు.




ఈ ఇబ్బందిని గమనించిన ఒకాయన ఎవరికో ఫోన్ చేసి పెద్ద క్యాన్లతో 'టీ'లు బిస్కట్లు ఇంట్లో పెట్టించి వెళ్ళిపోయాడు.

సుదర్శనం నాన్న గారైతే ఉబ్బి తబ్బిబ్బై పోతున్నాడు. సుదర్శనం భార్యకు ఇంకా నమ్మకంగా లేదు.

సుదర్శనం అమ్మగారు ఈ రాజకీయాలు మనకెందుకురా... అన్నట్టు ముఖం చిట్లించి చూస్తున్నారు.

సుదర్శనం పిల్లలు రశ్మి, రాహుల్ వాళ్ళ నాన్నగారి ఒళ్ళో కూర్చుని దిగడం లేదు.

సుదర్శనానికైతే ఇదంతా ఏదోలా ఉంది.

ఆశ్చర్యం నుంచి తేరుకోక ముందే ఎలక్ట్రానిక్ మీడియా, ప్రింట్ మీడియా వాళ్ళు బిలబిల మంటూ వచ్చేసారు. వాళ్ళు చేసే హడావిడికి సుదర్శనానికి మతిపోయింది.

సార్ మిమ్మల్ని గవర్నర్ ఎమ్మెల్సీగా నామినేట్ చేశారు కదా! మీ రాజకీయ నేపథ్యం చెపుతారా? అడిగాడు ఒక విలేఖరి. సార్.... ఎమ్మెల్సీ అవ్వడానికి అధిష్ఠానానికి ఎంత ముట్ట చెప్పారు? మరో తుంటరి విలేఖరి ఒకరి ప్రశ్న. సార్.... మీకసలు రాజకీయ నేపథ్యం లేదు కదా! గవర్నర్ దృష్టికి మీరెలా వెళ్ళారు? మరో విలేఖరి చవకబారు ప్రశ్న. మేడమ్... గారిని ఎలా కాకా పట్టారు? మరో విలేఖరి చిలిపి ప్రశ్న.

ఈ ప్రశ్నలన్నిటికి సుదర్శనం దగ్గర జవాబు లేదు. కాని ఏదో ఒకటి చెప్పాలి... లేకపోతే ప్రెస్‌వాళ్ళు వాళ్ళకు తోచింది ఏదో రాసేసే ప్రమాదం ఉంది.

సుదర్శనం నోరు తెరిచాడు... అయ్యా.... ఎమ్మెల్సీగా నన్ను గవర్నర్ నామినేట్ చేయడం నాకూ ఆశ్చర్యంగానే ఉంది. కేకలు, కాకాలు నాకసలే తెలియదు... అని చెబుతుండగానే ఢిల్లీ నుంచి ఫోన్.

మేడమ్ లైన్‌లో ఉన్నారు.

సుదర్శనం పక్క గదిలోకి వెళ్ళాడు. సుదర్శనానికి హిందీ రాదు, ఇంగ్లీషు రాదు. మేడమ్ గారి మాటలను అక్కడ నుంచే ఎవరో దుబాసి తెలుగులోకి మార్చి చెబుతున్నాడు. వెంటనే ఢిల్లీకి రమ్మంటూ ఆ ఫోన్ సారాంశం.

విలేఖర్లను ఆ వేళకు ఏదో నచ్చ చెప్పి పంపేసాడు సుదర్శనం.

ఇంట్లో వాళ్ళకు విషయం చెప్పి సుదర్శనం ఆటోలో మధురపూడి విమానాశ్రయానికి వెళ్ళి పోయాడు. ఫ్లైట్‌లో కూర్చున్న సుదర్శనానికి ఎన్నెన్నో ఆలోచనలు.

ఒక్కసారి ఫ్లాష్‌బ్యాక్‌లోకి వెళితే... కోనసీమలోని ఒక మూరు మూల గ్రామంలో 'తెలుగు పండిట్'గా పనిచేస్తున్నాడు సుదర్శనం. రాజమండ్రిలో ఉంటున్నాడు. తెలుగు భాషపై కాస్త పట్టున్నవాడే. తెలుగు డాక్టరేట్ కూడా చేశాడు. అడపదడపా కథలు, కవితలు, వ్యాసాలు రాస్తున్నాడు. రెండు మూడు పుస్తకాలు అచ్చు కూడా వేశాడు.

సుదర్శనం కుటుంబానికి ఎటువంటి రాజకీయ నేపథ్యం లేదు. కాని సుదర్శనాన్ని ఎమ్మెల్సీగా నామినేట్ చేయడమే ఎవరికి అంతుపట్టని విషయం. మొదటిసారి విమాన ప్రయాణం సుదర్శనానికి ఏమంత ఆనందంగా లేదు. మనస్సు కొత్తగా, వింతగా పరవళ్ళు తొక్కుతుంది.

రెండు గంటల్లో విమానం ఢిల్లీలోని ఇందిరాగాంధీ ఎయిర్ పోర్ట్‌లో ల్యాండ్ అయింది.

సుదర్శనం బిత్తర బిత్తరగా చూస్తూ విమానం దిగాడు.

బయటకు రాగానే ఒకాయన పూలబొకేతో సిద్ధంగా ఉన్నాడు. సుదర్శనాన్ని చూసి విష్ చేశాడు. కారెక్కించుకుని నేరుగా మేడమ్ గారి కార్యాలయానికి తీసుకుపోయాడు.

సుదర్శనానికి అంతా వింతగా ఉంది. కారుదిగి మేడం ఆఫీస్ వైపు ఆ వ్యక్తి సుదర్శనాన్ని తోడ్కొని వెళ్ళిపోయాడు.

మేడమ్‌కు ముకుళిత హస్తాలతో సుదర్శనం నమస్కరించాడు. అంతే చిరునవ్వుతో ప్రతి నమస్కారం చేశారు మేడమ్.

కూర్చోమన్నట్టు మేడమ్ సైగ చేసింది. ఆ విశాలమైన గదిలో కుషన్ సీటు మీద కూర్చున్న సుదర్శనానికి లోపలికి కూరుకుపోతున్నట్టు అనిపించింది కాస్త హుందాగ కూర్చోవడానికి ప్రయత్నించాడు.

సుదర్శనానికి ముఖమంతా ముచ్చెమటలు పట్టేసాయి. చేతులు కాళ్ళు చల్లబడి పోయాయి. ఏసి రూమ్‌లో కూర్చుని చెమటలు కారుస్తున్న సుదర్శనాన్ని చూసి ముసిముసిగా నవ్వుకున్నారు అక్కడి వాళ్ళు.

మేడమ్ హిందీలో ఏదో చెపుతున్నారు. సుదర్శనం ఆసక్తిగా వింటున్నాడు కొన్ని మాటలు అర్థం అవుతున్నాయి.

మేడమ్ మాట్లాడటం అయ్యాక దుబాసి ఆ మేటర్‌ను తెలుగులోకి మార్చి చెప్పడం మొదలు పెట్టాడు... మీకు ఎమ్మెల్సీ రావడం ఆశ్చర్యం కలిగించే ఉంటుంది. మిమ్మల్ని ఎందుకు సిఫార్స్ చేసానంటే గత సంవత్సరం మీరు ఢిల్లీ వచ్చినప్పుడు ఇందిరాగాంధీ మెమోరియల్ హౌస్‌ను సందర్శించారు కదా! అప్పుడు మీరు సందర్శకుల పుస్తకంలో తెలుగులో రాసిన వాక్యాలు నేను అనుకోకుండా మొన్న చూడటం తటస్థించింది దుబాసిదు దాన్ని చదివించాను. మీ భావాలు, మీలోని దేశభక్తి నన్ను ఆకర్షించాయి మీ ఆలోచనలు దేశం కోసం ఉపయోగించుకుంటే బాగుంటుందని నాకు తోచింది. మీకు సర్ప్రైజ్ కలిగించే బహుమతి ఇవ్వాలనుకున్నాను. ఆ బహుమతే ఈ ఎమ్మెల్సీ సీటు. అంతే కాదు మీకు మంత్రి పదవి కూడా దక్కబోతుంది. మీరు ఏ శాఖ అయినా కోరుకోవచ్చు మీకు ఇష్టమేనా....

దుబాసి చెప్పడం ఆపి సుదర్శనం ముఖంలోకి చూసాడు. పిలిచి పిల్లనిస్తే ఎవరైనా వద్దంటారా? సుదర్శనం కొంత సేపు ఆలోచించి సరే అన్నాడు.

మేడమ్ నవ్వింది. వెంటనే ముఖ్యమంత్రికి ఫోన్ చేసి విషయం చెప్పి సుదర్శనాన్ని మరోసారి అభినందించి పంపేసారు.

ఈ విషయం అప్పుడే మీడియాలో ప్రసారం కావడంతో సుదర్శనం ఇంట్లో వాళ్ళకు ఆనందంతో బుర్రలు పాడైపోయాయి.

సుదర్శనం నేరుగా హైదరాబాద్‌లో దిగాడు.

ముఖ్యమంత్రి ప్రత్యేక దూత ఎయిర్ పోర్టుకు వచ్చి సుదర్శనాన్ని రిసీవ్ చేసుకుని ముఖ్యమంత్రి కార్యాలయానికి తీసుకుపోయాడు.

ముఖ్యమంత్రి టేబుల్ మీద మంత్రుల శాఖలకు సంబంధించిన స్లిప్‌లు పరిచి ఉన్నాయి.

అందులో మీకేది కావాలో తీసుకోమన్నాడు ముఖ్యమంత్రి.

సుదర్శనం సందేహిస్తున్నాడు. సందేహించకు బ్రదర్... ఆలసించిన ఆశాభంగం... నీకు కావలసిన శాఖ తీసుకో.... అంటూ ముఖ్యమంత్రి తొందర చేసాడు.

సుదర్శనం భయం భయంగానే ప్రాథమిక విద్యాశాఖ స్లిప్ తీసుకున్నాడు

ముఖ్యమంత్రి కొంచెం తడబడ్డాడు. అమ్మో... గొప్ప చిక్కే తెచ్చాడే .. అని మనసులో అనుకొని.... అయినా ఇది మేడమ్ గారి రికమండేషన్ .. ఇందులో నా ప్రమేయం ఏమిలేదు... అని తనను తాను సముదాయించుకుని సుదర్శనాన్ని ముఖ్యమంత్రి గవరన్నర్ బంగళాకు తీసుకుపోయాడు.

కొన్ని గంటల వ్యవధిలో విద్యామంత్రిగా ప్రమాణ స్వీకారం చేసేసాడు సుదర్శనం.

ప్రమాణ స్వీకారం చేసి బయటకు వచ్చాడో లేదో బయట కార్లు, సెక్యూరిటీ, సెక్రటరీల వద్ద... అంతా హడావిడి.... సుదర్శనం పరిగెట్టుకుంటూ ముఖ్యమంత్రి దగ్గరకు వెళ్ళాడు. అయ్యా.... నాకు ఈ కార్లు, సెక్యూరిటీ, సెక్రటరీలు వద్ద ఒక గుమస్తాను ఇస్తే చాలు. మరో విషయం ... ఈ రెండు సంవత్సరాలు అయిన తర్వాత నా ఉద్యోగం నాకు ఇప్పించండి. అని మొర పెట్టుకున్నాడు సుదర్శనం.

సుదర్శనం కోరికను మన్నించి అప్పటికప్పుడు ప్రత్యేక జి ఓ.లు తయారు చేయించాడు.

ముఖ్యమంత్రి వద్ద సెలవు తీసుకుని ఆటోలో నేరుగా సెక్రటేరియట్‌కు వెళ్ళి పోయాడు సుదర్శనం.

తన చాంబర్‌లో కూర్చుని సెక్రటరీని పిలిచాడు. సెక్రటరీ పరిగెట్టుకుంటూ వచ్చి ఇంగ్లీషులో చెప్పడం మొదలు పెట్టాడు.

అంతే సుదర్శనానికి చిర్రెత్తుకొచ్చింది. నీకు తెలుగొచ్చా అడిగాడు సుదర్శనం.

వచ్చుసార్...

అయితే తెలుగులో మాట్లాడు....

అలాగే సార్....

మన పాఠశాలల ప్రగతి ఎలా ఉంది? ప్రశ్నించాడు సుదర్శనం.

చాలా బాగుంది సార్... ఉపాధ్యాయులకు నెలకు నాలుగైదుసార్లు ట్రైనింగ్‌లు ఇస్తున్నాం, బోలెడన్ని పుస్తకాలు సరఫరా చేస్తున్నాం, ప్రతి మండలానికి ఎంఆర్‌పిలు, డి.ఆర్‌పిలను నియమించాం. ఉపాధ్యాయులపై నిఘా తీవ్రం చేశాం, సర్వశిక్షా అభియాన్ నిధుల్ని ఎలాగోలా ఖర్చు చేయించడానికి చూస్తున్నాం, పదవ తరగతిలో ఉత్తీర్ణత శాతం పెరగకపోతే ఆయా టీచర్ల ఇంక్రిమెంట్లు ఆపేస్తున్నాం, రాష్ట్ర బృందాలను జిల్లాలకు పంపించి స్కూల్స్‌పై ఆకస్మిక తనిఖీలు చేయిస్తున్నాం, ప్రతి రోజు పాఠశాలల్లో ఎంచేసారో డేటా పంపించమంటూ ప్రధానోపాధ్యాయులను ఒత్తిడి చేస్తున్నాం. మొత్తం మీద ఉపాధ్యాయులను అటు, ఇటు బెసకకుండా కట్టుదిట్టమైన చర్యలు అమలు చేస్తున్నాం, ఇంకొక చిన్న రహస్యం సార్.... ఉపాధ్యాయులకు అసలు సర్వీస్ రూల్స్ లేకుండా చేసాం, వాళ్ళిప్పుడు కుడితులో పడ్డ ఎలుకులు, వాళ్ళిప్పుడు మనం ఎలా ఆడమంటే అలా ఆడతారు సార్ ... టకటకా చెప్పుకు పోతున్నాడు సెక్రటరీ. సుదర్శనానికి కోపం నసాళానికి అంటింది.

చూడు సెక్రటరీ.... నువ్వు ఏ స్కూల్‌లో చదువుకున్నావ్?

ఇంగ్లీషు మీడియం స్కూల్ సార్...

డబ్బెట్టి విద్యను కొని చదువుకున్నావన్న మాట...

అవును సార్...

అంటే నీకు చదువు విలువ తెలుసుగాని పాఠం చెప్పిన గురువు విలువ తెలియదన్న మాట...

సెక్రటరీ నీళ్ళు నమిలాడు...

నే చెప్పేది ఏంటంటే సార్....

ఇక నువ్వు ఏమి చెప్పద్దు ....

నేను చెప్పింది మాత్రం చెయ్యి. మన శాఖలో ప్రభుత్వ స్కూల్‌లో చదువుకున్న అధికార్లు ఎంత మంది ఉంటారు?

ఒకే ఒక్కడున్నాడు సార్....

అయితే ఆ ఒక్కణ్ణి నా గుమస్తాగా నియమించి మిగిలిన వారిని వేరే డిపార్ట్‌మెంట్లకు తరలించు. కేవలం సర్కార్ బడుల్లో చదువుకుని ఉన్నత స్థానం ఆక్రమించుకున్న అధికార్లను వెతికి మన శాఖలో నియమించు. నీకు మాత్రం సడలింపు ఇస్తాను.

అలాగే సార్.... ఒక్క రోజులో మార్చేస్తాన్ సార్...

సరే గాని విద్యాశాఖలో ఈ రూల్స్‌ని ఫ్రేమ్ చేస్తున్న వారు ఎవరు?

అదా సార్... ఎన్‌సిఇఆర్‌టి వాళ్ళు ఇంగ్లాండ్‌లో శిక్షణ పొంది వచ్చారు సార్. అక్కడ రూల్స్‌ని ఇక్కడ ఎలా అమలు చేయాలో వాళ్ళు మాకు చెప్పారు సార్... మేము వాటిని ఇలా అమలు చేస్తున్నాం సార్. కావాలంటే ఈ 'లాప్‌టాప్'లో చూడండిసార్.. అంటూ సెక్రటరీ లాప్‌టాప్‌ను ఆన్ చేయబోయాడు.

సరేసరే.... ఈ గోల నాకొద్దుగాని ఈ రోజు నుంచి నే చెప్పింది చెప్పినట్టే ............చేస్తాం సార్.

సెక్రటరీ వినమ్రంగా బదిలిచ్చి అక్కడ నుంచి వెళ్ళిపోయాడు. మొదటి రోజు విద్యాకమిటీలు రద్దు చేస్తూ జి.ఓ. వెలువడింది. రాష్ట్రంలోని ఉపాధ్యాయులు ఆనందంతో సంబరాలు జరుపుకున్నారు. రెండవరోజు స్కూల్స్ మీద రాజకీయ పెత్తనాన్ని రద్దు చేస్తూ జి.ఓ. జారీ అయ్యింది.

మూడవ రోజు ఎంఆర్‌పి వ్యవస్థ రద్దు.

నాల్గవ రోజు ఉపాధ్యాయులను ట్రైనింగ్ పేరుతో హింసిచ్చొద్దు అంటూ జి.ఓ. జారీ అయ్యింది.

ఐదవ రోజు సర్వశిక్షా అభియాన్ నిధులు ఖర్చు చేయడానికి ప్రతి మండలం నుంచి ఒక రిటైర్డ్ ఉపాధ్యాయుణ్ణి ఎంపికచేసి జిల్లాలో ఒక కమిటీ ఏర్పాటు చేసి ఆ కమిటీ ఆధ్వర్యంలో నిధులు ఖర్చు చేసేలా జి.ఓ. జారీ.

ఆరో రోజు అప్రెంటిస్ విధానం రద్దు చేస్తూ జి.ఓ. విడుదల, 7వ రోజు పాఠశాల నుంచి ఎటువంటి నివేదికలు ఇవ్వనవసరం లేదని జి.ఓ. విడుదల అయ్యింది.

ఒకదాని తర్వాత ఒకటి వస్తున్న జి.ఓ.లను చూసి ఉపాధ్యాయులు ఆనందంతో కేరింతలు కొట్టారు.

ఒత్తిడి తగ్గిపోవడంతో మనస్ఫూర్తిగా పాఠాలు చెప్పడం మొదలు పెట్టారు. రాష్ట్రంలోని అన్ని స్కూళ్ళు 'ఏ' గ్రేడ్ స్థాయికి వచ్చేసాయి. పిల్లలంతా బడిలోనే ఉంటున్నారు. ఉత్తీర్ణతా శాతం పెరిగిపోయింది. సర్కారీ పాఠశాలల ముందు ప్రైవేట్ పాఠశాలలు నిలవలేక పోయాయి. చాలా ప్రైవేట్ పాఠశాలలు మూసేసారు.

ప్రభుత్వ పాఠశాలలన్నీ ప్రగతి పథంలో ఉండటం చూసిన ప్రపంచ బ్యాంక్ బృందం ఈ రహస్యాన్ని ఛేదించటం కోసం కొంత మంది ప్రతినిధులను రాష్ట్రానికి పంపింది. పొరుగు రాష్ట్రాల వారూ బృందాలను పంపిస్తున్నారు. రాష్ట్రంలోని పత్రికలన్ని విద్యామంత్రి సుదర్శనం పేరు పతాక శీర్షికలు పెట్టి ప్రశంసిస్తున్నాయి. సుదర్శనం ఎక్కడికెళ్ళినా జనం నీరాజనాలు పడుతున్నారు. విద్యార్థులకు ఉపాధ్యాయుల ఎడల గౌరవం పెరగడంతో అభివృద్ధి పథంలో దూసుకుపోతున్నారు. రాష్ట్రంలోని ఉపాధ్యాయ సంఘాలన్నీ ఒకే సంఘంగా కలిసిపోయాయి. ఈలోగ విద్యామంత్రి సుదర్శనం మరో విజయం సాధించారు. సర్వీస్ రూల్స్ లేకుండా తల్లడిల్లుతున్న ఉపాధ్యాయులకు వరంగా రాష్ట్రపతి నుంచి ఉత్తర్వులు తెప్పించారు. దాంతో ప్రమోషన్లు, బదిలీలు, నియామకాలు చకచక జరిగిపోయాయి. ప్రతి ఉపాధ్యాయుని ఇంట్లో సుదర్శనం ఫోటో పెట్టుకున్నారు. విద్యార్థులైతే విద్యామంత్రి సుదర్శనానికి మంత్రిగా ఇది చివరిరోజు. సుదర్శనం సెక్రటరీని పిలిచాడు. సెక్రటరీ... ఎలా ఉంది మన విద్యాశాఖ...

బ్రహ్మాండంగా ఉంది సార్... ఉపాధ్యాయులపై ఒత్తిడి లేకపోవడంతో విద్యా ప్రమాణాలు పెరిగాయి సార్. పులిని చూసి నక్క వాతలు పెట్టుకున్నట్టు మేము ఇంగ్లాండ్ నుంచి రూల్స్ తెచ్చి వాటిని అమలు చేయడానికి చూసాం... బోర్లా పడ్డాం. మన భౌగోళిక స్థితి, ప్రజల జీవన స్థితిని బట్టి రూల్స్ ఉండాలనే ఆలోచన మా ఇంగ్లీషు చదువులకు రాలేదు సార్... మీరు గ్రేట్... మీ ఆలోచనలు గ్రేట్.... మీ పథకాలు గ్రేట్... అంటూ ప్రశంసల వర్షం కురిపించాడు సెక్రటరీ.

సుదర్శనం ముసిముసిగా నవ్వుకున్నాడు. ఇందులో నాదేమి లేదు. ప్రభుత్వ బడుల్లో చదువుకున్న అధికారులైతే అక్కడి సాదక బాధకాలు స్పష్టంగా తెలుస్తాయి. అందుకే ముందు మన ఆఫీసులో ప్రక్షాళన చేశాను. రాష్ట్రమంతా మార్పు వచ్చింది... సమర్థులు ఎక్కడో ఉండరు... మన మధ్యలోనే ఉంటారు. వాళ్ళను మనం ఉపయోగించుకోవడం బట్టి ఫలితాలు ఆధారపడతాయి. ఏమంటారు?

ఏమంటాను సార్... మీదే కరెక్టు అంటాను సార్...

సార్ ఈవినింగ్ మన అధికారులు మీకు సెండాఫ్ ఏర్పాటు చేశారు... మీరు తప్పక హాజరు కావాలి.

అలాగే వస్తాను ఎన్ని గంటలకు అడిగాడు సుదర్శనం.

ఐదు గంటలకు సార్.

ఈలోపు టెలిఫోన్ మ్రోగింది.

ఏవండీ... ఏంటా మొద్దు నిద్ర... ఫోన్ రింగ్ అవుతుంది కాస్త చూడండి... అంటూ వంట గదిలోంచి భార్యామణి పెద్దగా కేకేసింది.

నిద్రపోతున్న సుదర్శనం మంచం మీద నుంచి ఉలిక్కిపడి లేచాడు. కళ్ళు నులుముకుని చుట్టూ పరికించాడు.

అంతా అయోమయం... ఇదంతా కలా,.... సుదర్శనం ఒక్కసారిగా నీరు కారిపోయాడు.

ఏవండీ .... లేచారా?... ఆ ఫోన్ చూడండి.... ఆ రింగ్‌టోన్‌కి బుర్ర తిరిగిపోతుంది.... మరలా అరిచింది వంట గదిలోంచి భార్యామణి.

తల ఒకసారి విదిలించుకుని గబగబా వెళ్ళి రిసీవర్ అందుకున్నాడు సుదర్శనం.

హలో... మాష్టారు... అవతలి నుంచి హెడ్ మాష్టారు మాట్లాడుతున్నారు.

చెప్పండి సార్...

ఏంలేదు... ఈ రోజు స్టేట్ టీమ్ మన మండలానికి వస్తుందంట. ఏ స్కూల్‌ని విజిట్ చేస్తారో తెలియదు. కాబట్టి మీరు ఒక గంట ముందు వచ్చేయండి అని చెప్పి ఫోన్ కట్ చేసాడు హెడ్ మాష్టారు. హెచ్ఎం ఫోన్ దెబ్బతో అంతకు ముందు వచ్చిన కలంతా మర్చిపోయాడు సుదర్శనం.

అయితే మనస్సు మాత్రం రోజుకంటే కాస్త తేలికగా ఉండటం సుదర్శనం గమనించక పోలేదు.

చేసేది లేక విచారంగా అడుగులు వేస్తూ బాత్ రూమ్ వైపు పరుగులాంటి నడకతో వెళ్ళిపోయాడు సుదర్శనం.

# అప్రెంటిస్ టీచర్ల వేతన స్థిరీకరణ విధానం

## (జి.ఓ.ఎం.ఎస్.నం. 38, తేది. 26.05.07 ప్రకారం)

న. సూర్యప్రకాశరావు
ఎ.వి. నరసింహారావు
గుంటూరు జిల్లా

ప్రభుత్వ, పంచాయితీరాజ్ పాఠశాలల్లో నియామకం పొందేందుకు 1994లో ప్రభుత్వం విడుదల చేసిన ఉత్తర్వులు జి.ఓ.ఎం.ఎస్.నం. 221, తేది. 16.07.1994 ప్రకారం ఎంపిక కాబడిన ఉపాధ్యాయులు విధులలో చేరిన తేది నుండి రెండు సంవత్సరాలు "అప్రెంటిస్" పీరియడ్‌గా పరిగణింపబడుతుందని పేర్కొనడం జరిగింది. సదరు ఉత్తర్వుల ప్రకారం క్యాటగిరి-3 వారికి అప్రెంటిస్ మొదటి సంవత్సరం రు. 1200/-లు, రెండవ సంవత్సరం రు. 1500/-లు, క్యాటగిరి-2 (స్కూలు అసిస్టెంట్) వారికి మొదటి సంవత్సరం రు. 1500/-లు, రెండవ సంవత్సరం రు. 1800/-లు స్టయిఫండ్‌గా చెల్లించడం జరిగింది. రెండు సంవత్సరాల అప్రెంటిస్ సర్వీసు పూర్తి అయిన మరుసటి రోజు నుండి రెగ్యులర్ స్కేలు మంజూరు చేయడం జరిగింది. 1983లో అమలులోకి వచ్చిన 'స్పెషల్ టీచర్ల'కు రు. 398 విధానానికి భిన్నంగా అప్రెంటిస్ విధానాన్ని ప్రవేశ పెట్టి ఉపాధ్యాయ లోకాన్ని గందరగోళంలో పడేసింది. ఉపాధ్యాయ సంఘాల దీర్ఘకాల పోరాటాల ఫలితంగా ప్రభుత్వం స్పెషల్ టీచర్ల రెండు సంవత్సరాల సర్వీసు కాలాన్ని రెగ్యులర్ సర్వీసుగా పరిగణిస్తూ 119 జి.ఓ. ద్వారా వీరికి ఆటోమేటిక్ అడ్వాన్సుమెంట్ స్కీంను వర్తింపజేస్తూ ప్రభుత్వం ఉత్తర్వులు విడుదల చేసింది. సదరు రెండు సంవత్సరాల కాలాన్ని పెన్షన్ సర్వీసుకు అనుమతించడం జరిగింది.

1995 నుండి అప్రెంటిస్ ఉపాధ్యాయుల నియామకాలు ప్రారంభమయినాయి. అప్రెంటిస్ టీచర్లుగా నియమింపబడిన వారికి రెండు సంవత్సరాలు ప్రొబేషన్ కొరకు పరిగణింపబడుతుందని పేర్కొనడంతో ఈ సర్వీసును అన్ని సౌకర్యాలకు వర్తింప జేస్తారని ఉపాధ్యాయులు భావించారు. కాని ప్రభుత్వం ఈ విషయంపై సరైన ఉత్తర్వులు విడుదల చేయకపోవడంతో 10 సంవత్సరాల కాలం పూర్తయిన పిదపే వీరికి స్పెషల్ గ్రేడు స్కేలు మంజూరు చేయడం జరిగింది. దీంతో విసిగివేసారిన మన సంఘం స్వతంత్రంగానూ, ఇతర ఉపాధ్యాయ సంఘాలను కలుపుకొని పెద్ద ఎత్తున ఆందోళనా కార్యక్రమాలు చేపట్టాము. అయినా ప్రభుత్వ వైఖరిలో మార్పులేదు. పలు దఫాలు ప్రభుత్వంతో జరిపిన చర్చల్లో సానుకూలంగా స్పందించిన ప్రభుత్వం లిఖిత పూర్వకంగా హామీ యిచ్చి చేతులు దులుపుకున్నది. అనివార్యంగా జాక్టో పక్షాన కార్యక్రమాన్నే జరుపవలసి వచ్చింది. ఏప్రిల్‌లో 10వ తరగతి స్పాట్ వ్యాల్యుయేషన్ బహిష్కరించడం కూడా జరిగింది. అరెస్టులు, పికెటింగ్‌లు, ధర్నాలు, లాఠీ దెబ్బలు రాష్ట్ర వ్యాప్తంగా కొనసాగుతున్నా ప్రభుత్వం దిగిరాలేదు. తదుపరి ఉద్యమం తీవ్రరూపం దాల్చింది. ఏకంగా పాఠశాలలనే మూసివేయాలనే నిశ్చయానికి 'జాక్టో' నేతలు వచ్చారు. రాష్ట్రంలోని ఉపాధ్యాయులందరూ ఏక తాటిపై నిలవడంతో ప్రభుత్వానికి దిక్కుతోచని పరిస్థితి ఏర్పడింది. సమ్మె నివారణకు ప్రభుత్వం జాక్టో నేతలతో చర్చలు జరిపింది. ఫలితంగా అప్రెంటిస్ ఉపాధ్యాయుల రెండు సంవత్సరాల కాలాన్ని ఆటోమేటిక్ అడ్వాన్‌మెంట్ స్కీంకు అనుమతిస్తూ (8/16/24 సంవత్సరాల స్కేళ్లు) ప్రభుత్వం అంగీకారం తెలిపింది. ప్రధాన డిమాండ్లలో రెండు నోషనల్ ఇంక్రిమెంట్లు, సదరు కాలాన్ని పెన్షన్‌కు వర్తింపజేయడానికి ప్రభుత్వం నిరాకరించింది. ఈ నేపథ్యంలో ప్రభుత్వం జి.ఓ.ఎం.ఎస్.నం. 38, తేది. 26.05.2007 ద్వారా అప్రెంటిస్ టీచర్లకు ఆటోమేటిక్ అడ్వాన్సుమెంట్ స్కీం వర్తింపజేస్తూ ఉత్తర్వులు విడుదల అయ్యాయి.

ఈ ఉత్తర్వులు ప్రకారం గతంలో కొందరికి 10 సంవత్సరాల సర్వీసు కాలాన్ని పూర్తి చేసుకున్న పిదపే 8 సం॥ల స్పెషల్ గ్రేడు మంజూరు అయింది. అయితే ఇప్పుడు ఈ ఉత్తర్వులు విడుదల కావడంతో నియామక తేదీ నుండి 8 సం॥ల కాలం పూర్తికాగానే స్పెషల్ గ్రేడు మంజూరు అవుతుంది. అంటే 2 సంవత్సరాల ముందే ఈ స్కేలు వస్తుంది. ఈ సందర్భంగా జరిగే వేతన స్థిరీకరణలో కొందరికి ఆర్థిక లాభం ఉంటుంది. మరికొందరికి ప్రస్తుత స్థితే కొనసాగుతుంది. ఏదిఏమైనప్పటికీ సుదీర్ఘ పోరాటం అనంతరం ఈ ఉత్తర్వులు సాధించుకోవడం ఉపాధ్యాయ ఉద్యమ చరిత్రలో మరో సువర్ణ అధ్యాయంగా లిఖించుకోవచ్చు. ఉపాధ్యాయులు అందించిన నైతిక బలం ఈ విజయానికి సోపానం అయింది. ఇప్పుడు వేతన స్థిరీకరణ విధానాన్ని పరిశీలిద్దాం.

**మొదటి ఉదాహరణ :-**

ఉదాహరణకు 1995 డిఎస్‌సి ద్వారా 28.06.1995న నియామకం పొందిన ఒక ఉపాధ్యాయుని వేతన స్థిరీకరణ జి.ఓ.ఎం.ఎస్.నం. 38, తేది. 26.05.2007 ప్రకారం ఈ క్రింది విధంగా జరుగుతుంది. సర్వీసులో చేరిన తేది. 28.06.1995. రెగ్యులర్ స్కేలు పొందిన తేది. 28.06.1997, 1993 పే స్కేలు ప్రకారం ఆర్డినరీ స్కేలు రు. 1975-4010.

**వేతన స్థిరీకరణ :-**

| | ప్రస్తుతం | జి.ఓ. 38 ద్వారా వేతన స్థిరీకరణ |
|---|---|---|
| 28.06.1997 నాటి వేతనం | 1975 | 1975 |
| 1999 పిఆర్‌సి ప్రకారం | | |
| 1.07.1998 నాటి మూలవేతనం (3750-7650) | 3950 | 3950 |
| 1.06.1999 వార్షిక యింక్రిమెంటు | 4070 | 4070 |
| 1.06.2000 వార్షిక యింక్రిమెంటు | 4190 | 4190 |
| 1.06.2001 వార్షిక యింక్రిమెంటు | 4310 | 4310 |
| 1.06.2002 వార్షిక యింక్రిమెంటు | 4430 | 4430 |
| 1.06.2003 వార్షిక యింక్రిమెంటు | 4550 | 4550 |
| 28.06.2003 | 4550 | 4700 (3950-8150) 8 సం॥ స్కేలు |

**గమనిక :-** జి.ఓ. 38 ద్వారా 28.06.1995న అప్రెంటిస్‌గా నియామకం పొందిన ఉపాధ్యాయునికి 8 సం॥ల స్కేలు 28.06.2003 నాటికి అమలవుతుంది. ప్రస్తుతం అమలులో ఉన్న ఉత్తర్వుల ప్రకారం వీరికి 8 సం॥ల స్కేలు 28.06.2005 తేదీ నుండి అమలులో ఉన్నది.

| | | |
|---|---|---|
| 2005 పిఆర్‌సి ప్రకారం | | |
| 1.06.2003 నాటి మూల వేతనం : | 7015 (5470-12285) | 7200 (5750-13030) |
| (1.07.2003 నాటికి రు. 4550 మూలవేతనం గల వారు ఇంక్రిమెంటు తేదీకి ఆప్షన్ ఇచ్చినందున అదే వేతనం కొనసాగించడం జరిగింది) | | |
| 1.06.2005 (వార్షిక ఇంక్రిమెంటు) | 7200 | 7385 |
| 28.06.2005 | 7385 (5750-12285) 8 సం॥ స్కేలు | 7385 |
| 1.06.2006 | 7570 | 7570 |
| 1.06.2007 | 7770 | 7770 |

**రెండవ ఉదాహరణ :**

1995 డిఎస్సీ ద్వారా నియామకం పొందిన మరో ఉపాధ్యాయుడు 1.07.1995న సర్వీసులో చేరివుంటే అతని వేతన స్థిరీకరణ ఈ క్రింది విధంగా ఉంటుంది.

సర్వీసులో చేరిన తేది. 1.7.1995
రెగ్యులర్ స్కేలు పొందిన తేది. 1.07.1997
2005 వేతన స్కేళ్ళలో 1.07.2003

| | |
|---|---|
| మూల వేతనం | 6675 |
| 8 సం॥ల స్పెషల్ గ్రేడు స్కేలులో వేతన నిర్ణయం | 6845 (5750-13030) |
| 1.07.2004 వేతనం(ఇంక్రిమెంటుతో) | 7015 |

**తరువాయి 20వ పేజీలో**

# ఆంగ్లం ఒక్కటే ఆదుకుంటుందా ?

డా॥ చుక్కా రామయ్య

ప్రాథమిక స్థాయి నుంచి విద్యాబోధనలో ఆంగ్ల మాధ్యమాన్ని ప్రవేశపెట్టాలని రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించింది. ప్రపంచీకరణ వేగంగా విస్తరిస్తున్న నేపథ్యంలో అంతర్జాతీయ అవకాశాలను మన భావితరాలు అందుకోవాలన్న ఉద్దేశంతో దిగువస్థాయి నుంచి ఆంగ్లాన్ని ఒక మాధ్యమంగా పరిచయం చేయాలని ప్రభుత్వం భావిస్తోంది. ముఖ్యంగా సేవారంగంలో అంతర్జాతీయ అవకాశాలు మన దేశంలోని ఐటి సంస్థలకు ఇబ్బడిముబ్బడిగా రావడం, దీనిని తట్టుకునేందుకు ఆయా కంపెనీలకు లక్షల్లో యువత అవసరం కావడం, అందునా ఈ తరహా ఎంపికల్లో ఇంగ్లీష్ భాష నిర్ణయాత్మక పాత్ర పోషించడం కారణంగా ప్రభుత్వం ఈ నిర్ణయానికి వచ్చినట్టు భావించాలి. ఇప్పటి వరకు ప్రైవేటు స్కూల్స్‌కు మాత్రమే పరిమితమైన ఇంగ్లీష్ మీడియం ఇకపై సర్కారు ఆధ్వర్యంలోని పాఠశాలలకూ అందుబాటులోకి వస్తుంది. ప్రభుత్వ పాఠశాలలు అట్టడుగు వర్గాల పిల్లల ఆశ్రయాలు కాబట్టి వారి చెంతకు ఇంగ్లీషు మీడియం వెళ్ళడం ఆనందించదగ్గ విషయమే కానీ వారి జీవన ప్రమాణాల పురోగతికి ఈ నిర్ణయం ఏమాత్రం సహాయం చేయదు. పైకి ఇది పేద వర్గాలకు చేస్తున్న మేలుగా కన్పిస్తుంది ఇంగ్లీష్ చదువులు చదువుకొని పేద పిల్లలు పైకి ఎదిగి ఉద్యోగాలు సంపాదించి కుటుంబాన్ని ఆర్థికంగా పైమెట్టుకు చేరుస్తారని భ్రమింపచేసే నిర్ణయమే తప్ప వాస్తవంలో ఈ లక్ష్యం ఏ మేరకు నెరవేరుతుందో సందేహాస్పదమే. దారిద్ర్య రుగ్మతకు ఇది పై పూతమందులాంటిదే.

అక్షరజ్ఞానం ఆర్థికాభివృద్ధికి దోహదం చేస్తుంది. అక్షరజ్ఞానం లేని సమాజాలు అంధకార యుగం వైపు వెళ్ళి పోతుంటే అక్షర జ్యోతితో ఆధునిక దేశాలు అగ్రపథాన నిలుస్తున్నాయి. అయితే ఇక్కడ గుర్తించాల్సింది కేవలం అక్షర స్పర్శ మాత్రమే ఆర్థికంగా ఆలంబన కాలేదు. అక్షరం రేకెత్తించే ఆలోచనలు..... సృజనాత్మక ఆలోచనల నుంచే సంపద సృష్టి జరుగుతుంది. కానీ కేవలం ఇది భాషవల్లనే జరుగుతుందనుకోకూడదు. భాష ఒక సాధనమే తప్ప అదే సర్వస్వం కాదు. అందుకే ఆంగ్లాన్ని మాధ్యమంగా ప్రవేశపెట్టడం వల్ల అద్భుతాలేమీ జరగవు. ఐదారేళ్ళు పోయిన తరువాత వెనక్కి తిరిగి చూసుకుంటే ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్న చందానే ఉంటుంది. వాస్తవానికి మనం ప్రాథమిక విద్యాస్థాయిలోనే వెనుకబడి వున్నాం. మిగతా దేశాలన్నీ ప్రాథమిక విద్యలో బలమైన పునాదులు వేసుకోవడమే కాదు. సెంకడరీ ఎడ్యుకేషన్‌ను సైతం కొత్తమలుపు తిప్పాయి. గతంలో సెకండరీ విద్య లక్ష్యం ప్రాథమికాంశాలు (ఫండమెంటల్స్) నేర్పడమే కాగా ఇప్పుడు వాటితో పాటు నైపుణ్యం (స్కిల్స్), సృజనాత్మక ఆలోచనా విధానాన్ని నేర్పే ప్రయత్నం ముమ్మరంగా జరుగుతోంది. దీనివల్ల ఉన్నత విద్యకు వచ్చే నాటికి అక్కడి విద్యార్థికి విషయజ్ఞానం, నైపుణ్యం, సృజనాత్మక ఆలోచనల కారణంగా సబ్జెక్టుపై ఆధిపత్యం సాధ్యమైన పరిశోధనాత్మక దృక్పథం ఏర్పడుతోంది. పరిశోధక ఆలోచనలు అంటేనే కొత్త దృష్టి. కొత్త దిశ. ఇది సంపద సృష్టికి మూలం అవుతోంది. అయితే ఇదంతా ఆయా దేశాలలో మాతృభాషలోనే విద్యాబోధన వల్లనే సాధ్యపడుతోంది. పరాయి భాషలో బోధన జరిగితే ఈ లక్ష్యాన్ని చేరలేమన్న వాస్తవాన్ని గుర్తించినందువల్లనే అమెరికా, రష్యా, చైనా, ఫ్రాన్స్ తదితర దేశాలు మాతృభాషనే ఆశ్రయిస్తున్నాయి. అయితే మన దేశంలో పాఠ్యపుస్తకాలతో ఎక్కువగా ప్రాక్టీసు చేయిస్తున్నాం. ప్రాక్టీసే తప్ప వారికి దానినిఅనువర్తింపజేసే సామర్థ్యం వస్తుందో లేదో చూడటం లేదు. పాఠశాల స్థాయిలోనే కాక ఉన్నత విద్యలోకి వచ్చే వరకు ఇదే తంతు కొనసాగుతున్నందువల్ల మన విద్యార్థులకు ఉన్నత విద్య అనంతరం వెంటనే అందుకోవాల్సిన ఉపాధి నైపుణ్యాలు ఏర్పడటం లేదు. ఉన్నత విద్యాస్థాయిలో పరిశోధనా దృక్పథం ఏర్పడనంతకాలం నవీన కల్పనకు అవకాశం ఉండదు. శాస్త్రసాంకేతిక విజ్ఞానాన్ని విభిన్న జీవన రంగాలకు అనువర్తింపజేసి నవీన కల్పనలు చేయడం ద్వారానే ప్రపంచ దేశాలు అపార సంపదను సృష్టించుకోగలుగుతున్నాయి. ఈ నైపుణ్యం అలవడనంతవరకు సృజనాత్మక ఆలోచనలతో పురోగమిస్తున్న దేశాలకు ఊడిగం చేయాల్సి ఉంటుంది. ప్రస్తుతం భారతదేశంతో సహా వర్ధమానదేశాలన్నీ బి.పి.ఓ. ఉద్యోగాల పేరిట సృజనాత్మకత లోపించినందున చేస్తున్నది ఊడిగమే తప్ప మరొకటి కాదు. లోతుగా పరిశీలిస్తే ఇది విద్యా బోధనలో మాతృభాషను విడనాడి పరాయి భాషను ఆశ్రయించడం వల్ల వచ్చిన అనర్థమే.

మనుగడకు ఎంచుకున్న రంగంలో రాణించేందుకు ఆంగ్ల భాష అవసరమే. అయితే ఆంగ్లభాష మాత్రమే ఏ రంగంలోనైనా ఉన్నత స్థాయికి చేర్చలేదు. అందుకే ప్రపంచదేశాలు ప్రాథమిక స్థాయిలో ఇంగ్లీషు భాషపై దృష్టి కేంద్రీకరించడం కంటే భావన (కాన్సెప్ట్స్) లు నేర్పడంపైనే శక్తి సామర్థ్యాలు వెచ్చిస్తున్నాయి. ప్రాథమిక స్థాయిలో భావనలు ఏర్పడితే తదుపరి స్థాయిలో భాషపై దృష్టి కేంద్రీకరించవచ్చునని ఆ దేశాలు భావిస్తున్నాయి. ఒకేసారి భాష, భావనల వత్తిడి కిందిస్థాయి విద్యార్థిపై ఉండకూడదని నిపుణులు సూచిస్తున్నారు. ఇలా రెండు రకాల వత్తిళ్ళు ఉన్నప్పుడు సాధారణంగా విద్యార్థి ఏదో ఒక దానికి ప్రాధాన్యం ఇవ్వడం వల్ల మరొక దానిని విస్మరిస్తాడు. అలా భావనలను వదిలేసిన విద్యార్థి తదనంతర జీవన యానంలో ఎదురుదెబ్బలు తింటాడు. ఈ స్థాయిలో భాష కంటే భావనలు ఎందుకు ప్రధానమని భావిస్తున్నారంటే భావనలు ఏర్పడినప్పుడు తార్కిక ఆలోచన అలవడుతుంది. ఇది సృజనాత్మకతకు దారి తీస్తుంది. ప్రస్తుత జ్ఞాన సమాజానికి కావలసినవి ఈ రెండు లక్షణాలేనని మరువరాదు. అయితే వాటితో పాటు నేటి పోటీ రంగంలో ఇంగ్లీష్ లేనిదే దూసుకుపోవడం కష్టం అన్న వాదనకు ఇక్కడ అవకాశం ఉంది. ఇది వాస్తవమే. అయితే ఒక వ్యక్తి జ్ఞాన సంపాదనలో భావనలు అవసరమా లేక భాష అవసరమా అంటే ముమ్మాటికీ భావనలే ప్రధానం. భాషను జీవనదశల్లో ఏ దశలోనైనా నేర్చుకోవచ్చుగానీ భావనలను ఉన్నత ప్రాథమిక స్థాయి దాటిన తరువాత విద్యార్థిలో పాదుకొనడం అరుదేనని మరువరాదు. అందువల్లనే ప్రాథమిక స్థాయిలో మాతృభాష ద్వారా భావనలు నేర్పగలిగితే ఆపై భాషను నేర్పించవచ్చు.

భాష ఎలా అలవడుతుందో కూడా ఇక్కడ పరిశీలించాలి. భాష విద్యార్థికి నిర్బంధంగా నేర్పలేం. భాష పరిసరాల ప్రభావం వల్ల వస్తుంది. సహచరుల వల్ల వస్తుంది. అంటే ఇంగ్లీషు నేర్పాలనుకున్నప్పుడు కేవలం ఉపాధ్యాయుడి కృషి వల్లనే విద్యార్థులకు భాషా ప్రావీణ్యం రాదు. అతడి స్నేహితులు, ఇంట్లో తల్లిదండ్రులు, తోబుట్టువులు మాట్లాడటం కారణంగానే పురోగతి ఉంటుంది. ప్రస్తుతం ప్రభుత్వ పాఠశాలల్లో సైతం ఇంగ్లీషు మీడియంను ప్రాథమిక స్థాయినుంచే నేర్పాలన్న ప్రతిపాదన వచ్చింది. ఇది హర్షణీయమేకాని ఫలితం ఆశించిన దిశగా ఉంటుందన్నది అనుమానమే. ఎందుకంటే ప్రభుత్వ పాఠశాలల్లో చదివే పిల్లలు బడుగువర్గాల నుంచి వచ్చినవారు. వారి ఇంటి వద్ద ఆంగ్లభాష నేర్చుకునే పరిస్థితులు ఉండవు. అలాగే తమలాంటి సహచరుల మధ్య పాఠశాలలోనూ నేర్చుకునే అవకాశాలు తక్కువే. పైగా ప్రభుత్వ పాఠశాలలో లక్షలాది విద్యార్థులకు ఇంగ్లీషు మీడియంలో అన్ని సబ్జెక్టులు బోధించేందుకు కావలసిన ఉపాధ్యాయులు మనకు సిద్ధంగా లేరు. ఉన్నత కుటుంబాల నుంచి ఎంతో కొంత ఆంగ్లభాషా జ్ఞానంతో వచ్చిన పిల్లలందరూ ఒక పక్క ప్రైవేటు స్కూల్స్‌లో చదువుతుంటే, మరోపక్క సమాజంలోని అట్టడుగు వర్గాల పిల్లలు మాత్రం సర్కారీ స్కూల్స్‌లో చదువుతున్నారు. ఇంతటి స్పష్టమైన విభజన మధ్య ప్రభుత్వ పాఠశాలల పిల్లలకు ఆంగ్లభాష అలవడటం అసాధ్యం. అట్టడుగు వర్గాల పిల్లలకు ఇంగ్లీషు నేర్పి వారిని ప్రధాన జీవన స్రవంతిలోకి తీసుకురావాలన్న చిత్తశుద్ధి ప్రభుత్వానికి నిజంగా ఉంటే సంపన్నులు – పేద పిల్లలు కలిసిచదువుకునే కామన్ స్కూల్ విధానాన్ని తీసుకురావాలి. ఇలాంటి కామన్ స్కూల్స్‌లో అన్ని రకాల ఆర్థిక సామాజిక వర్గాల పిల్లలు ఉన్నందువల్ల భాషాభ్యాసం సులభమవుతుంది. విద్య పరమార్థం సమాజంలోని అట్టడుగు వర్గాల వారినీ ప్రధాన జీవన స్రవంతిలోకి తీసుకురాగల పరివర్తన జరగాలని అంబేద్కర్ ఏనాడో చెప్పారు. ఇప్పుడు జరుగవలసింది అలాంటి ప్రయత్నమే కానీ బడుగువర్గాల వారికి తాత్కాలిక తృప్తి కల్గించే కుహనా నిర్ణయాలు కాదు. శ్రీమంతుల పిల్లలు భావనలతోపాటు ఎబిసిడిలు నేర్చుకొని ఉపాధి అవకాశాలు అందుకుంటుంటే పేదింటి పిల్లలు ఎబిసిడిలతోనే ఆగిపోవడం భవిష్యత్తులో ఎంత వ్యథాభరితం అవుతుంది ? మాతృభాష, ఆంగ్లభాష అన్న వాటిపై తర్జన భర్జనల కంటే అందరికీ విలువైన చదువు అందించే నిజమైన కృషి జరగాలన్నదే ఆకాంక్ష.

# విద్యారంగ సమస్యలపై ముఖ్యమంత్రికి పిడిఎఫ్ ఎంఎల్‌సిల ప్రాతినిధ్యం

గౌరవనీయ ముఖ్యమంత్రి గారికి, హైదరాబాద్
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, తేది. 04.06.2007
హైదరాబాదు.

ఆర్యా !

**విషయము :-** విద్యారంగ సమస్యలు - ప్రభుత్వ విద్యారంగ పరిరక్షణ - విద్యాసంస్థలలో పనిచేయు ఉపాధ్యాయుల, లెక్చరర్ల సమస్యలు - పరిష్కారము కొరకై విజ్ఞప్తి.

మన రాష్ట్రంలో ప్రభుత్వ యాజమాన్యంలోను, ప్రభుత్వ ద్రవ్య సహాయంతోను, నడుస్తున్న విద్యాలయాలకు కార్పోరేట్ విద్యాలయాలకు మధ్య పెద్ద పోటీ జరుగుతున్నది. కార్పోరేట్ విద్యాలయాలు నాణ్యమైన విద్య పేరుతో విద్యను పెద్ద వ్యాపారంగా మార్చి దోపిడీ చేస్తున్నారు. ఆర్థిక స్థోమత కలవారు మాత్రమే ఈ కార్పోరేట్ సంస్థలలో తమ పిల్లలను చదివించుకో గలుగుతున్నారు.




కాని దళితులు, గిరిజనులు, సామాజికంగాను, ఆర్థికంగాను వెనుక బడినవారు జనాభాలో 70శాతం యున్నారు. వారు పూర్తిగా ప్రభుత్వ విద్యాలయాలమీదనే ఆధారపడి యున్నారు. కావున రాజ్యాంగంలో పేర్కొన్నట్లు సమసమాజ నిర్మాణం జరగాలన్నా, సామాజిక న్యాయం నెలకొల్పాలన్నా, ప్రాథమిక పాఠశాలలనుండి యూనివర్సిటీలవరకు ప్రభుత్వ రంగ విద్యా సంస్థలను బలోపేతం చేయాలి. దీని కొరకు ప్రభుత్వ విద్యా యజ్ఞం చేపట్టి జలయజ్ఞం వలే నిధుల కొరత లేకుండా విద్యారంగానికి కూడా ఖర్చుచేయాలి. ఈ కృషిలో ప్రభుత్వం చేసే అన్ని అభివృద్ధికర చర్యలను మేము బలపరుస్తాము. కావున ఈ క్రింది అంశాలను పరిశీలించి ఏ స్థాయికాస్థాయి సమస్యలను చర్చించుటకు ఆయా మంత్రులు, అధికార్లు, ఉపాధ్యాయ, పట్టభద్రుల శాసన మండలి సభ్యులు, ఉద్యోగ, ఉపాధ్యాయ సంఘాల ప్రతినిధులతో సమావేశం ఏర్పాటుచేసి చర్చించి సాధ్యమైనంత ఎక్కువ సమస్యలను పరిష్కరించి విద్యారంగంలో విప్లవాత్మక మార్పులకు శ్రీకారం చుట్టాలని కోరుచున్నాము.

## ఉన్నత విద్యారంగం

1. ప్రతి మండలంలో కనీసం ఒక ప్రభుత్వ డిగ్రీ, జూనియర్, కళాశాలలను స్థాపించాలి.
2. ప్రభుత్వ కళాశాలలలో కాలానుగుణమైన మంచి కోర్సులను ప్రవేశపెట్టాలి.
3. ప్రిన్సిపాళ్ళ, లెక్చరర్ల ఖాళీలను రెగ్యులర్ అధ్యాపకులతో నింపాలి.
4. సెక్షనుకు ఉండవలసిన విద్యార్థుల కనీస సంఖ్యను అశాస్త్రీయంగా పెంచుతూ జారీచేసిన ఉత్తర్వులు ఉపసంహరించాలి.
5. (a) కాంట్రాక్టు లెక్చరర్లను 2సం॥ తర్వాత రెగ్యులర్ ఖాళీలలో అబ్జార్బ్ చేయాలి

(b). కాంట్రాక్టు లెక్చరర్లను జిల్లా సగటు ఫలితాలతో పోల్చకుండా తాలూకా స్థాయి ప్రమాణాలతో పోల్చి రాబోయే విద్యా సంవత్సరంలో కొనసాగించాలి. కాంట్రాక్టు లెక్చరర్ల కాంట్రాక్టును రెన్యూ చేయటానికి జిల్లా సగటు ఫలితాలతో పోల్చి చూసే పద్ధతి విడనాడాలి.

(C). కాంట్రాక్టు లెక్చరర్ల జీతాలను రెగ్యులర్ స్కేల్ లోని కనీస స్థాయితో సమానంగా చెల్లించాలి.

6. 20సం॥ పైబడి పని చేస్తున్న అన్‌ఎయిడెడ్ కళాశాలలను కూడా గ్రాంట్ ఇన్ ఎయిడ్‌కు అనుమతించలేదు. **ఉదా :-** ఆత్మకూరు (నెల్లూరు జిల్లా) ఇంకొల్లు (ప్రకాశం జిల్లా) ఈ అన్ ఎయిడెడ్ లెక్చరర్లందరిని గ్రాంట్ ఇన్ ఎయిడ్‌కు అనుమతించాలి. అన్ ఎయిడెడ్ పాఠశాలల కళాశాలల సిబ్బందిని రెగ్యులర్ ఖాళీలలో అబ్జార్బ్ చేయాలి.

ఎ) ఎయిడెడ్ కళాశాలలోని సిబ్బందిని రీ డిప్లాయ్ చేయడం తప్పనిసరైనప్పుడు మరో ఎయిడెడ్ కాలేజికి బదిలీ చేయాలి.

7. ప్రతి జిల్లా కేంద్రంలో ప్రభుత్వ, ప్రభుత్వ ద్రవ్య సహాయంతో నడుస్తున్న పాఠశాలలలో ఉత్తమ మార్కులు సాధించిన పిల్లల కొరకు Centre of excellency జూనియర్ కాలేజస్ స్థాపించాలి.
8. తెలుగు మాధ్యమంలో ఇంటరు, డిగ్రీలు, చదివిన, చదువుచున్న విద్యార్థులకు ఆంగ్లభాష, కమ్యూనికేషన్ నైపుణ్యాలను, ఐ.టి. పరిజ్ఞానాన్ని అభివృద్ధి పరచుకొనేలా శిక్షణా సంస్థలను ప్రారంభించాలి.
9. అధ్యాపకుల బదిలీలకు, చట్టబద్ధమైన బదిలీల కోడ్ రూపొందించి దానికి అనుగుణంగా బదిలీలు చేయాలి. అధికారులు తమ ఇష్టానికి అనుగుణంగా బదిలీ నిబంధనలు మార్చుటకు అనుమతించరాదు.
10. ప్రతి ప్రభుత్వ జూనియర్ కళాశాలకు అనుబంధంగా హాస్టల్సు ఏర్పాటుచేయాలి.
11. యుజిసి స్కేళ్లు పొందుతున్న లెక్చరర్ల రిటైర్మెంట్ వయస్సు 65 సం॥లకు పెంచాలి.
12. కళాశాలలోని కృత్తి విద్య పార్ట్‌టైం లెక్చరర్లకు 12 నెలల జీతం చెల్లించాలి. 2 సం॥ల సర్వీసు పూర్తి చేసిన వారికి టైం స్కేలు యివ్వాలి.

## పాఠశాల విద్య

1. ఉమ్మడి సర్వీసు రూల్సు వెంటనే రాష్ట్రపతి ఆమోదంతో ప్రకటించి దాని కనుగుణంగా పదోన్నతులు, బదిలీలు చేయాలి.
2. రాష్ట్రపతి ఆమోదం తర్వాత మున్సిపల్. గిరిజన ఉపాధ్యాయులను కూడా ఉమ్మడి సర్వీస్‌లో చేర్చాలి.
3. ప్రాథమిక పాఠశాలలలో నమోదు పెంచడానికి డ్రాపౌట్సు(Dropouts) రేటు తగ్గించటానికి అవసరమైన చర్యలు గైకొనుటకు రాష్ట్ర స్థాయి రౌండ్‌టేబుల్ సమావేశం జరపాలి.
4. పాఠశాలలలో నాణ్యమైన విద్య అందించాలి.
5. 1నుండి 5 తరగతుల వరకు ప్రభుత్వ, కార్పోరేట్ ,అన్ ఎయిడెడ్ యాజమాన్యాల లోగల అన్ని పాఠశాలలలో మాతృ భాషా మాధ్యమంగానే బోధన జరగాలి.
6. ఆంగ్ల భాషను ప్రజావాంఛ కనుగుణంగా ప్రత్యేక సబ్జక్టుగా 1వ తరగతినుండి ప్రవేశపెట్టాలి.
7. మోడల్ విద్యా హక్కు చట్టం 2006ను ఉపాధ్యాయ సంఘాల సూచనల మేరకు సవరించి త్వరలో చట్టం చేయాలి.

8. పార్లమెంట్‌లోని విధానాలు నిర్ణయం కాకుండానే నూతన పెన్షన్ చట్టం మన రాష్ట్రంలో అమలులోనికి వచ్చింది. దీనిని తక్షణం నిలుపుదల చేయాలి.

9. అన్ని రాష్ట్రాల అనుభవాన్ని కేంద్ర ప్రభుత్వ తుది నిర్ణయాన్ని పరిగణించి చట్టంలో అవసరమై మార్పులు చేసి భవిష్యత్తులో అమలు జరపాలి.

10. 1998 D.S.C లో అర్హతపొంది, ప్రస్తుతం విద్యా వాలంటీర్లుగా పనిచేస్తున్న వారందరిని రెగ్యులర్ ఖాళీలలో విలీనం చేయాలి.

11. 2006 D.S.C లో ఎంపికైనా వారందరిని జూన్ ఆఖరు లోగా ఉద్యోగాలలో నియమించాలి.

12. విద్యా వాలంటీర్లందరికీ కనీస వేతన చట్టాన్ని, ఇరుగు, పొరుగు రాష్ట్రాల అనుభవాన్ని కూడా తీసుకొని వారి వేతనాన్ని కనీసం రూ. 3,000 లకు పెంచాలి.

13. వృత్తి విద్యా ఉపాధ్యాయులకు టైం స్కేలు (Time scale) ఇవ్వాలి.

14. 20 మందిలోపు విద్యార్థులున్న ప్రాథమిక పాఠశాలలను మూసివేస్తారనే ప్రచారం జరుగుతున్నది. దానికి ప్రత్యామ్నాయంగా ఈ సంవత్సరం ప్రత్యేక కృషి చేసి పాఠశాలలలో విద్యార్థుల సంఖ్య పెరగటానికి ప్రత్యేక కృషి చేయాలి.

15. 2007 D.S.C వెంటనే ప్రకటించాలి.

16. Aided, municipal పాఠశాలలు, కళాశాలలలో పనిచేయువారికి GPF వర్తింపచేయాలి. వీరికి P.R.C కి అనుగుణంగా G.I.S శ్లాబులు మార్చాలి.

17. ఎయిడెడ్, మున్సిపల్ ఉపాధ్యాయులకు కూడా మెడికల్ రీయింబర్స్‌మెంట్ సౌకర్యం ఏర్పాటుచేయాలి.

18. Aided పాఠశాలలలో ఉపాధ్యాయుల నియామకం, ప్రమోషన్లు, కారుణ్య నియామకాలపై నిషేధాన్ని ఎత్తివేసి ఖాళీలను భర్తీ చేయాలి.

## సాంఘిక సంక్షేమం

1. హాస్టళ్ళలో విద్యార్థులకు Mess చార్జీలు పెంచాలి.

2. మధ్యాహ్నభోజన పథకాన్ని పేద పిల్లలకు జూనియర్ కాలేజీల వరకు విస్తరింపచేయాలి.

3. పాఠశాలలు తెరిచే నాటికి అన్ని సబ్జక్టుల పాఠ్యపుస్తకాలు పాఠశాలలకు అందించాలి.

4. షెడ్యూలు ప్రాంతంలో ఉపాధ్యాయుల పోస్టుల భర్తీకి ప్రత్యేక D.S.C ని చేపట్టాలి.

5. అరకు, ఉట్నూరులలో డైట్‌లను తిరిగి తెరవాలి. అదనంగా ట్రైబల్ డైట్‌ను ఏర్పాటుచేయాలి.

**ఇందుకు సరియైన నకలు తగు చర్య నిమిత్తము**

**ఈ క్రింది వారికి సమర్పించడమైనది.**

గౌరవనీయులు ఉన్నత విద్య శాఖా మాత్యులు

గౌరవనీయులు పాఠశాల విద్యాశాఖా మాత్యులు

గౌరవనీయులు సాంఘిక సంక్షేమ శాఖామాత్యులు

గౌరవనీయులు గిరిజన సంక్షేమ శాఖామాత్యులు

గౌరవనీయులు సాంకేతిక విద్యాశాఖామాత్యులు

గౌరవనీయులు సర్వశిక్షా అభియాన్ శాఖామాత్యులు

| | |
|---|---|
| సం॥ | సం॥ |
| (డా॥ చుక్కా రామయ్య) | (శ్రీ ఎం.వి.ఎస్. శర్మ) |
| చైర్మన్ | డెప్యూటీ ఫ్లోర్ లీడర్ |
| సం॥ | సం॥ |
| (శ్రీ డి. రామిరెడ్డి) | (డా॥ కె.నాగేశ్వర్) |
| ఫ్లోర్ లీడర్ | సభ్యులు |

## ప్రాతినిధ్యాలు

### 2005 పిఆర్‌సిలో వేతన అసంబద్ధతలపై యుటియఫ్ ప్రతిపాదనలకు సానుకూలంగా స్పందించిన రంగాచారి

2005 పిఆర్‌సిలో ఏర్పడిన అసంబద్ధతలను (అనామలీస్) సవరించడానికి యుటియఫ్ చేసిన ప్రతిపాదనల పట్ల అనామలీస్ కమిటీ చైర్మన్ ఎన్. రంగాచారి సానుకూలంగా స్పందించారు. ప్రభుత్వం జి.ఓ.ఎం.నం. 219 ద్వారా నియమించిన ఏక సభ్య కమిటీకి పిఆర్‌సి అసంబద్ధతలపై మే 18న యుటియఫ్ ప్రాతినిధ్యం సమర్పించింది. సదరు అంశాలపై వివరంగా చర్చించేందుకు ఒఎంసి చైర్మన్ రంగాచారి ఆహ్వానం మేరకు మే 27న యుటియఫ్ ప్రతినిధి వర్గం కమిటీ ముందు హాజరై 2005 వేతన స్థిరీకరణలో గల లోపాలను వివరించి సరిదిద్దాలంటూ తను వాదనలు వినిపించారు.

3వ కేటగిరీ టీచర్ల ప్రారంభ వేతనాన్ని నిర్ణయించడంలో గత పిఆర్‌సిలలో జరిగిన లోపాలు సోదాహరణంగా వివరించగా అంగీకరించి సవరించగలనని హామీ యిచ్చారు. ఒఎంసి సిఫారసుల ప్రకారం మాస్టర్ స్కేల్ పునః నిర్ణయం కారణంగా నష్టపోయిన వారికి రక్షణ కల్పించేందుకు గిరిజన ప్రాంతాలలో ఎస్‌సిపి స్లాబ్‌రేట్ల నిర్ణయంలో మండలాలు, నాన్ మండలాలు అనే తేడా లేకుండా అందరికీ ఒకే రేటును అమలు జరపడానికి, మరణించిన ఉద్యోగుల అంత్యక్రియల ఖర్చులను చెల్లించే మొత్తాన్ని రు. 5000/-కు పెంపుదల చేయుటకు, రిటైర్డ్ ఉద్యోగులకు కూడా మెడికల్ రీయింబర్స్‌మెంట్ పరిమితిని రు. 2 లక్షలకు పెంచడానికి ఒఎంసి చైర్మన్ రంగాచారి అంగీకరించారు. ఆ మేరకు ప్రభుత్వానికి ప్రతిపాదిస్తామన్నారు.

సబ్సీక్వెంట్ ఇంక్రిమెంట్ తేదీకి ఆప్షన్ యిచ్చుకునే అవకాశాన్ని, స్టెప్ అఫ్, ప్రీపోన్‌మెంట్ సౌకర్యాలను పునరుద్ధరించే అంశాన్ని, ప్రాథమిక, ప్రాథమికోన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయుల డ్యూటీ అలవెన్సును పెంపుదల చేసే అంశాన్ని, హైదరాబాద్ నగరం చుట్టూ 8 కి.మీ. పరిధిలోని గ్రామాలన్నింటికి 20% హెచ్‌ఆర్‌ఏ వర్తింపజేసే అంశాన్ని పరిశీలించి సానుకూలంగా ప్రభుత్వానికి సిఫారసు చేయగలనని రంగాచారి హామీ యిచ్చారు. సుహృద్భావ వాతావరణంలో జరిగిన ఈ చర్చలలో యుటియఫ్ అధ్యక్ష, ప్రధానకార్యదర్శులు ఐ. వెంకటేశ్వర రావు, యన్. నారాయణలతో పాటు గౌ॥ అధ్యక్షులు సిహెచ్. సుభాష్‌చంద్రబోస్, సహాధ్యక్షులు ఎన్. రమణయ్య శాస్త్రి, రాష్ట్ర కార్యదర్శులు కె. వెంకట్రావు, సి. రవి, జి. ప్రభుదాస్, ఎ. నర్సిరెడ్డి, కార్యవర్గ సభ్యులు ఆర్. నరసింహాచారి పాల్గొన్నారు.

17వ పేజీ తరువాయి

### అప్రెంటిస్ వేతన స్థిరీకరణ

| | |
|---|---|
| 1.07.2005 వేతనం(ఇంక్రిమెంటుతో) | 7200 |
| 1.07.2006 వేతనం(ఇంక్రిమెంటుతో) | 7385 |
| 1.07.2007 వేతనం(ఇంక్రిమెంటుతో) | 7570 |

**మూడవ ఉదాహరణ**

1996 డిఎస్‌సి ద్వారా నియామకం పొందిన మరో ఉపాధ్యాయుని వేతన స్థిరీకరణ ఈ క్రింది విధంగా ఉంటుంది.

సర్వీసులో చేరిన తేది: 15.11.1996

రెగ్యులర్ స్కేలు పొందిన తేది. 15.11.1998

| | | |
|---|---|---|
| 15.11.2004 | 6505 | 6675 |
| | | (8 సం॥ స్కేలు) |
| | (5470-12285) | (5750-13030) |
| 1.11.2006 | 6845 | 7015 |
| 15.11.2006 | 7015 | 7015 |
| | | (8 సం॥లు)(5750-13030 స్కేలు) |

**నాలుగవ ఉదాహరణ :**

1998 డిఎస్‌సి ద్వారా ఎంపిక కాబడి 11.09.1998వ తేదీన సర్వీసులో చేరిన ఉపాధ్యాయుని వేతనం ఈ క్రింది విధంగా ఉంటుంది.

సర్వీసులో చేరిన తేది. 11.09.1998

రెగ్యులర్ స్కేలు పొందిన తేది. 11.09.2000

| | | |
|---|---|---|
| 11.09.2006 | 6505 | 6675 |
| | 5470-12285 | 8 సం॥లు |
| | | (5750-13030) |

ఈ ఉపాధ్యాయునికి 11.09.2006 నుండి 8 సం॥గల స్పెషల్ గ్రేడు స్కేలు వర్తిస్తుంది.

# జీతాల ఖర్చుపై 'బ్యాంక్' కన్నెర్ర

ప్రభుత్వ ఉద్యోగుల వేతనాలు, ఇతర అలవెన్సుల భారం విషయంలో రాష్ట్ర ప్రభుత్వంపై ప్రపంచబ్యాంకు గుర్రుగా ఉంది. తమ షరతులను, విధి విధానాలను అమలు చేయడం లేదని వై.ఎస్.ప్రభుత్వంపై ఆగ్రహం వ్యక్తం చేస్తోంది. దీనికి సంబంధించి ఇటీవల ప్రపంచబ్యాంకు ప్రతినిధులు రాష్ట్రప్రభుత్వ పనితీరుపై తీవ్ర అసంతృప్తి వ్యక్తం చేసినట్లు తెలిసింది. పి.ఆర్.సి. తదితర అంశాలను అమలు చేస్తూ తమ షరతుల విషయంలో మాత్రం అలసత్వం ప్రదర్శిస్తున్నారంటూ బ్యాంకు ప్రతినిధులు ఒకింత అసహనం వ్యక్తం చేశారు. సాధ్యమైనంత త్వరగా ఉద్యోగులపై వ్యయాన్ని తగ్గించుకోవాలని స్పష్టం చేశారు. ఉద్యోగుల విషయంలో సంస్కరణలను వేగవంతగా అమలు చేసి వారి భారాన్ని తగ్గించుకోవాలని, లేకుంటే చిక్కుల్లో పడతారని హెచ్చరించినట్లు విశ్వసనీయ వర్గాల ద్వారా తెలిసింది.

### చాపకింద నీరులా .....

ఇప్పటికే ఉద్యోగులపై వ్యయాన్ని తగ్గించుకునే విధానాలను రాష్ట్రప్రభుత్వం చాపకింద నీరులా అమలు చేస్తోంది. రాష్ట్రంలో ఖాళీగా ఉన్న లక్షలాది పోస్టులను భర్తీ చేయడం లేదు. వైద్యం, విద్య వంటి శాఖల్లో మొక్కుబడిగా అవుట్ సోర్సింగ్, కాంట్రాక్ట్ పద్ధతిన నియామకాలు చేస్తోంది. అలాగే పింఛను తదితర విషయాల్లో భారీగా కోత విధించి ఉద్యోగుల భారాన్ని క్రమేపీ తగ్గించుకుంటోంది. వివిధ శాఖల్లో మిగులు సిబ్బంది పేరుతో వి.ఆర్.ఎస్.ఇచ్చి వారిని ఇంటికి పంపుతోంది. మరోపక్క ఖాళీగా ఉన్న పోస్టులను భర్తీ చేయకపోవడంతో పాటు మృతి చెందిన, పదవీ విరమణ చేసిన వారి స్థానాలలో నియామకాలు చేపట్టకుండానే ఉన్న వారితో పని చేయించుకుంటూ ఉద్యోగులపై భారాన్ని విపరీతంగా పెంచింది. ఈ పరిస్థితుల్లో ఉద్యోగులు, కార్మికులు, ఉపాధ్యాయ సంఘాలు చేసిన ఆందోళనలు, ఒత్తిళ్ల ఫలితంగా వై.ఎస్. ప్రభుత్వం 2005 వేతన సవరణ కమిటీ సిఫార్సులను అమలు చేయక తప్పింది కాదు. ఉద్యోగుల వేతనాల భారం ఏటా పెరుగుతున్నా మొత్తం రెవెన్యూ వ్యయంలో వారిపై ఖర్చు చేస్తున్న శాతాన్ని చూస్తే ఏటా పెరుగుతున్న జీవన ప్రమాణాలకు అనుగుణంగా వేతనాలు పెంచడం లేదనేది అర్థమవుతోంది. అలాగే రాష్ట్రానికి వచ్చే ఆదాయంలో పింఛనుకు సంబంధించి రాష్ట్రప్రభుత్వం చేస్తున్న ఖర్చు శాతం కూడా తగ్గడం గమనార్హం. ఈ విధంగా ప్రభుత్వం ఉద్యోగుల వేతనాలు, పింఛను, ఇతర సౌకర్యాలను పెంచుతున్నట్లు కనిపిస్తున్నా రాష్ట్ర మొత్తం ఖర్చులో మాత్రం ఆ పెరుగుదల కన్పించడం లేదు.

### ఆర్థిక సంస్కరణల ఫలితాలివి....

ప్రభుత్వ శాఖల్లో అమలు చేస్తున్న ఆర్థిక సంస్కరణల కారణంగా 2004-05లో 3,387 కోట్లుగా ఉన్న రాష్ట్ర రెవెన్యూ లోటు 2005-06 నాటికి 386 కోట్లకు తగ్గింది. గత ఏడాదితో పోల్చి చూస్తే రెవెన్యూ వ్యయం 10 శాతం పెరగగా రెవెన్యూ వసూళ్లు భారీగా అంటే 21 శాతం పెరిగాయి. 2005 వేతన సవరణలను అమలు చేయడం వల్ల రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగుల జీతాలపై ఖర్చు గత ఏడాది కంటే 1,377 కోట్లు పెరిగింది. 2001-2002 నుండి 2005-06 మధ్యకాలంలో ఉద్యోగుల ఖర్చు జి.ఎస్.డి.పి.లో 4.5 నుండి 5.3 శాతం మేర మాత్రమే నమోదైంది. మైక్రో ఎకనమిక్ ఫ్రేమ్‌వర్క్ స్టేట్‌మెంట్‌లో జీతాలపై వ్యయం 10,263 కోట్లుగా ఉండవచ్చని అంచనా వేశారు. 2005-06లో వేతన బిల్లు 10,455 కోట్లు. ఇది రెవెన్యూ వ్యయంలో 41.76 శాతంగా నమోదైంది. 2009-10 నాటికి రెవెన్యూ వ్యయంలో జీతాల ఖర్చును 35 శాతానికి తగ్గించాలన్న ప్రపంచబ్యాంకు షరతును తూచా తప్పకుండా అమలుచేస్తున్న ఫైనాన్స్ కమీషన్, ఆ మేరకు సిఫారసు కూడా చేసింది. దీనికి అనుగుణంగానే రాష్ట్ర ప్రభుత్వం వ్యవహరిస్తూ ఉద్యోగుల సౌకర్యాలు, రాయితీలను నెమ్మదిగా కుదిస్తూ వాటి ప్రభావం మాత్రం కనిపించకుడా జాగ్రత్త పడుతోంది. దీంతో జి.ఎస్.డి.పి.లో ఉద్యోగుల జీతాలపై చేసే ఖర్చు శాతం తగ్గుతూ వస్తోంది. అలాగే పదవీ విరమణ చేసిన ఉద్యోగులకు ఇచ్చే పింఛను విషయంలో సైతం ప్రభుత్వం వ్యయ భారాన్ని నెమ్మదిగా తగ్గిస్తోంది. 2006 మార్చి నెలాఖరుకు రాష్ట్రంలో 4.39 లక్షల మంది ఫించనుదార్లు ఉన్నారు. 2001-02 లో రాష్ట్రంలోని పింఛనుదార్లకు మొత్తం రెవెన్యూ వ్యయంలో 9.1 శాతం నిధులను ఖర్చు చేశారు. ఏటా పెరుగుతున్న ధరలు, జీవన ప్రమాణాలకు అనుగుణంగా ఇంక్రిమెంట్లు తదితర వాటిని పెంచకపోవడంతో 2005-06 నాటికి కూడా అది 9.1 శాతంగానే ఉండిపోయింది. పింఛనుదార్ల వ్యయాన్ని ప్రస్తుత పరిస్థితుల ఆధారంగా లెక్కపెట్టినప్పటికీ ఈ బాధ్యతల ప్రభావాన్ని తగ్గించేందుకు 2004 సెప్టెంబర్ 1వ తేదీ తరువాత ఉద్యోగాలలో చేరిన వారికి పింఛను పథకంలో రాష్ట్రప్రభుత్వం మార్పు తెచ్చింది. మరో పక్క రాష్ట్రంలో పనిచేస్తున్న ఉద్యోగులకు ఇళ్ల స్థలాలను కేటాయించడం, పట్టణ ప్రాంతాల్లో పనిచేస్తున్న ఉద్యోగులకు నివాస భత్యం క్రింద 10 నుండి 12.5 శాతం చెల్లించడం, వేతన సవరణ ద్వారా ప్రభుత్వ ఉద్యోగులకు మధ్యంతర సహాయం కింద మూల వేతనంపై 8.5 శాతం అదనపు వేతనాన్ని మంజూరు చేయడం, 2005 లో వేతన సవరణ జరిగినప్పుడు గరిష్ఠ వేతనం పొందిన వారికి అదనంగా ఇంక్రిమెంట్లు పొందే అవకాశం లేకపోయినప్పటికీ ఐదు ఇంక్రిమెంట్ల వరకూ మంజూరు చేయడం, మూల వేతనంలో 30.26 శాతం డి.ఎతో కలిపి వేతనాన్ని పెంచడంతో పాటు మరో 16 శాతం ఫిట్‌మెంట్ మొత్తాన్ని ఇవ్వడం వంటి మొక్కుబడి చర్యలకు మాత్రమే రాష్ట్ర ప్రభుత్వం పరిమితమైంది. వీటి కారణంగా ఉద్యోగుల కోసం ఈ ఏడాది మరో రెండు వేల కోట్ల రూపాయిలు వేతన సవరణ ద్వారా ప్రభుత్వం భరించాల్సి వచ్చింది. వీటితో పాటు ప్రభుత్వం డ్రైవర్లకు 4,595 నుండి 10,285 రూపాయిల స్కేల్‌ను సాధారణ వర్గీకరణ కింద నిర్ధారించింది. పదవీ విరమణ చేసే ఉద్యోగులకు 240 రోజుల సెలవును ఇఎల్‌గా మార్చుకుని నగదు పొందే అవకాశం గతంలో ఉండగా, ఇప్పుడు దాన్ని మరో 60 రోజులు పెంచి 300 రోజులు చేసింది. రిటైర్ అయిన ఉద్యోగులకు గతంలో నిలిపివేసిన పెన్షన్‌లో డి.ఎ. పెంపుదలను ఈ ప్రభుత్వం మళ్లీ పునరుద్ధరించింది. ఇంటి అద్దె 20 శాతం చొప్పున నిర్ణయించి గరిష్ఠంగా రెండు వేల రూపాయలు ఉండాలనే నిబంధన తొలగించి నాలుగు వేల వరకూ మంజూరు చేసే విధంగా ఆదేశాలు ఇచ్చింది. ఉద్యోగుల ఆరోగ్య భద్రత దృష్ట్యా చికిత్సకు అయ్యే వ్యయంలో లక్షనుండి 2 లక్షలకు వైద్య ఖర్చులు తిరిగి చెల్లించే విధంగా నిర్ణయించింది. ఈవిధమైన కొత్త వేతన సవరణ ఒప్పందంతో రాష్ట్ర ప్రభుత్వానికి అయ్యే రెవెన్యూ వ్యయం 50 శాతానికి పెరిగే అవకాశం ఏర్పడింది. ఈ నేపథ్యంలో ఉద్యోగుల వేతనాలు, ఇతర అలవెన్సుల భారాన్ని తగ్గించుకోకుంటే భవిష్యత్‌లో తీవ్ర పరిణామలను ఎదుర్కోవలసి వస్తుందని ప్రపంచబ్యాంకు హెచ్చరించినట్లు తెలిసింది.

### సమస్యల పరిష్కారానికి పోరాటాలు ఉధృతం చేయాలి.

**-రాష్ట్ర జె.ఎ.సి. కార్యవర్గం నిర్ణయం.**

ఉద్యోగ, ఉపాధ్యాయ, కార్మికుల సమస్యల సాధన కోసం మరియు ప్రభుత్వ ప్రజావ్యతిరేక చర్యలను నిలువరించడానికి రాష్ట్ర జె.ఎ.సి ని పటిష్టపరచి, పోరాటాలను ఉధృతం చేయాలని జె.ఎ.సి. విస్తృత కార్యవర్గం నిర్ణయించింది. దాదాపు 6నెలల విరామం తర్వాత జె.ఎ.సి. రాష్ట్ర కార్యవర్గ సమావేశం మే 16న హైదరాబాద్ ఎ.పి.ఎన్.జి.ఓ. కార్యాలయంలో చైర్మన్ వి.గోపాల్ రెడ్డి అధ్యక్షతన నిర్వహించబడింది.గోపాల్‌రెడ్డి సమావేశాన్ని ప్రారంభించి ప్రసంగిస్తూ, రాష్ట్ర ప్రభుత్వం ఉద్యోగ వ్యతిరేక వైఖరిని తీవ్రంగా నిర్వహించే అనేక హామీలు, వాగ్దానాలు చేసి అధికారంలోకి వచ్చిన వై.ఎస్. ప్రభుత్వం వాటిని విస్మరించిందని, గతంలో పోరాడి సాధించుకున్న హక్కులు, రాయితీలకు భంగం కల్పించేందుకు ప్రయత్నిస్తున్నదని విమర్శించారు. డిమాండ్ల సాధన కోసం భవిష్యత్‌లో జె.ఎ.సి. నిరహమించే పోరాటాలలోఉద్యోగులు విస్తృతంగా పాల్గొనాలని పిలుపు నిచ్చారు. జె.ఎ.సి. సెక్రటరీ జనరల్ డి. సుధాకర్, వైస్ చైర్మన్ ఎన్. నారాయణ, తదితర జె.ఎ.సి. ఆఫీసు బేరర్లు, సభ్య సంఘాల రాష్ట్ర ప్రతినిధులు, జిల్లా జె.ఎ.సి అధ్యక్ష, ప్రధాన కార్యదర్శులు మాట్లాడారు. ప్రభుత్వం వద్ద పెండింగ్‌లలో ఉన్న ఉద్యోగ, ఉపాధ్యాయులు, కార్మికుల డిమాండ్లన్నింటినీ తక్షణమే పరిష్కరించాలని సమావేశం తీర్మానించింది. జె.ఎ.సి రాష్ట్ర సెక్రటేరియట్‌ను పునఃనిర్మాణం చేయాలని, జె.ఎ.సి మహిళా విభాగాన్ని ప్రత్యేకంగా ఏర్పాటుచేయాలని, క్షేత్ర స్థాయినుండి జె.ఎ.సి ని పటిష్టపరచాలని నిర్ణయించనైనది.

# యుటియఫ్ క్యాంపైన్‌లను జయప్రదం చేయండి

ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ సభ్యత్వము, జనరల్ ఫండ్, ఐక్య ఉపాధ్యాయ చందాలు, ఎస్‌టిఎఫ్‌ఐ సంతకాల సేకరణ క్యాంపైన్లను విజయవంతంగా నిర్వహించాలని యుటియఫ్ రాష్ట్ర కార్యవర్గం పిలుపు నిచ్చింది. జూన్ 7,8 తేదీలలో మొదటి కార్యవర్గ సమావేశం రాష్ట్ర అధ్యక్షులు ఐ. వెంకటేశ్వరరావు అధ్యక్షతన హైదరాబాద్‌లో నిర్వహించబడింది. ఎస్‌టిఎఫ్‌ఐ ప్రధాన కార్యదర్శి కె. రాజేంద్రన్ ముఖ్య అతిథిగా హాజరై సమావేశాలను ప్రారంభించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ ప్రాథమి స్థాయి నుండి విశ్వ విద్యాలయం స్థాయి వరకు వ్యాపార ధోరణిని ప్రోత్సహిస్తూ ప్రభుత్వాలు విద్యారంగాన్ని భ్రష్టు పట్టిస్తున్నాయని విమర్శించారు. విద్యాహక్కు సాధన, విద్యారంగం రక్షణకై జులై నెలాఖరులోగా దేశవ్యాప్తంగా కోటి మంది ఉపాధ్యాయులు, విద్యార్థులు, తల్లిదండ్రుల నుండి సంతకాలు సేకరించి మహా విజ్ఞాపన పత్రాన్ని రాష్ట్రపతికి సమర్పించనున్నట్లు తెలిపారు. యుటియఫ్ కార్యకర్తలందరూ ఈ సంతకాల సేకరణ క్యాంపైన్‌లో చురుకుగా పాల్గొనాలని పిలుపునిచ్చారు. యుటియఫ్ సీనియర్ నాయకులు, పిడిఎఫ్ ఎంఎల్‌సిల ఫ్లోర్ లీడర్ డి. రామిరెడ్డి మాట్లాడుతూ విద్యారంగంలో ప్రభుత్వం అనుసరిస్తున్న తిరోగమన విధానాలను నిశితంగా విమర్శించారు. ఉపాధ్యాయ సమస్యలపై కూడా చైతన్యవంతమైన ఉద్యమాలు నిర్వహించాలని కోరారు.

ఇళ్ళ స్థలాలు, సాగుభూముల కోసం 195 ప్రజా సంఘాల ఆధ్వర్యంలో గతనెల రోజులుగా రాష్ట్ర వ్యాప్తంగా పేదలు సాగిస్తున్న భూ పోరాటానికి సమావేశం సంపూర్ణ మద్దతు ప్రకటించింది. 610 జి.ఓ.ను చిత్తశుద్ధితో అమలు జరపాలని, ఏజన్సీ ప్రాంతంలో స్పెషల్ డిఎస్‌సి నిర్వహించాలని, పాఠశాలల మూసివేతను నిలిపివేయాలని తదితర తీర్మానాలను సమావేశం ఆమోదించింది. ఐక్య ఉపాధ్యాయ సంపాదక వర్గం, అకడమిక్, మహిళా, సాంస్కృతిక, ప్రచురణల విభాగాలను కార్యవర్గం నామినేట్ చేసింది.

రానున్న విద్యా సంవత్సరంలో నిర్వహించాల్సిన సంఘ సభ్యత్వం, జనరల్‌ఫండ్, ఐక్య ఉపాధ్యాయ పత్రికా కాంపెయిన్‌ల కోటాలను, క్యాంపైన్‌ల నిర్వహణా ప్రణాళికలను రాష్ట్ర ప్రధానకార్యదర్శి ఎన్. నారాయణ ప్రతిపాదించగా, జిల్లాల ప్రతినిధులు చర్చలలో పాల్గొని క్యాంపెయిన్ల కోటాలను ప్రణాళికను ఆమోదించారు. రాష్ట్ర మహాసభలో విద్యారంగ సమస్యలపై ప్రవేశ పెట్టిన డాక్యుమెంటును "విద్యా పరిరక్షణ ఉద్యమం" పేరుతో అభివృద్ధిపరచి అమలుకు అవసరమైన కార్యాచరణను రూపొందించి సమావేశంలో ప్రత్యేకంగా చర్చకు ప్రతిపాదించగా, సుదీర్ఘ చర్చల అనంతరం విద్యా సంవత్సరం ప్రారంభం నుండి సెప్టెంబరు 5 వరకు వివిధ దశలలో నిర్వహించాల్సిన కార్యక్రమాలను సమావేశం నిర్ణయించింది. ఈ సమావేశానికి రాష్ట్ర అధ్యక్షులు ఐ.వెంకటేశ్వర రావు అధ్యక్షత వహించగా గౌరవాధ్యక్షులు సి. హెచ్.సుభాష్ చంద్రబోస్, కోశాధికారి ఎం.సంయుక్త తదితర రాష్ట్ర కార్యదర్శులు, కార్యవర్గ సభ్యులు పాల్గొన్నారు.

# విద్యాహక్కు, ఉపాధ్యాయుల సమస్యలపై రాష్ట్రపతికి ఎస్‌టిఎఫ్‌ఐ మహా విజ్ఞాపన
# 20 లక్షల సంతకాలకు యుటియఫ్ విజ్ఞప్తి!

'అందరికీ విద్య అందని ద్రాక్షే' అన్న సామెతను మన దేశం అధిగమించలేక పోతున్నది. రాజ్యాంగం 'అమల్లోకి వచ్చిన దశాబ్ధికాలంలోనే సార్వత్రిక ప్రాథమిక విద్యను సాధించాలనే లక్ష్యం ఆరు దశాబ్దాలు గడుస్తున్నా అందనంత దూరంలోనే వున్నది. బడిఈడుగల బాలబాలికల్లో కోటి మందిపైగా బడి ముఖం చూడలేక పోతున్నారు. **60 ఏండ్ల స్వరాజ్యంలో సాధించిన అక్షరాశ్యత 64%** మాత్రమే. మనకంటే వెనక స్వాతంత్ర్యం వచ్చిన చైనా, వియత్నాం, క్యూబా వంటి అనేక దేశాలు ఏనాడో సంపూర్ణ అక్షరాశ్యత సాధించాయి. దక్షిణాఫ్రికాలో కూడ మనకంటే ఎక్కువ అక్షరాశ్యత (87.5%) వున్నది. విద్యారంగంలో మన దేశం ఎందుకు యింత వెనకబడి వుందని ప్రభుత్వాన్ని ప్రశ్నించాలి.

అన్నీ వున్నా అల్లుడినోట్లో శని వుందన్నట్లు పాలకుల్లో రాజకీయ సంకల్పం లేనందునే అందరికీ విద్య అందటం లేదు. విద్యని ప్రాథమిక హక్కుగా ప్రకటించినా పరిస్థితిలో మార్పు లేదు. 86వ రాజ్యాంగ సవరణ జరిగి ఐదేండ్లు గడుస్తున్నా విద్యాహక్కు బిల్లు పార్లమెంట్ ముఖం చూడలేకపోతున్నది. ఎన్‌డిఏ ప్రభుత్వం చేయలేని పనిని తాము చేస్తామని యుపిఏ ప్రభుత్వం ప్రగల్భాలు పలికింది. మూడేండ్ల పాలనలో మల్లగుల్లాలు పడిన మన్మోహన్ సింగ్ ప్రభుత్వం 'మోడల్ రైట్ టు ఎడ్యుకేషన్ బిల్లు' అంటూ రాష్ట్రాలకు త్రోసేసి చేతులు దులిపేసుకున్నది. ఇలాంటి బాధ్యతా రాహిత్యమే మన విద్యారంగాన్ని తీవ్రంగా దెబ్బతీస్తున్నది. **ప్రాథమిక హక్కుగా విద్యని అమలు చేసే చట్టాన్ని కేంద్ర ప్రభుత్వమే చెయ్యాలని** ఎస్‌టిఎఫ్‌ఐ డిమాండ్ చేస్తున్నది. స్కూల్ మేనేజిమెంట్ కమిటీకే సర్వాధికారాలు అంటూ ప్రభుత్వ బాధ్యతను తగ్గించుకోవటం, స్కూల్ బేస్డ్ క్యాడర్ పేరుతో ఉపాధ్యాయులను ప్రైవేట్ స్కూల్ టీచర్ల స్థాయికి దిగజార్చటం వంటి తిరోగామి ప్రతిపాదనలను విద్యాహక్కు బిల్లు నుండి తొలగించాలని డిమాండ్ చేస్తున్నాము. అన్ని పాఠశాలలకూ అనుబంధంగా అంగన్ వాడి కేంద్రాలను అభివృద్ధి చేయాలని, విద్యాసెస్ పేరుతో వసూలు చేస్తున్న డబ్బునంతా పాఠశాల విద్యకే వినియోగించాలని, జిడిపిలో 6% విద్యకి కేటాయించాలని, అన్ని పాఠశాలలకూ అవసరమైన వసతులు కల్పించాలని, తద్వారా ప్రభుత్వ విద్యని బలోపేతం చేయాలని ఎస్‌టిఎఫ్‌ఐ డిమాండ్ చేస్తున్నది.

ఉన్నత విద్య నుండి ప్రభుత్వం పూర్తిగా తప్పుకోవటం వలన ప్రైవేట్ సంస్థలు, విదేశీ శక్తులు ఆక్రమించుకొని విద్యా వ్యాపారంతో ప్రజల ఆదాయాల్ని కొల్లగొడుతున్నాయి. ఉపాధి అవకాశాల పేరుతో కార్పొరేట్ సంస్థలు, విదేశీ సేవల కోసం మన విద్యార్థుల్ని చౌకగా వినియోగించుకొంటున్నాయి. ఈ పరిస్థితిని మార్చాలని ఎస్‌టిఎఫ్‌ఐ డిమాండ్ చేస్తున్నది. సెల్ఫ్ ఫైనాన్స్ కోర్సులు, విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులు, ప్రైవేట్ విశ్వ విద్యాలయాలు, విదేశీ విద్యా సంస్థల ప్రవేశాన్ని అరికట్టాలి. ఉన్నత, వృత్తి విద్యా సంస్థలకు ప్రభుత్వమే నిధులు సమకూర్చాలి. **దేశ అవసరాల మేరకు ఉన్నత విద్యారంగాన్ని అభివృద్ధి చేయాలి.** విద్యార్థుల అడ్మిషన్‌లు, ఫీజులు, ఉపాధ్యాయుల నియామకాలు, జీతాలు, సర్వీస్ కండిషన్స్, రిజర్వేషన్‌లు, పాఠశాలలకు వసతులు, కరిక్యులమ్, సిలబస్ వంటి విషయాల్లో ప్రైవేట్ విద్యా సంస్థలను అదుపు చేసే చట్టాలను కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు చెయ్యాలి. దేశంలోని మొత్తం విద్యారంగాన్ని సమగ్రంగా సమీక్షించాలి. అందుకోసం **జాతీయ విద్యా కమీషన్‌ని నియమించాలని** ఎస్‌టిఎఫ్‌ఐ కోరుతున్నది.

ప్రభుత్వ విద్యాలయాల్లో అవసరమైనంతమంది ఉపాధ్యాయులు, బోధనేతర సిబ్బందిని రెగ్యులర్ ప్రాతిపదికన అపాయింట్ చెయ్యాలి. కాంట్రాక్ట్ విధానం, అవుట్ సోర్సింగ్ పద్ధతులను అనుమతించ వద్దు. కేంద్ర ప్రభుత్వ పాఠశాలల ఉపాధ్యాయులతో పాటు అన్ని రాష్ట్రాల ఉపాధ్యాయులకు ఒకే విధమైన వేతన వ్యవస్థ వుండాలి. ప్రావిడెంట్ ఫండ్‌పైన వడ్డీ పెంచాలి. పెన్షన్ ఫండ్ రెగ్యులేటరీ, డెవలప్‌మెంట్ అథారిటీ బిల్లుని ఉపసంహరించాలి. ఉద్యోగుల హక్కుల రక్షణకు సమ్మె హక్కును చట్టబద్ధం చేయాలి.

**విద్యా వికాసం, ఉపాధ్యాయ సంక్షేమానికి సంబంధించిన మౌలిక సమస్యలను పరిష్కరించాలని డిమాండ్ చేస్తూ దేశ వ్యాప్తంగా కోటి మంది సంతకాలతో రాష్ట్రపతికి మెమోరాండంలు సమర్పించాలని ఎస్‌టిఎఫ్‌ఐ బృహత్తర కార్యక్రమాన్ని చేపట్టింది. ఆంధ్రప్రదేశ్ నుండి 20 లక్షల సంతకాలు చేయించాలి. జాతీయ ఉపాధ్యాయ ఉద్యమంలో ఇదొక చరిత్రాత్మక పరిణామం కానున్నది. ఉపాధ్యాయులు, విద్యార్థులు, తల్లిదండ్రులు, విద్యారంగ శ్రేయోభిలాషులు అందరూ ఈ కార్యక్రమంలో పాల్గొనాలని, ఎస్‌టిఎఫ్‌ఐ మెమోరాండంపైన సంతకాలు చెయ్యాలని యుటియఫ్ విజ్ఞప్తి చేస్తున్నది.**

# ప్రశ్నోత్తరాలు

నిర్వహణ: **కె. వెంకట్రావు, కార్యదర్శి, యుటియఫ్**

ప్రశ్న: అప్రెంటిస్ టీచర్ల కంటెముందు అనగా 1990 తర్వాత జాయిన్ అయిన స్పెషల్ టీచర్ల సర్వీసును పెన్షన్‌కు, ఆటోమేటిక్ అడ్వాన్స్ మెంట్ స్కీమ్‌కు లెక్కించే ఉత్తర్వులు యింతవరకు వెలువడ లేదు. ఈ సమస్యను పరిష్కరించి న్యాయం చేయాలని కోరుచున్నాము.

- ఈశ్వరయ్య, గంగాధర్, లక్ష్మీప్రసన్న, మొ॥వారు

జవాబు: ఈ సమస్యపై ప్రభుత్వానికి యిదివరకే ప్రాతినిధ్యం చేయబడింది. త్వరలో ఉత్తర్వులు పొందే దానికి కృషి చేయగలము.

ప్రశ్న: **మా జిల్లాలో చాలా మండలాలలో ఎంఇఒలకు అసిస్టెంట్‌లుగా సెంకడరీ గ్రేడ్ ఉపాధ్యాయులను తీసుకున్నారు. వీరికి వేసవి సెలవులలో ఇఎల్ క్రెడిట్ చేయవచ్చునా?**

- ఎస్‌పి. మనోహర కుమార్, కృష్ణా జిల్లా

జవాబు. ఎంఇఒలకు సహాయకులుగా ఎవరిని నియమించమని ఎటువంటి ఉత్తర్వులు జారీ కాలేదు. పైగా పాఠశాలల్లో లేకుండా డిప్యుటేషన్‌పై ఉండే ఉపాధ్యాయులకు జీతాలు చెల్లించవద్దని పాఠశాల విద్యా సంచాలకుల వారు ఉత్తర్వులు జారీ చేసి యున్నారు. కనుక ఎంఇఒల సహాయకులకు వేసవిలో ఇఎల్ మంజూరు చేసే అవకాశం లేదు?

ప్రశ్న: **మా పాఠశాల హెచ్‌ఎం గారు రిటైర్ అయినందున నేను డిఇఒగారి ఉత్తర్వుల ప్రకారం ఎఫ్‌ఏసిగా నియమంచబడ్డాను. నాకు హెచ్‌ఎం అలవెన్సు యివ్వటం లేదు. నాకు ఎఫ్‌ఏసి అలవెన్సు వచ్చే అవకాశం ఉందా? ఎలా దరఖాస్తు చేయాలి? వివరించగలరు.**

- జి. విజయకుమార్, ప॥గో॥ జిల్లా

జవాబు: ఎఫ్‌ఆర్ 49 ప్రకారం పై పోస్టుకు ఎఫ్‌ఏసిగా పనిచేసిన కాలానికి 3 నెలల వరకు మూల వేతనాలలో 1/5 వంతు, తర్వాత 3 నెలల వరకు 1/10 వంతు ఎఫ్ఏసి అలవెన్సుగా మంజూరు చేయబడుతుంది దీని కొరకు మీరు డిఇఓ గారి ద్వారా ఆర్‌జెడి కాకినాడ వారికి దరఖాస్తు చేయాలి.

ప్రశ్న: **నేను ప్రాథమికోన్నత పాఠశాలలో ఎస్‌ఏగా 1.11.02 నుండి పని చేయుచున్నాను. ఇదే పాఠశాలలో 21.01.2002న ఒక స్కూల్ అసిస్టెంట్ డిఎస్‌సి ద్వారా సెలెక్ట్ అయి జాయిన్ అయినాడు. అతని అప్రెంటిస్ పీరియడ్ పూర్తి అయ్యేవరకు నేను హెచ్‌ఎంగా కొనసాగినాను. తదుపరి అతనికి హెచ్‌ఎం బాధ్యతలు అప్పగించి నాను. అప్రెంటిస్ సర్వీసు పెన్షన్‌రు, ఆటోమేటిక్ అడ్వాన్స్‌మెంట్ స్కీముకు తిరస్కరించబడినందున అప్రెంటిస్ సర్వీసు సీనియార్టీకి లెక్కించటం సమంజసమా? తెలుపగలరు.**

- కె.ఆర్.బి. రెడ్డి, ప్రకాశం జిల్లా

జవాబు: జి.ఓ ఎం.ఎస్.నం. 221 విద్య, తేది16 07 94 ప్రకారం అప్రెంటిస్ సర్వీసు రెగ్యులర్ సర్వీసుగా పరిగణించబడుతుంది. అప్రెంటిస్‌గా జాయిన్ అయిన తేదీ నుండి సీనియార్టీకి కూడా వస్తుంది. కనుక 21 01 2002న జాయిన్ అయిన ఉపాధ్యాయుడే సీనియర్ అవుతారు.

ప్రశ్న: **నేను 28.12.1990న స్పెషల్ టీచర్‌గా జాయిన్ అయినాను. తేది. 28.12.06 నాటికి నాకు 16 సం॥ల సర్వీసు నిండి నందున 16 సం॥ల ఎస్‌పిపి-1 స్కేలు మంజూరుకు అవకాశం ఉన్నదా? తెలుపగలరు.**

- సిహెచ్. శ్రీరామచంద్రమూర్తి, తూ॥గో॥ జిల్లా

జవాబు: జి.ఒ.ఎం.ఎస్.నం. 92, తేది. 8.8.2000(అ.ద.18, పేజి 18) ప్రకారం మీరు స్పెషల్ టీచరుగా చేసిన సర్వీసు పెన్షన్‌కు, ఆటోమేటిక్ అడ్వాన్స్‌మెంట్ స్కీముకు అర్హదాయకంగా పరిగణించబడుతుంది. కనుక మీకు 28.12.2006 నాటికి ఎస్‌పిపి-1 స్కేలు మంజూరు చేయబడుతుంది. (ఆ పోస్టు అర్హతలు కలిగి వుంటే)

ప్రశ్న: **నేను ఉన్నత పాఠశాల హెచ్‌ఎంగా పనిచేసి 31.12.91న రిటైర్ అయినాను. 1.1.92 నుండి కమ్యుటేషన్ మొత్తం మినహాయించి పెన్షన్ చెల్లించినారు. 1.1.2007 నాటికి 15 సం॥లు పూర్తి అయినందున పూర్తి పెన్షన్ చెల్లించమని దరఖాస్తు చేయగా 3/07 నుండి మాత్రమే చెల్లిస్తామంటున్నారు. సమంజసమేనా?**

- ఇ. కృష్ణమూర్తి, తూ॥గో॥ జిల్లా

జవాబు: మీకు కమ్యుటేషన్ మొత్తం చెల్లించిన తేదీ నుండి 15 సం॥ల తర్వాత మాత్రమే పూర్తి పెన్షన్ చెల్లిస్తారు. ఒక వేళ మీకు కమ్యుటేషన్, పెన్షన్ మొత్తాలను 2/92లో చెల్లించి ఉంటే ట్రెజరివారి అభ్యంతరం సరియైనదే.

ప్రశ్న: **నేను డిఎస్‌సి 2000లో ఎంపిక కాబడి 16.11.2000న అశిక్షిత ఎస్‌టి అభ్యర్థిగా సెంకడరీ గ్రేడ్ ఉపాధ్యాయుని పోస్టులో జాయిన్ అయినాను. తదుపరి 1.4.2003 నుండి 20.10.2003 వరకు బిఎడ్ కోర్సు చేసిన నాకు ఈ కాలమునకు 40 రోజుల అర్ధ జీతపు సెలవు 160 రోజులు జీత నష్టపు సెలవు మంజూరు చేసినారు. జీతనష్టపు సెలవు కాలమునకు ఇంక్రిమెంట్ వాయిదా పడకుండా పర్మిషన్ పొందవచ్చని అంటున్నారు. అటువంటి ఉత్తర్వులు ఉంటే తెలుపగలరు.**

- ఎస్. రామాంజనేయులు, కర్నూలు జిల్లా

జవాబు: వైద్య కారణాలపై సర్టిఫికేటుతో పెట్టుకొన్న జీత నష్టపు సెలవు కాలమునకు మాత్రమే ఇంక్రిమెంట్ వాయిదా పడకుండా డైరెక్టరు గారి నుండి అనుమతి పొందే అవకాశం ఉన్నది. ఇతర కారణాలతో పెట్టిన జీత నష్టపు సెలవుకు యిటువంటి సౌకర్యం లేదు.

ప్రశ్న: **ట్రాన్సిట్ పీరియడ్ అంటే ఏమిటి? దీనిని ఏఏ సందర్భాలలో ఉపయోగించవచ్చు? ఆ పీరియడ్‌కు జీతం ఎలా క్లెయిమ్ చేయాలి తెలుపగలరు? ప్రమోషన్ సందర్భంలో ఉదయం రిలీవు అయి సాయంత్రం విధులలో చేరవచ్చునా? వివరించగలరు.**

- ఎం. శ్రీహరి, నెల్లూరు జిల్లా

జవాబు: బదిలీపై గాని, పదోన్నతిపై గాని పనిచేస్తున్న స్టేషన్‌లో మార్పు వచ్చినప్పుడు క్రొత్త స్టేషన్‌లో విధులలో చేరేటందుకు ఉపయో - గించుకోదగిన కాలమును ట్రాన్సిట్ పీరియడ్ అందురు. ఈ పీరియడ్ 7 రోజులు ఉంటుంది. ట్రాన్సిట్ పీరియడ్ జీతము చేరబోయే స్టేషన్‌లోనే డ్రా చేయాలి. కాని ఉద్యోగి కోరికపై జరిగే బదిలీలకు, పదోన్నతులకు ఇది వర్తించదు. ఉపాధ్యాయుల బదిలీ, పదోన్నతులు కౌన్సిలింగ్ ద్వారా జరుగుతున్నందున ట్రాన్సిట్ పీరియడ్‌కు అర్హతలేదు. ఉదయం రిలీవు అయితే క్రొత్త స్టేషన్‌లో ఉదయం 12 గంటల లోపు మాత్రమే జాయిన్ కావాలి.

ప్రశ్న: **నేను బిఏ, బిఇడి అర్హతలతో 15.11.83 నుండి ఎయిడెడ్ యుపి స్కూలులో ఎస్‌జిటిగా పనిచేయుచున్నాను. నాకు 15.11.07 నాటికి 24 సం॥ల స్కేలు మంజూరుకు అర్హత పొందుతాను. 24 సం॥ల స్కేలుకు నేను ఏ పరీక్షలు పాస్ కావాలి? నా పుట్టిన తేది. 21.08.54 కనుక విషయం తెలుపగలరు**

-ఎల్. రామకృష్ణ, ప్రకాశం జిల్లా

జవాబు: జి.ఓ.ఎం.ఎస్.నం. 241 ఆర్థిక, తేది. 28.09.05 (అ.ద. 22, పేజి 29) ప్రకారం మీరు 24 సం॥ల ఎస్‌పిపి-2 స్కేలు పొందవలెనంటే రెండవ ప్రమోషన్ పోస్టు అర్హతలు కలిగియుండాలి. కాని మీరు ప్రాథమికోన్నత పాఠశాలలో పనిచేయుచున్నందున మీకు ప్రమోషన్ ఛానల్‌లో పోస్టులేనందున 24 సం॥ల ఎస్‌ఏపిపి-2 స్కేలు 7385-17475లో వేతన నిర్ణయం జరుగుతుంది. దీని కొరకు టెస్టులు ఏమీ పాస్ కానవసరం లేదు.

ప్రశ్న: **నేను 2003 సం॥లో స్పెషల్ విద్యావాలంటీర్‌గా విధులలో చేరి అక్టోబర్ 2005 నందు రెగ్యులర్ పోస్టులో నియమించబడినాను. జూన్ నెలలో పెరిగిన డిఏ మొత్తం పిఎఫ్ ఖాతా లేని కారణంగా అది పిఎఫ్ ఖాతాలోకి జమకాలేదు. మాకు పెన్షన్ లేదు కాబట్టి పిఎఫ్ తగ్గింపు కూడా లేదు కదా? నేను ఏమీ చేయాలి? తెలుపగలరు.**

- వి. విజయలక్ష్మి, తూ॥గో॥ జిల్లా

జవాబు: తేది. 1.9.04 నుండి నియమితులు కాబడిన ఉపాధ్యాయులు, ఉద్యోగులు నూతన కాంట్రిబ్యూటరి పెన్షన్ విధానంలోకి వస్తారు. మీరు 2005 అక్టోబర్‌లో రెగ్యులర్ పోస్టులోనికి వచ్చినందున మీకు కూడా ఆ నిబంధనలు వర్తిస్తాయి. దీని ప్రకారం మీరు మీ ట్రెజరీ అధికారుల ద్వారా దరఖాస్తు చేసి సిపిఎస్ నెంబరు ఏజి కార్యాలయం నుండి పొందవలసియున్నది. నెల నెలా పే+డిఏలో 10% చందాగా చెల్లించాలి. డిఏ పెరిగిన సందర్భములో కూడా సదరు మొత్తాన్ని ఈ ఖాతాలోనికి జమ చేయవలసి యుంటుంది.

ప్రశ్న: **నేనుడిఎస్‌సి 96 ద్వారా సె.గ్రే. ఉపాధ్యాయునిగా ఎంపిక కాబడి విధులలో చేరినాను. తదుపరి హిందీ "విద్వాన్" మరియు యం.ఏ.(హిందీ), బియిడి, (ఎస్ఎస్ఒ హిందీ మెథడాలజి) పాస్ అయినాను. నేను ఎస్ఏ హిందీ ప్రమోషన్‌కు అర్హుడనా? తెలుపగలరు.**

-

జవాబు: జి.ఒ.ఎం.ఎస్.నం. 96 విద్య, తేది 25.07.05 ప్రకారం స్కూల్ అసిస్టెంట్ (హిందీ) పోస్టుకు కావలసిన అర్హతలు కలిగియున్నారు. కనుక మీరు మీ డిఇఓ కార్యాలయంలో సీనియార్టీ జాబితాలో పేరు చేర్చుకోవచ్చును.

ప్రశ్న: **ఒక ఉపాధ్యాయినికి 120 రోజుల మెటర్నిటి సెలవు మంజూరు చేయుట జరిగింది. తదుపరి ఆమెకు 'సిజేరియన్' ఆపరేషన్‌కు అదనంగా 4 వారాలు సెలవులు వస్తాయని అంటున్నారు. వాస్తవమేనా?**

- కె. ఖాజీహుస్సేన్, కర్నూలు జిల్లా

జవాబు: సిజేరియన్ ఆపరేషన్‌కు 40 రోజుల అదనపు సెలవు అవకాశం లేదు.

ప్రశ్న: **82 రీగ్రూపింగ్ స్కేల్సులో జనవరి నెలకు ఇంక్రిమెంటు ప్రీపోన్ మెంట్ పొందిన వ్యక్తి 3.08.05న సె.గ్రే. పోస్టులో 24 సం॥ల స్కేలు పొందినాడు. అతని తదుపరి ఇంక్రిమెంటు ఎఫ్ఆర్ 31(2) ప్రకారం జనవరి 2006న పొందే అవకాశం ఉన్నదా? తెలుపగలరు.**

- కె. రామకృష్ణారెడ్డి, ప॥గో॥ జిల్లా

జవాబు: అవకాశం ఉన్నది.

ప్రశ్న: **2002 డిఎస్‌సిలో స్పెషల్ విద్యావాలంటీరుగా ఎంపికై 1.12.2005న రెగ్యులర్ ఎస్‌జిటిగా నియమింపబడిన ఎస్‌టి ఉపాధ్యాయునికి, ప్రస్తుత ప్రమోషన్స్‌లో ఎస్ఏ ప్రమోషన్ ఇచ్చే అవకాశం ఉన్నదా?**

- పి. నర్సింహారెడ్డి, పెద్దేముల్, రంగారెడ్డి జిల్లా

జవాబు: లేదు. సర్వీస్ రూల్స్ జి.ఓ. 96 తేది. 25.07.2005 ప్రమోషన్ పొందాలంటే ప్రస్తుత క్యాడర్‌లో కనీసం 3 సం॥ల సర్వీసు పూర్తి చేసి వుండాలి. ప్రభుత్వం స్పెషల్ వివిల శిక్షణా కాలాన్ని అప్రెంటిస్‌గా గుర్తించటం లేదు. కనుక రెగ్యులర్ ఎస్‌జిటి సర్వీసు ప్రాతిపదికగా తీసుకుంటే 30.11.2008లోపు ఎస్ఏ ప్రమోషన్ పొందే అవకాశం లేదు.

ప్రశ్న: నేను బిఎస్‌సి(ఎంపిసి)తో ఎస్ఏ(పిఎస్)గా పని చేయుచున్నాను. జె.ఎల్. ప్రమోషన్ నిమిత్తం ఏ సబ్జెక్టు పి.జి. చేయాలి.

- ఎస్. కళ్యాణి, నిడదవోలు

జవాబు: జెఎల్ ప్రమోషన్‌కు సబ్జెక్టు రిలవెన్సీ లేదు. ఏ సబ్జెక్టులో పి.జి. చేస్తే ఆ సబ్జెక్టు జెఎల్‌గా ప్రమోషన్ పొందే అవకాశం ఉన్నది.

ప్రశ్న: **96 డిఎస్‌సి ఎస్‌సి, ఎస్‌టి బ్యాక్‌లాగ్ పోస్టులలో నియమించబడిన అన్‌ట్రైన్డ్ టీచర్లకు 99 నుండి రెగ్యులర్ స్కేలు మంజూరు చేయబడింది. 2002లో ట్రైనింగ్ పూర్తయింది. వారికి నోషనల్ ఇంక్రిమెంట్లు వచ్చే వీలున్నదా?**

- కె. సుబ్బారాయుడు, బోగో, నెల్లూరు

జవాబు: 89 డిఎస్‌సిలో ఎస్‌సి, ఎస్‌టి బ్యాక్‌లాగ్ పోస్టులలో నియమింప బడిన అన్‌ట్రైన్డ్ ఎస్‌జిటిలకు ప్రభుత్వ మెమో నం. 79/సర్వీస్.3-1/2001-09 విద్య, తేది. 31.07.03 ప్రకారం నోషనల్ ఇంక్రిమెంట్లు మంజూరు చేయబడినాయి. తరువాతి కాలంలో నియామకమైన అన్‌ట్రైన్డ్ ఉపాధ్యాయులకు కూడా నోషనల్ యింక్రిమెంట్లు మంజూరుకు ఉత్తర్వులు ఇవ్వాలని ప్రాతినిధ్యం చేశాము. పాఠశాల విద్యా డైరెక్టరు ఎల్ఆర్ ఆర్‌సి నం. 1023/డి1-2/06, తేది. 20.09.06 ద్వారా ప్రభుత్వానికి ప్రతిపాదనలు పంపారు. ఫైలు ప్రభుత్వం వద్ద పెండింగ్‌లో వున్నది.

ప్రశ్న: **ఎయిడెడ్ టీచర్స్‌కు టిపిఎఫ్ కట్టించుకోవడం లేదు. పోస్టు ఆఫీస్‌లలో ఉన్న అమౌంట్ పరిస్థితి ఏమిటి? భవిష్యత్‌లో టిపిఎఫ్ ఏ విధంగా చెల్లించాలి?**

జవాబు: టిపిఎఫ్ అక్కౌంట్స్ అన్ని 1.01.2006 నుండి మూసి వేయాలని పోస్టల్ డిపార్టుమెంట్ MF(DEA), New Delhi Lr.No. F-7/12/05-NSII, Dt. 10.11.2006 ద్వారా ఉత్తర్వులు ఇవ్వబడినాయి. 1.01.2006 వరకు మాత్రమే వడ్డీ లెక్కించి ఎవరి ఖాతాలో నిల్వ ఉన్న సొమ్మును వారికి చెల్లిస్తారు. భవిష్యత్‌లో టిపిఎఫ్‌ను వేరే విధంగా కొనసాగిస్తారా? లేక మరేదైనా కొత్త స్కీము ప్రారంభిస్తారా? అనే విషయం ప్రభుత్వ నిర్ణయంపై ఆధారపడి వుంటుంది.

ప్రశ్న: **1995 బ్యాచ్ ఉపాధ్యాయులు 10 సం॥ల అనంతరం 2005లో 8 సం॥ల స్కేలు తీసుకున్నారు. ప్రస్తుతం 7070/- వేతనంతో ఉన్నారు. జి.ఓ. 38 వల్ల మా వేతనం పెరుగుదల వచ్చే అవకాశం ఉన్నదా?**

జవాబు: లేదు. జి.ఓ. 38 ప్రకారం అప్రెంటిస్ సర్వీస్ 2 సం॥ కలుపుకొని 8 సం॥ల సర్వీస్‌కి అంటే 2003లోనే 8 సం॥ స్కేలు మంజూరు చేయబడుతుంది. 10 సం॥ల సర్వీసు నిండే వరకు వేతనంలో 1 ఇంక్రిమెంటు పెరుగుదల వుంటుంది. 10 సం॥లు పూర్తవగానే (ఇప్పటికే 8 సం॥ల స్కేలు పొంది వున్నందున) వేతనం సమానం అవుతుంది. అంటే మరల మీ వేతనం రు. 7070గానే వుంటుంది. 2003 నుండి 2005 వరకు 1 ఇంక్రిమెంటు మేరకు బకాయిలు లభిస్తాయి. అవి జిపిఎఫ్ ఖాతాకు జమ చేయబడతాయి.

ప్రశ్న: **అటెండర్‌గా 16 సం॥ సర్వీస్ చేసినాను ఇంకా 8 సం॥ సర్వీస్ ఉన్నది. అనారోగ్య కారణాలవల్ల వాలంటరీ రిటైర్మెంట్ తీసుకోవాలను కుంటున్నాను. నా బేసిక్ పే 6190. నాకు వచ్చే పెన్షను కమ్యుటేషను తదితర రిటైర్మెంట్ బెనిఫిట్స్ గురించి తెలియజేయగలరు.**

- వాడరేవు అమ్మణమ్మ, కందుకూరు,ప్రకాశం జిల్లా

జవాబు: అనారోగ్య కారణాలపై రిటైర్మెంట్ తీసుకోచ్చు. అయితే పెన్షన్, గ్రాట్యుటీ మాత్రమే చెల్లించబడతాయి. కమ్యుటేషన్ రాదు. వాలంటరీ రిటైర్మెంటు తీసుకుంటే కమ్యుటేషన్ వస్తుంది. వాలంటరీ రిటైర్మెంట్ (స్వచ్ఛంద పదవీ విరమణ) తీసుకోవాలంటే 20 సం॥ సర్వీసు (డ్యూటీ కాలం) వుండాలి.

ప్రశ్న: **1.07.95న ఎస్‌జిటిగా చేరాను. 1.07.2005న 8 సం॥ స్కేలు మంజూరైంది. కాని జి.ఒ. 38 ప్రకారం 1.07.2003ననే 8 సం॥ల స్కేలు వస్తుంది. లోగడ 4550 మూలవేతనంతో 1.07.03న ఆర్‌పిఎస్ 2005లో ఫిక్సేషన్ జరిగింది. ఇప్పుడు 1.07.2003 నాడు వేతనం 4750 అవుతుంది. మరల ఆప్షన్ యిచ్చి ఫిక్సేషన్ చేయించు కోవచ్చునా?**

- ఎ. వెంకటేశ్వరరావు, జెడ్‌పిఎస్ఎస్ ముందపల్లి, తూ॥గో॥

జవాబు: 1.7.2003న లోగడ జరిగిన ఫిక్సేషన్ ఆధారంగా నిర్ణయించబడిన వేతనంపైనే 8 సం॥ల స్పెషల్ గ్రేడ్ స్కేలు మంజూరి చేయ బడుతుంది. రీ ఆప్షన్‌తో పనిలేదు.

# రాష్ట్ర నూతన ఆఫీస్ బేరర్స్


సిహెచ్. సుభాష్‌చంద్రబోస్
గౌరవాధ్యక్షులు


ఐ. వెంకటేశ్వర రావు
అధ్యక్షులు


ఎన్. రమణయ్య శాస్త్రి
సహాధ్యక్షులు


ఎన్. నారాయణ
ప్రధానకార్యదర్శి


ఎం. సంయుక్త
కోశాధికారి

## కార్యదర్శులు


సి. కమల కుమారి


పి. మాణిక్ రెడ్డి


బి. నాగేశ్వర రావు


పి. బాబురెడ్డి


ఎన్. సోమచంద్రా రెడ్డి


సి.కె. నాగేంద్రబాబు


ఎన్. కిష్టయ్య


కె. విజయగౌరి


కె. వెంకట్రావు


సిహెచ్. రవి, ప్రధాన సంపాదకులు


ఎ. ఇజ్రాయిల్‌రాజు


ఎ. నర్సిరెడ్డి


కె.ఎస్.ఎస్.ప్రసాద్


జి.ప్రభుదాస్

## ఆడిట్ కమిటీ


సి. హెచ్.రాజిన్‌బాబు, కన్వీనర్


ఎ.శ్రీనివాస్


బి.వి.రమణమూర్తి


ఎస్.ఎం.జిలానీ


వి.మాలకొండారెడ్డి

24A

# రాష్ట్ర మహాసభల దృశ్యాలు




విజయవాడలో పునర్నిర్మించిన రాష్ట్ర ఉప కార్యాలయం చెన్నుపాటి భవన్



నూతన భవనాన్ని ప్రారంభిస్తున్న యుటియఫ్ రాష్ట్ర అధ్యక్షులు సుభాస్ చంద్రబోస్



ఎస్.టి.ఎఫ్.ఐ. పతాకాన్ని ఆవిష్కరిస్తున్న అకడమిక్ సెల్ కార్యదర్శి ఎం.ఎ.కె.దత్తు



అమరజీవులకు నివాళులర్పిస్తున్న రాష్ట్ర గౌరవాధ్యక్షులు పి.కృష్ణమూర్తి





రాష్ట్ర మహాసభ ప్రతినిధులు - మహాసభలను ప్రారంభిస్తున్న సీనియర్ నాయకులు, ఎం.ఎల్.సి. డి.రామిరెడ్డి

## ప్రారంభసభలో జెఏసి నాయకుల సందేశాలు



గోపాల్‌రెడ్డి, జెఏసి చైర్మన్



డి.సుధాకర్, జెఏసి సెక్రటరీజనరల్



జనార్ధన్‌రెడ్డి, జెఏసి ఆర్గనైజింగ్ సెక్రటరీ



సుబ్బరాయన్,
జెఏసి డిప్యూటీ సెక్రటరీ జనరల్

24B

## సందేశములు


ముఖ్యఅతిథి డా॥ చుక్కా రామయ్య, ఎం.ఎల్.సి.


డా॥ కె.నాగేశ్వర్, ఎం.ఎల్.సి.


వి.బాలసుబ్రహ్మణ్యం, ఎం.ఎల్.సి.


కె.ఎస్.లక్ష్మణరావు, ఎం.ఎల్.సి.


కె.జార్జివిక్టర్, ఎం.ఎల్.సి.


ఎం.వి.ఎస్.శర్మ, ఎం.ఎల్.సి.


సిఐటియు నాయకులు డి.వి.కృష్ణ


జె.వి.వి. ప్రధాన కార్యదర్శి రమేష్


ఎస్.ఎఫ్.ఐ. నాయకులు కృష్ణ


యుటియఫ్‌పై పరిశోధనా పత్రంతో
ఎం.ఫిల్ చేసిన శ్రీనివాస్


కార్యదర్శి నివేదిక ప్రవేశపెడుతున్న నారాయణ


ఆర్థిక నివేదిక ప్రవేశపెడుతున్న సంయుక్త


పత్రిక నివేదిక ప్రవేశపెడుతున్న రవి


ఆడిట్‌పై వివరణ ఇస్తున్న చిట్టిబాబు


ప్రచురణలు, భవన నిర్మాణ నివేదికనిస్తున్న
మస్తాన్‌రావు

2లC



తీర్మానాలు ప్రతిపాదిస్తున్న ఎన్.రమణయ్యశాస్త్రి



తీర్మానాలు ప్రతిపాదిస్తున్న ఐ.వెంకటేశ్వరరావు



విద్యాపరిరక్షణ ఉద్యమం విధాన పత్రం
సమర్పిస్తున్న విజయగౌరి

## చర్చలలో పాల్గొన్న జిల్లాల ప్రతినిధులు



జి.గిరిధర్- శ్రీకాకుళం



డి.రాము -విజయనగరం



పి.వి.ఆర్.పి.వర్మ
విశాఖపట్నం



కె.సత్తిరాజు- తూ॥గో॥



ప్రభాకరవర్మ- తూ॥గో॥



ఎస్.కె.సాబ్జి- ప॥గో॥



పార్వతీశం - కృష్ణా



కె.సంజీవరెడ్డి-కృష్ణా



తాండవ కృష్ణ- గుంటూరు



జి.ప్రభుదాస్-గుంటూరు



వెంకటేశ్వరరెడ్డి-ప్రకాశం



శ్రీనివాసరావు-ప్రకాశం



కె.వరంధామయ్య
నెల్లూరు



వై.శ్రీనివాసులురెడ్డి
చిత్తూరు



లక్ష్మీరాజా-కడప



సురేష్- కర్నూలు



బి.నరసింహారావు- ఖమ్మం



బి.రాజశేఖర్ - ఖమ్మం



బలరాం - నల్గొండ



ఎ.నర్సిరెడ్డి-నల్గొండ



ఎస్.సదానందం-వరంగల్



స్వామిరెడ్డి- ఆదిలాబాద్



బి.నారాయణరెడ్డి
ఆదిలాబాద్



సోమేశ్వర్లు- నిజామాబాద్



ఆర్.నరసింహాచారి
రంగారెడ్డి



పురుషోత్తమరావు-
రంగారెడ్డి



ఇంద్రజిత్- హైదరాబాద్



పద్మావతి-గుంటూరు



దుర్గాభవాని-ఖమ్మం



దేవవాణి-తూ॥గో॥

24D

# సమసమాజ నిర్మాణానికి ఉపాధ్యాయ ఉద్యమం అవసరం

**- చుక్కా రామయ్య**

యుటియఫ్ తూ॥గో॥ జిల్లాశాఖ విద్యా వైజ్ఞానిక మహాసభలలో ముఖ్య అతిథిగా పాల్గొన్న ప్రొగ్రెసివ్ డెమొక్రటిక్ ఫ్రంట్ చైర్మన్ చుక్కా రామయ్య ప్రారంభ సభలో మాట్లాడుతూ "సమసమాజ నిర్మాణానికి ఉపాధ్యాయుల ఉద్యమం అవసరం" అని ఉద్బోధించారు. యుటియఫ్ తూ॥గో॥ జిల్లా శాఖ విద్యా వైజ్ఞానిక మహాసభలు 2007 ఏప్రిల్ 25,26 తేదీలలో మార్కెట్ యార్డ్ తుని నందు జరిగాయి.

ప్రారంభ సభ మరియు విద్యాగోష్ఠి యుటియఫ్ రాష్ట్ర సంయుక్త ప్రధాన కార్యదర్శి ఐ. వెంకటేశ్వరరావు అధ్యక్షతన జరిగింది. చుక్కా రామయ్య సభలను ప్రారంభించి మాట్లాడుతూ సామాజిక న్యాయం కోసం యుటియఫ్ ఉద్యమాలు కొనసాగించాలన్నారు. విద్యారంగంలో వస్తున్న పెనుమార్పుల వలన సమస్యలు పెరుగుతున్నాయన్నారు. విద్యార్థులలో సామాజిక పరివర్తన పెంపొందించాలన్నారు. ప్రపంచీకరణ, సరళీకరణ వలన దేశంలో నూతన సంస్కృతి రావటం పట్ల ఆయన ఆందోళన వ్యక్తం చేశారు. రాజ్యాంగంలో ప్రాథమిక విద్యకు ప్రాధాన్యత ఇవ్వగా, విదేశీయులు అందించే అప్పుల కోసం డిపెప్, ఎస్ఎస్ఏ వంటి పథకాలు అమలు చేసి కుంభకోణాలకు పాల్పడుతుందన్నారు. క్రొత్తగా కాన్సెప్ట్ స్కూల్సును ప్రవేశ పెట్టడం వలన పేదలు విద్యకు దూరమతున్నారన్నారు. విద్యను అంగడి సరుకుగా మార్చు చేయడాన్ని ప్రజా ఉద్యమాల ద్వారా అడ్డుకోవాలని సూచించారు. తదుపరి యనమల రామకృష్ణుడు మాట్లాడుతూ విద్యారంగం అభివృద్ధికి ప్రపంచబ్యాంకు షరతులతో కూడిన అప్పులు తప్పేనని అన్నారు. ప్రభుత్వ స్వప్రయోజనాల కోసం విద్యారంగంలో చేర్పులు, మార్పులు చేపడుతున్నదన్నారు. దేశంలో పుష్కలంగా మానవ వనరులు ఉన్నప్పటికీ వాటిని పూర్వ స్థాయిలో వినియోగించటం లేదన్నారు. రాష్ట్ర ప్రధాన కార్యదర్శి ఎన్. నారాయణ మాట్లాడుతూ విద్యాశాఖలో రెవెన్యూ, అటవీ తదితర శాఖల అధికారులకు ఎపిసిలుగా ఎస్ఎస్ఏలో నియమించటం వలన సరసాదేవి, సుబ్రహ్మణ్యం లాంటి వారి కుంభకోణాలు జరుగుతున్నాయన్నారు. కాబట్టి విద్యారంగంలోని అధికారులనే పి.ఓ.లుగా నియమించాలని డిమాండ్ చేశారు. వేసవి సెలవుల్లో ఉపాధ్యాయుల ఉమ్మడి సర్వీస్ రూల్స్ తెచ్చి బదిలీ, ప్రమోషన్ల నియమకాలు చేపట్టాలన్నారు. మున్సిపల్ చైర్‌పర్సన్ కుసుమంచి శోభారాణి, ఆహ్వాన సంఘం అధ్యక్షులు కుసుమంచి సుబ్బరాయులు, యుటియఫ్ రాష్ట్ర ఆడిట్ కమిటీ కన్వీనర్ జి. చిట్టిబాబు, మాజీ రాష్ట్ర కార్యదర్శి పి. పుల్లయ్య, యుటియఫ్ వ్యవస్థాపక అధ్యక్షులు పి.బి. ముత్తారావు, యుటియఫ్ జిల్లాశాఖ గౌరవాధ్యక్షులు పి.వి. రాఘవులు తదితరులు ప్రసంగించారు.

మధ్యాహ్నం జరిగిన ఎంఎల్‌సి విజయోత్సవ సభకు జిల్లాశాఖ సహాధ్యక్షులు పి. కృష్ణం రాజు అధ్యక్షత వహించారు. ఈ సమావేశంలో చుక్కా రామయ్యను, కె. జార్జివిక్టర్‌ను యుటియఫ్ తూ॥గో॥ జిల్లాశాఖ పక్షాన రాష్ట్ర జాయింట్ జనరల్ సెక్రటరీ ఐ. వెంకటేశ్వరరావు, రాష్ట్ర ఆడిట్ కమిటీ కన్వీనర్ జి. చిట్టిబాబు ఘనంగా సన్మానించారు. అనంతరం తుని రూరల్, టౌన్, కోటనందూరు, రౌతులపూడి, శంఖవరం, తాండంగి మండలాల్లో యుటియఫ్ ఉద్యమంలో పనిచేసిన సీనియర్ కార్యకర్తలకు యుటియఫ్ తూ॥గో॥ జిల్లాశాఖ ఆధ్వర్యంలో అభినందన, సన్మాన పురస్కారాలు చేయడమైనది. సాయంత్రం 2 వేలమందితో తునిలో ప్రదర్శన నిర్వహించబడింది. అనంతరం రాత్రి 7 గంటలకు జిల్లాశాఖ అధ్యక్షులు పి. కృష్ణంరాజు అధ్యక్షతన జిల్లాశాఖ ప్రతినిధుల సభ జరిగినది. ఇందులో కార్యదర్శి నివేదికను కె. సత్తిరాజు, ఆర్థిక నివేదికను టి. సూర్యనారాయణ, సంక్షేమ పథకం నివేదికను ఎస్. జ్యోతిబసు, డిఎస్ నాగేశ్వర రావు ప్రవేశ పెట్టారు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలను కోరుతూ, జిల్లా అధికారులను కోరుతూ జిల్లా కార్యదర్శులు తీర్మానాలు ప్రవేశ పెట్టారు.

26వ తేదీ ఉదయం మండల / పట్టణ శాఖల బాధ్యులు మొత్తం 51 మంది చర్చలలో పాల్గొన్నారు. అనంతరం ఐక్య ఉపాధ్యాయ ప్రధాన సంపాదకులు చావా రవి ఎన్నికల అధికారిగా వ్యవహరించిన ఎన్నికలలో జిల్లా కార్యవర్గం, ఆఫీసు బేరర్లు, రాష్ట్ర మహాసభ ప్రతినిధులు ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు.

### జిల్లా నూతన కమిటీ

**ఆఫీస్ బేరర్స్**

గౌ॥ అధ్యక్షులు పి.వి. రాఘవులు, అధ్యక్షులు కె. సత్తిరాజు, సహాధ్యక్షులు కడలి సత్యనారాయణ, ప్రధానకార్యదర్శి జి. ప్రభాకరవర్మ, కోశాధికారి టి. అన్నారాము, కార్యదర్శులు ఆర్.పి. దేవవాణి, జె. అప్పారావు, ఎస్. జ్యోతిబసు, డి.వి. రాఘవులు, డిఎస్. నాగేశ్వర రావు, సిహెచ్.వి. రమణ, జి. సత్యనారాయణ, ఎం. విజయగౌరి, ఇ. చైతన్య కిరణ్, బి. శ్రీనివాసరావు, బి. వీర్రాజు, ఎన్. విశ్వనాథ్, ఎన్. వెంకటేశ్వరరావు, కె.వి. రమణ, కె.వి. ప్రసాద్ బాబు, ఎన్. తిర్నాథ్ రెడ్డి, కె. సుభాష్‌బాబు, పెన్నాడ శ్రీనివాసరావు.

**ఆడిట్ కమిటీ :-** ఓ. నాగేశ్వర రావు(కన్వీనర్), సభ్యులు బిఎన్. వెంకటేశ్వర రావు, పి. మురళీకృష్ణ, సిహెచ్. కేశవ రావు, పి. వేణుగోపాల్, ఎస్. త్రిమూర్తులు, ఎం.టి.ఎస్. రస్కిన్.

### మహబూబ్ నగర్ జిల్లా మహాసభ

ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ మహబూబ్ నగర్ జిల్లా మహాసభ ఏప్రిల్ 30న మహబూబ్‌నగర్‌లో ఏ.పి. మల్లయ్య అధ్యక్షతన జరిగింది. కె. రామదాసు ఉద్యమ పతాకావిష్కరణ చేశారు. మహాసభను రాష్ట్ర గౌ॥అధ్యక్షులు పి. కృష్ణమూర్తి ప్రారంభించారు. ఎంఎల్‌సి ఎన్నికలలో యుటియఫ్ సాధించిన విజయం కార్యకర్తల చొరవ పట్టుదల వల్ల సాధ్యమైందని అన్నారు. ఎంఎల్‌సి ఎన్నికలలో మనం బలపర్చిన వారు గెలవడంతో మన సంఘం పట్ల ఆదరణ పెరిగింది. ఈ విజయంతో జిల్లాలో సంఘ విస్తరణకు కృషి చేయాలని, అన్ని మండలాలకు విస్తరించాలని కోరారు. ప్రధానకార్యదర్శి ఎన్. కిష్టయ్య కృషి నివేదికను, బి. సీత్యానాయక్ కోశాధికారి ఆర్థిక నివేదికను ప్రవేశ పెట్టినారు. 40 మంది ప్రతినిధులు చర్చలో పాల్గొన్నారు. రాష్ట్ర సంయుక్త ప్రధానకార్యదర్శి ఐ. వెంకటేశ్వరరావు ఎన్నికల అధికారిగా, పి. కృష్ణమూర్తి పర్యవేక్షకులుగా వ్యవహరించారు. ఐ. వెంకటేశ్వరరావు మాట్లాడుతూ ఉపాధ్యాయుల ఉమ్మడి సర్వీసు నిబంధనలను సాధించటంలో రాష్ట్ర ప్రభుత్వం ఉదాసీన వైఖరిని అవలంభిస్తుందని, రాష్ట్రపతి ఉత్తర్వులను సాధించటంలో ప్రభుత్వం తాత్సారం చేస్తుందని ధ్వజమెత్తారు. సర్వీస్ రూల్స్ సాధించి ఉపాధ్యాయుల బదిలీలు, పదోన్నతులు, నియామకాలు చేపట్టాలని డిమాండ్ చేశారు. అప్రెంటిస్ కాలాన్ని క్రమ బద్ధీకరిస్తూ 8/16 సంవత్సరాల స్కేళ్ళు ప్రకటిస్తూప్రభుత్వ జి.ఓ.లను వెంటనే విడుదల చేయాలన్నారు.

75 మందితో కార్యవర్గాన్ని వారి నుండి ఆఫీస్ బేరర్లను, యం. నగర్ జిల్లా కమిటీ ఆడిట్ కమిటీ సభ్యులను ఏకగ్రీవముగా ఎన్నుకొన్నది.

### యం.నగర్ జిల్లా నూతన కమిటీ

**ఆఫీస్ బేరర్స్**

గౌ॥అధ్యక్షులు కె. రామదాసు, అధ్యక్షులు ఏ.పి. మల్లయ్య, సహాధ్యక్షులు ఆర్. కృష్ణ, ప్రధాన కార్యదర్శి ఎన్. కిష్టయ్య, కోశాధికారి రఘునాథ్‌రెడ్డి, అబ్దుల్‌వహీద్ ఖాన్, ఎ. జంగయ్య, గిరిధర్, వేణుగోపాల్, హేమలత, శ్యామలమ్మ, వెంకటప్ప, స్వామిరెడ్డి, రవి ప్రసాద్‌గౌడ్.

**ఆడిట్ కమిటీ :-** కన్వీనర్‌గా దేవిజానాయక్, సభ్యులు ఎం. శ్రీనివాస్, సదానందమూర్తి, కె. మల్లయ్య, మాబుసాబ్, బి.ఎస్. ఆనంద్.

**అకడమిక్ కమిటీ :-** ఎస్. భాస్కర్ రెడ్డి, కన్వీనర్ సభ్యులు వి. పుల్లప్ప, ఎన్. నారాయణ, జీవన్ కుమార్, ప్రేంకుమార్, కిశోర్ కుమార్.

# కాన్సెప్ట్ స్కూళ్ళు కాదు కామన్ స్కూళ్ళు రావాలి

రాష్ట్రంలో కావలసినవి కాన్సెప్ట్ స్కూళ్ళు కాదని, కామన్ స్కూళ్ళు రావాలని యుటియఫ్ రాష్ట్ర సహాధ్యక్షులు ఎన్. రమణయ్య శాస్త్రి అన్నారు. మే 3న నిజామాబాద్ యుటియఫ్ కార్యాలయ ప్రాంగణంలో జరిగిన జిల్లా మహాసభకు ముఖ్య అతిథిగా హాజరై ప్రసంగించారు. ప్రభుత్వ విధానాల వల్ల అందరికీ విద్య అందని ద్రాక్షగా మారబోతుందని అన్నారు. సమస్యల పరిష్కారంలో ప్రభుత్వానికి చిత్తశుద్ధి లేదని విమర్శించారు. ముఖ్యంగా ప్రభుత్వ విద్యారంగాన్ని ప్రైవేటీకరించాలనే ధోరణి అంతకంతకు పెరుగుతోందన్నారు. ఉపాధ్యాయులు తమ బాధ్యతలను నిర్వర్తించడంలో శ్రద్ధ చూపడంతో పాటు ఉద్యమాలలో పాల్గొన్నప్పుడే విద్యారంగాన్ని పరిరక్షించుకోగలమని రమణయ్య శాస్త్రి అన్నారు. ఈ సమావేశానికి జిల్లా అధ్యక్షులు ఎ. పోశెట్టి అధ్యక్షత వహించగా ప్రధాన కార్యదర్శి ఎం.వి. సోమేశ్వర్లు నివేదిక సమర్పించారు. జిల్లా గౌరవాధ్యక్షులు సిహెచ్. కిషన్, సహాధ్యక్షులు ఎం.డి. సిరాజుద్దీన్, కోశాధికారి వై. ప్రతాప్‌లతో పాటు వివిధ మండలాల అధ్యక్ష, ప్రధాన కార్యదర్శులు జిల్లా మహాసభ ప్రతినిధులు తదితరులు పాల్గొన్నారు. జిల్లా గౌరవాధ్యక్షులు పి. కృష్ణమూర్తి పర్యవేక్షణలో జిల్లా నూతన కార్యవర్గం ఏకగ్రీవంగా ఎన్నికైంది.

### నిజామాబాద్ జిల్లా కమిటీ

### ఆఫీస్ బేరర్స్

గౌ॥అధ్యక్షులు సిహెచ్. కిషన్, అధ్యక్షులు ఎ. పోశెట్టి, సహాధ్యక్షులు యం.డి. సిరాజుద్దీన్, ప్రధాన కార్యదర్శి యం.వి. సోమేశ్వర్లు, కోశాధికారి వై. ప్రతాప్, కార్యదర్శులు :- కె. చంద్రప్రకాష్, యం.డి. అశ్వకుద్దీన్, వి. వెంకట్రావ్, జి. రాజేశ్వర్, ఎన్. సంతోష్ కుమార్, ఓ. రమేష్, జి. శంకర్, యం. జనార్ధన్, శోభారాణి, ఆండాళ్,

**ఆడిట్ కమిటీ :-** కన్వీనర్ ఎ. మురళీకృష్ణ, సభ్యులు :- కె. నరేందర్, కృష్ణకుమార్, ఎ. శ్రీనివాస్, ఎ. బాలరాజ్.

### ఉత్సాహ పూరిత వాతావరణంలో ప్రకాశం జిల్లా యుటియఫ్ మహాసభలు

ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ ప్రకాశం జిల్లా మహాసభలు ఏప్రిల్ 26,27 తేదీలలో ఒంగోలులో జరిగాయి. 26వ తేది ఉ॥ 10 గంటలకు జిల్లా మహాసభ మరియు ప్రతినిధుల సభకు యుటియఫ్ జిల్లా అధ్యక్షులు వి.పి. వెంకటసుబ్బయ్య అధ్యక్షత వహించగా, రాష్ట్ర కార్యదర్శి కె. వెంకట్రావు ప్రారంభించారు.

ముఖ్యఅతిథిగా హాజరైన శాసనమండలి సభ్యులు డి. రామిరెడ్డి ప్రసంగిస్తూ ఇటీవల కాలంలో చేపట్టిన కార్యక్రమాల వల్ల యుటియఫ్ ప్రతిష్ఠ పెరిగిందని, యుటియఫ్ కార్యకర్తలలో పోరాట పటిమ ఇనుమడించిందన్నారు. జిల్లా వార్తల ప్రధాన సంపాదకులు కె. ఆదినారాయణ సందేశమిచ్చారు.

అనంతరం జిల్లా ప్రధాన కార్యదర్శి మీగడ వెంకటేశ్వర్ రెడ్డి కార్యదర్శి నివేదికను ప్రవేశ పెట్టారు. జిల్లా కోశాధికారి టి. నారాయణ రావు ఆర్థిక, కుటుంబ సంక్షేమ పథకాల నివేదికను ప్రవేశ పెట్టారు. అనంతరం నివేదికలపై విస్తృత స్థాయి చర్చ జరిగింది. జిల్లాలో మండలాలన్నింటిని 9 గ్రూపులుగా విభజించి చర్చించడం జరిగింది. ఈ చర్చలలో 150 మంది ప్రతినిధులు పాల్గొనగా పలువురు మండల నాయకులు రిపోర్టుపై మహాసభలో వెల్లడించారు.

చర్చలకు ప్రధానకార్యదర్శి యం. వెంకటేశ్వరరెడ్డి సమాధానం ఇచ్చిన అనంతరం నివేదికను ఆమోదించారు. సాయంత్రం 6 గంటలకు ప్రకాశం జిల్లా కుటుంబ సంక్షేమ పథక డైరెక్టర్ల బోర్డు సమావేశం జరిగినది. ఈ సమావేశానికి యుటియఫ్ రాష్ట్ర కార్యదర్శి కె. వెంకట్రావు అధ్యక్షత వహించగా టి. నారాయణరావు కార్యదర్శి నివేదికను, షంషుద్దీన్ ఆర్థిక నివేదికను ప్రవేశ పెట్టిరి. సభ్యులు ఆ నివేదికలను ఆమోదించారు.

### విద్యాసదస్సు

రెండవరోజు ఉదయం విద్యా సదస్సు జరిగింది. ఈ సదస్సుకు యుటియఫ్ రాష్ట్ర కార్యదర్శి కె. వెంకట్రావు అధ్యక్షత వహించగా, ఎంఎల్‌సి డి. రామిరెడ్డి సదస్సును ప్రారంభించి ప్రసంగిస్తూ ప్రభుత్వ రంగ పరిరక్షణే ధ్యేయంగా ఎంఎల్‌సిలు పనిచేస్తారని ప్రకటించారు. ప్రాథమిక విద్య వెన్నువిరిచే కాన్సెప్ట్ స్కూల్స్ ఏర్పాటును ప్రభుత్వం విరమించుకోవాలని డిమాండ్ చేశారు. ప్రాథమిక విద్యారంగానికి ప్రభుత్వం కేటాయించే నిధుల శాతాన్ని పెంచాలని, ఎస్ఎస్ఏలో జరుగుతున్న అనవసర ఖర్చులను నియంత్రించాలని, నిధుల దుర్వినియోగాన్ని అరికట్టాలని అన్నారు. క్యూబా చిన్న దేశమైనా విద్యారంగానికి కేటాయించే నిధుల శాతం అధికమని, జపాన్‌లో సాంకేతిక వనరులు తక్కువైనా అభివృద్ధి సాధనలో ముందుందని అందుకు కారణం వారు ప్రాథమిక విద్య పట్ల అధిక శ్రద్ధను కనపరచడమేనన్నారు. అప్రెంటిస్ విధానం పేరిట ఉపాధ్యాయులతో వెట్టిచాకిరి చేయిస్తున్నారని, విద్యాహక్కు చట్టంలోని పలు అంశాలు ఉపాధ్యాయ లోకానికి చేటు కలిగించేవిగా ఉన్నాయన్నారు.

ప్రత్యేక అతిథిగా హాజరైన ఎంఎల్‌సి వి. బాలసుబ్రహ్మణ్యం ప్రసంగిస్తూ విద్యా వ్యవస్థ పతనం వైపు పరుగులు తీస్తుందని, 11వ పంచవర్ష ప్రణాళికలో విద్యారంగానికి కేటాయించిన నిధులు తక్కువన్నారు. రాష్ట్రంలో 172 ప్రభుత్వ డిగ్రీ కళాశాలలుంటే 162 కళాశాలలకు ప్రిన్సిపాల్స్‌లేని దౌర్భాగ్యం ప్రస్తుతం ముందన్నారు. విద్యారంగం పట్ల ప్రభుత్వం సవతి తల్లి ప్రేమను చూపుతుందన్నారు. ప్రభుత్వం వ్యాపార దృక్పథంతోనే కాన్సెప్ట్ స్కూల్స్‌కు అనుమతినిస్తుందని, ఉన్నత విద్య ఇంజనీరింగ్ పట్టభద్రులను తయారు చేసే కర్మాగారంగా తయారైందని విమర్శించారు.

ప్రత్యేక ఆహ్వానితులుగా హాజరైన కలెక్టరు బి. ఉదయలక్ష్మి మానవ వనరుల వృద్ధికి, పిల్లలకు మంచి విద్యను అందించడానికి ప్రభుత్వం పలు పథకాలను ప్రవేశ పెట్టిందని, మానవ వనరుల అభివృద్ధికి మనమే కృషి చేయాలన్నారు. ఒంగోలు పార్లమెంటు సభ్యులు ఎం. శ్రీనివాసులు రెడ్డి, జిల్లా పరిషత్ చైర్‌పర్సన్ కాటం అరుణమ్మ, డిఇఓ మల్లికార్జునశాస్త్రి, డిటిఓ పాలేశ్వరరావు, ఎంఎస్ఆర్ విద్యాసంస్థల గౌ॥ సలహాదారు గోపాల్ రెడ్డి పాల్గొన్నారు. మధ్యాహ్నం జరిగిన సభకు టి. నారాయణరావు అధ్యక్షత వహించగా యుటియఫ్ రాష్ట్ర ప్రధాన కార్యదర్శి ఎన్. నారాయణ ప్రసంగిస్తూ రాష్ట్రంలో 9 ఎంఎల్‌సి స్థానాలకు పోటీ చేసిన మన అభ్యర్థులు 7 స్థానాలలో విజయం సాధించారని, యుటియఫ్ సహకారంతో పశ్చిమరాయలసీమలో ఎస్‌టియు నాయకులు గెలిచారని, ఏపిటిఎఫ్ అనైక్యత కారణంగానే తన స్థానాన్ని కోల్పోయిందన్నారు. స్పాట్ బహిష్కరణ, అప్రెంటిస్ సమస్యల పరిష్కారంలో ఎంఎల్‌సిల కృషిని ప్రస్తావించారు. పోరాటం ఫలితంగానే అప్రెంటిస్ సమస్యను పరిష్కరించుకున్నామని, రాష్ట్రపతి ఉత్తర్వులు, కోర్టులో స్పెషల్ లీవ్ పిటిషన్ వేయడం ద్వారా సర్వీసు రూల్సు సాధించాలని సూచించారు.

ఈ కార్యక్రమంలో యుటియఫ్ రాష్ట్ర సంయుక్త ప్రధానకార్యదర్శి ఐ. వెంకటేశ్వరరావు, యుటియఫ్ రాష్ట్ర అధ్యక్షులు సిహెచ్. సుభాష్‌చంద్రబోస్ ప్రసంగించారు. అనంతరం నిర్వహించబడిన ఎన్నికలలో 150 మందితో జిల్లా నూతన కార్యవర్గం ఏకగ్రీవంగా ఎన్నికైంది.

### ప్రకాశం జిల్లా కమిటీ

గౌ॥ అధ్యక్షులు జి. రవీంద్రనాధ్ రెడ్డి, అధ్యక్షులు యం. వెంకటేశ్వర రెడ్డి, సహాధ్యక్షులు పి. జాన్ విలియం, ప్రధానకార్యదర్శి కె. శ్రీనివాసరావు, కోశాధికారి జి. హరిబాబు, మహిళాకార్యదర్శి ఎస్‌డి. కరుణ కుమారి, కార్యదర్శులు :- జి. శేషయ్య, టి. నారాయణరావు, ఏ. సుబ్బారెడ్డి, సి. సత్యనారాయణ శర్మ, ఒ.వి. వీరారెడ్డి, డి. వీరాంజనేయులు, పి. రమణా రెడ్డి, ఎం. తిరుపతి రెడ్డి, ఎస్. వెంకటసుబ్బయ్య, పి. జయరావు, ఎన్. రఘురామయ్య, ఎం. కోటేశ్వర రావు, పి. నాగేశ్వర రావు, సిహెచ్. శ్రీనివాసరావు. ఆడిట్ కమిటీ కన్వీనర్ కె. కృష్ణమూర్తి, సభ్యులు :- కె. హనుమంతరావు, ఎస్. అంజిరెడ్డి, ఎస్. వేణు, ఎం. శ్రీనివాసరాజు, సిహెచ్. పూర్ణ చంద్రరావు, జి. సూరిబాబు.

# ప్రభుత్వ పాఠశాలల బలోపేతానికి ఉద్యమించాలి

ప్రపంచంలో ప్రతిదానికి ప్రత్యామ్నాయం ఉన్నప్పటికి ఉపాధ్యాయునికి ప్రత్యామ్నాయంలేదని అలాంటి వృత్తిలో ఉన్న ఉపాధ్యాయ సోదరులందరూ వృత్తి ధర్మాలకు అంకితమై ప్రభుత్వ పాఠశాలల బలోపేతానికి కృషి చేయాలని ఉపాధ్యాయ నేతలు పిలుపునిచ్చారు. ఆంధ్ర ప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ గుంటూరు జిల్లా శాఖ 33వ మహాసభలు మే 28వ తేదిన డా॥ బి. ఆర్. అంబేద్కర్ భవన్‌లో నిర్వహించారు. ప్రారంభ సభకు సంఘం రాష్ట్ర కార్యదర్శి కె.ఎస్.వి. దుర్గారావు అధ్యక్షత వహించారు. కృష్ణా, గుంటూరు జిల్లాల ఉపాధ్యాయ నియోజకవర్గ శాసనమండలి సభ్యులు కె. ఎస్. లక్ష్మణరావు ప్రారంభ సభలో మాట్లాడారు. ప్రపంచీకరణ నేపథ్యంలో కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలు అనుసరిస్తున్న విద్యా వ్యతిరేక విధానాల వలన ప్రాథమిక, సెకండరీ, ఉన్నత విద్యా రంగాలు ఉనికి కోల్పోతున్నాయన్నారు. విద్యా వ్యవస్థలో కార్పొరేట్ వ్యక్తులు ప్రవేశించుట వలన విద్య వ్యాపారమయిందన్నారు. ఉన్నత విద్యారంగంలో కాంట్రాక్ట్ విధానం, సెకండరీ విద్యారంగంలో అప్రెంటిస్, విద్యావాలంటీర్ వ్యవస్థ విద్యా లక్ష్యాన్ని దెబ్బ తీసే స్థాయికి తెచ్చాయన్నారు. రాష్ట్ర సంయుక్త కార్యదర్శి ఐ. వెంకటేశ్వర రావు ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. రాష్ట్ర అకడమిక్ సెల్ కన్వీనర్ ఎం.ఏ.కె. దత్, యుటియఫ్ సీనియర్ నేతలు వైయల్ నారాయణ, అంజిరెడ్డి తదితరులు ప్రసంగించారు తదితరులు పాల్గొన్నారు.

**ప్రతినిధుల సభ**

సోమవారం మధ్యాహ్నం ప్రతినిధుల సభ జరిగింది. ఎమ్మెల్సీ డి. రామిరెడ్డి సభలో ప్రసంగించారు. పేదలకు విద్య మరింత దూరం కావడానికి ప్రభుత్వ విధానాలే కారణమన్నారు. కార్యక్రమంలో జిల్లా విద్యాశాఖాధికారి మువ్వా రామలింగం పాల్గొని ప్రసంగించారు. అనంతరం జరిగిన విద్యా సదస్సులో ఆచార్య కె. నాగేశ్వర్, ప్రపంచీకరణ విద్యారంగంపై ప్రభావం అనే అంశంపై మాట్లాడారు. అందరికీ విద్య అందాలంటే కామన్ స్కూల్ విద్యావిధానమే ప్రధానమన్నారు. రెండవరోజు జరిగిన ప్రతినిధుల సభలో ఐద్వా రాష్ట్ర ఉపాధ్యక్షురాలు డి. రమాదేవి మాట్లాడుతూ ప్రభుత్వ పాఠశాలలకు వస్తున్న విద్యార్థులు ఆర్థికంగా, సామాజికంగా వెనకబడినవారేనని, వారికి విద్యనందించాల్సిన బాధ్యత ఉపాధ్యాయులపై ఉందని అన్నారు. యుటియఫ్ రాష్ట్ర ప్రధాన కార్యదర్శి ఎన్. నారాయణ మాట్లాడుతూ ఉపాధ్యాయుల పోరాటాల ఫలితంగానే కొన్ని విజయాలు సాధించామని తెలిపారు. ఉపాధ్యాయుల సమస్యల పరిష్కారానికి దిక్సూచి యుటియఫ్ మాత్రమేనని అన్నారు. ఉపాధ్యాయ సమస్యలతో పాటు, సమాజంలో సమస్యలను కూడా అధ్యయనం చేయాలని కోరారు. కార్యదర్శి నివేదికపై వివిధ మండల, పట్టణ శాఖల బాధ్యులు చర్చలో పాల్గొన్నారు. ఈ కార్యక్రమంలో రాష్ట్ర నాయకులు ఐ. వెంకటేశ్వరరావు, ఎం.ఏ.కె.దత్తు, కె.ఎస్.వి. దుర్గారావు, జిల్లా నాయకులు జి. ప్రభుదాసు, జి. సీతారెడ్డి తదితరులు పాల్గొన్నారు. అనంతరం నూతన కార్యవర్గం ఏకగ్రీవంగా ఎన్నికైంది.

**నూతన కార్యవర్గం**

ఆఫీస్ బేరర్స్ :- గౌ॥ అధ్యక్షులు కె.ఎస్.వి. దుర్గారావు, అధ్యక్షులు ఎన్. తాండవ కృష్ణ, సహాధ్యక్షులు జి. సీతారెడ్డి, ప్రధానకార్యదర్శి జి. ప్రభుదాసు, కోశాధికారి ఎం. హనుమంతరావు, కార్యదర్శులు :- ఏ. నాగేశ్వరావు, టి. వినోద, ఎన్. కుమార్ రాజా, జి. కిరీటి రెడ్డి, ఆర్. సాల్మన్ రాజు, డి. మాలకొండయ్య, ఎన్. వెంకటేశ్వర్లు, కె. పోతులూరయ్య, ఎం.డి. గౌస్, టి. మల్లేశ్వర రావు, కె. విజయభాస్కర్, జి. విజయసారధి, సిహెచ్. పద్మావతి, డి.వి.ఆర్. ప్రసాద్, జి. సుధాకర్ రెడ్డి, ఆడిట్ కమిటీ కన్వీనర్ ఆర్.వి. కృష్ణమాచారి, సభ్యులు :- బి. ప్రశాంత్ కుమార్, జి. శ్రీనివాసరెడ్డి, ఎం. కళాధర్, కె. సాయి ప్రసాద్, గోవింద నాయక్, డి. విజయప్రకాశం, యుటియఫ్ వార్తలు సంపాదకవర్గం :- ఎన్. కుమార్ రాజా, ప్రధాన సంపాదకులు ఆర్.వి. శర్మ, వి. నాగేశ్వరరావు, ఎం. నాగేశ్వరరావు, పి. అప్పారావు, జి. ఉమామహేశ్వరరావు.

## నెల్లూరు జిల్లా మహాసభ

నెల్లూరు జిల్లా మహాసభ ఏప్రిల్ 26,27 తేదీలలో పడుగుపాడు, కోవూరు మండలంలో జరిగింది. శాసనమండలి సభ్యులు డి. రామిరెడ్డి, వి. బాలసుబ్రహ్మణ్యం, జిల్లా పరిషత్ ముఖ్య కార్యనిర్వహణాధికారి సిహెచ్. పెంచలరెడ్డి, పాల్గొని సందేశమిచ్చారు. రాష్ట్ర అధ్యక్షులు సిహెచ్. సుభాష్‌చంద్రబోస్ పరిశీలకులుగా, ఐక్య ఉపాధ్యాయ ప్రధాన సంపాదకలు చావా రవి ఎన్నికల అధికారిగా పాల్గొన్నారు. సవరించబడిన నిబంధనావళి ప్రకారము నూతన కార్యవర్గము 101 మంది, రాష్ట్ర మహాసభ ప్రతినిధులుగా 37 మంది ఎన్నికయ్యారు.

కార్యవర్గ సమావేశంలో జిల్లా ఆఫీస్ బేరర్లుగా 20 మందిని, ఆడిట్ కమిటీ సభ్యులుగా 7 మందిని మరియు కుటుంబ సంక్షేమ పథకం బోర్డు సభ్యులుగా 8 మందిని ఎన్నుకోవడమైనది.

### నూతన కార్యవర్గం

**జిల్లా ఆఫీస్ బేరర్లు :-**

గౌ॥అధ్యక్షులు బి. రమణయ్య, అధ్యక్షులు పి. బాబురెడ్డి, అసోసియేట్ అధ్యక్షులు సి. చంద్రశేఖర్, ప్రధాన కార్యదర్శి కె. పరంధామయ్య, కోశాధికారి జి.వి. భాస్కర్, కార్యదర్శులు ఏ. కేశవులు, పి. జానకిరాం, యం. మస్తానయ్య, డి. భాస్కర్ రావు, యం. అచ్చయ్య, పి. జనార్దన్, కె. పెంచలయ్య, యస్.కె. అంజాద్ అహ్మద్, యస్. అజయ్ సంపత్ కుమారి, యన్.వి. సుబ్బారావు, యు.వి. రమణరావు, డి. గోపాల్, వి. రమాదేవి, వై. రాజశేఖర్ రెడ్డి, జి. మోహన్ రావు, కార్యాలయ కార్యదర్శి సిహెచ్. శ్రీహరి.

**ఆడిట్ కమిటీ :-** కన్వీనర్ ఓ. వెంకటేశ్వర రావు, సభ్యులు- కె. శేఖర్, సిహెచ్. రఘునాద్, పి.వి. నరసింహారావు, వై. రాఘవేంద్రరావు, కె.వి. కాంతారావు, యస్. సత్యనారాయణ.

**కుటుంబ సంక్షేమ పథకం బోర్డు సభ్యులు :-** యస్.కె. ఖాదర్‌భాషా, పి. శ్రీరాములు, యస్.కె. నాయుబ్, డి. సుబ్రహ్మణ్యం, యన్. సురేంద్రబాబు, ఇ. వేణుగోపాల్, నాగారెడ్డి లూర్దు రాజు.

## చిత్తూరు జిల్లా మహాసభ

యుటియఫ్ చిత్తూరు జిల్లా మహాసభలు ఏప్రిల్ 25,26 తేదీలలో కలికిరిలో శ్రీరామమూర్తి అధ్యక్షతన ఘనంగా నిర్వహింపబడినాయి. చిత్తూరు ఉపాధ్యాయ, గ్రాడ్యుయేట్ శాసనమండలి సభ్యులు డి. రామిరెడ్డి, వి. బాలసుబ్రహ్మణ్యంలు ముఖ్య అతిధులుగా పాల్గొని ప్రతినిధులకు స్ఫూర్తిదాయకమైన సందేశం యిచ్చారు. జిల్లా ప్రధాన కార్యదర్శి వై. శ్రీనివాసులు రెడ్డి కార్యకలాపాల నివేదికను ప్రవేశపెట్టగా ప్రతినిధులు చర్చించి ఆమోదించారు. మరుసటి రోజు రాష్ట్ర ప్రధాన కార్యదర్శి ఎన్. నారాయణ హాజరై వర్తమాన ఉపాధ్యాయ ఉద్యమాన్ని గూర్చి వివరించారు. రాష్ట్ర కార్యదర్శి ఎన్. సోమచంద్రారెడ్డి రాష్ట్ర పరిశీలకులుగా వ్యవహరించారు. అనంతరం జరిగిన ఎన్నికలలో నూతన జిల్లా కార్యవర్గం ఏకగ్రీవంగా ఎన్నికైంది.

**ఆఫీస్ బేరర్లు :-** గౌ॥ అధ్యక్షులు కె. రామచంద్రారెడ్డి , అధ్యక్షులు జి. శ్రీరామమూర్తి, సహాధ్యక్షులు కె. రమణయ్య, ప్రధానకార్యదర్శి వై. శ్రీనివాసులు రెడ్డి, కోశాధికారి పి. కోదండ రెడ్డి.

**కార్యదర్శులు :-** ఎస్. రెడ్డెప్ప, ఎస్. నాయుడు, కె. భాగ్యలక్ష్మి, ఎన్. రవిప్రకాష్, ఎన్. గుణశేఖర్ రెడ్డి, టి. ఉత్తాన్ని, పి. సుబ్రహ్మణ్యం, యం. జనార్ధన్ రెడ్డి, డి. నిర్మల, టి. చంద్రశేఖర్ రెడ్డి, ఎస్. ప్రేమ కుమార్, కె. ముత్యాల రెడ్డి, కె.ఎస్.బి. సూర్య ప్రకాష్.

**ఆడిట్ కమిటీ :-** కన్వీనర్ ఎస్.వి. రమణ, సభ్యులు :- ఎన్. శ్రీరాములు రెడ్డి, జి. శ్రీనివాసులు, పి. మునిరామయ్య, బి. రవీంద్రరాజు, ఎన్. ఎర్రయ్య, గోపినాధ్.

# ఐక్య ఉద్యమాలకు స్ఫూర్తిదాయకం జాక్టో ఎస్ఎస్‌సి స్పాట్ బహిష్కరణ

సమైక్యంగా పోరాటం సాగించి కొన్ని విజయాలు సాధించిన జాక్టో పోరాటం ఐక్య ఉద్యమాలకు స్ఫూర్తిదాయకమని యుటియఫ్ సీనియరు నాయకులు బొడ్డేపల్లి మోహనరావు ఉపాధ్యాయులను అభినందించారు. ఏప్రిల్ 15న ఆమదాలవలస, యుటియఫ్ జిల్లా కార్యదర్శి బొడ్డేపల్లి జనార్ధన్ రావు అధ్యక్షతన "జాక్టో పోరాటం-ప్రయోజనం" అనే అంశంపై జరిగిన సదస్సులో ఆయన ప్రసంగించారు. ఈ పోరాటంలో ఉపాధ్యాయులు డబ్బు రూపేణా ఎంత ప్రయోజనం పొందారనే దానికంటే ప్రభుత్వ విధానపరమైన నిర్ణయాన్ని ఏ మేరకు మార్చగలిగారన్నదే ప్రధానమైనదని ఆయన తెలిపారు. సరుబుజ్జిలి మండల శాఖ ప్రధానకార్యదర్శి పేడాడ ప్రభాకర రావు, ఆముదాలవలస మండల శాఖ కార్యదర్శి ఎస్.వి. రమణ మూర్తి, ఆప్టా జిల్లా అధ్యక్షులు ఎస్. గోవిందరాజులు, ఎపిటిఎఫ్ జిల్లా నాయకులు బొడ్డేపల్లి రామకృష్ణ, బూర్జ, యుటియఫ్ నాయకులు యం. సన్యాసిరావు తదితరులు ప్రసంగించారు.

**శ్రీకాకుళంలో**

ఉపాధ్యాయుల 9 ప్రధానమైన సమస్యల పరిష్కారాన్ని డిమాండ్ చేస్తూ రాష్ట్ర జాక్టో కమిటీ పిలుపు మేరకు ఏప్రిల్ 8 నుండి జరపతలపెట్టిన స్పాట్ బహిష్కరణ కార్యక్రమం శ్రీకాకుళంలో 5 రోజులపాటు విజయవంతంగా జరిగింది. స్పాట్ బహిష్కరణ యుటియఫ్ జిల్లా ప్రధానకార్యదర్శి గొంటి గిరిధర్ అధ్యక్షత వహించగా జాక్టో నాయకులు సన్నశెట్టి రాజశేఖర్, జి. యోగానంద్, ఆర్. గణపతిరావు నాయుడు, పి. కృష్ణారావు, డి. పార్వతీశం, డి. రామారావు, తమ్మినేని ఆనందరావు, పి. శివరామకృష్ణ, రవి తదితరులు నాయకత్వం వహించారు.

10వ తేదీ నుండి జరిగిన నిరాహారదీక్షలలో యుటియఫ్ నాయకులు గణనీయంగా పాల్గొన్నారు. 12వ తేదీన వందలాదిమంది టీచర్లతో స్పాట్ కేంద్రం నుండి జిల్లా కలెక్టర్ కార్యాలయం వరకు ర్యాలీ నిర్వహించబడింది.

### ఎంఎల్‌సిల సంఘీభావం

కలెక్టర్ కార్యాలయం వద్ద జాక్టో ఆధ్వర్యంలో జరిగిన బహిరంగ సభకు జాక్టో నాయకుడు, యుటియఫ్ జిల్లా ప్రధానకార్యదర్శి గొంటి గిరిధర్ అధ్యక్షత వహించారు. బహిరంగ సభలో ఉత్తరాంధ్ర గ్రాడ్యుయేట్, టీచర్ ఎంఎల్‌సిలు ఎంవిఎస్. శర్మ, జి. శ్రీనివాసులు నాయుడు సందేశమిస్తూ ఉద్యమాల ద్వారానే సమస్యలు పరిష్కారమవుతాయని, ఉద్యమాలు తీవ్రతరం చేయమని పిలుపునిచ్చారు. పోరాటానికి సంపూర్ణ మద్దతు ప్రకటించారు. జాక్టో పోరాట కార్యక్రమంలో యుటియఫ్ సీనియర్ నాయకులు బి. మోహన్‌రావు, జిల్లా అధ్యక్షులు బొడిగి భాస్కర రావు, కె. కామేశ్వరరావు, జి. రామలక్ష్మి, చౌదరి రవీంద్ర, ఎమ వాగ్దేవి, బి. జనార్ధనరావు, పి. అప్పారావు, యు.ఎ. సూర్యనారాయణ, ఎల్‌వి.చలం, ఎస్‌వి. రమణ, బి. శ్రీరామూర్తి, ఎం. నాగేశ్వరరావు తదితర యుటియఫ్ జిల్లా నాయకులు పాల్గొన్నారు.

**అనంతపురంలో**

రాష్ట్ర జాక్టో పిలుపు మేరకు ఉపాధ్యాయుల అపరిష్కృత సమస్యల పరిష్కార నిమిత్తం ప్రభుత్వ వైఖరికి నిరసనగా అనంతపురంలో 10వ తరగతి 'స్పాట్ వ్యాల్యూయేషన్'ను బహిష్కరించారు. జిటిఏ నేతృత్వంలో ప్రభుత్వ ఉపాధ్యాయులు 'స్పాట్'కు హాజరయ్యేందుకు ప్రయత్నించగా జాక్టో అడ్డుకొన్నది. సిపియం., తెలుగుదేశం, వివిధ ఉద్యోగ, కార్మిక వర్గాలు మద్దతు ప్రకటించాయి. 12వ తేదీన జరిగిన బహిరంగ సభలో ఎంఎల్‌సి పల్లె రఘునాధరెడ్డి మాట్లాడుతూ ఉపాధ్యాయుల న్యాయమైన సమస్యలు పరిష్కరించాలని ప్రభుత్వాన్ని డిమాండ్ చేశారు. సిపిఎం జిల్లా కార్యదర్శి ఓబుళ కొండారెడ్డి తెలుగుదేశం పొలిట్ బ్యూరో సభ్యులు కాలువ శ్రీనివాసులు 93 బి.సి. కులాల ఐక్య వేదిక రాష్ట్ర ప్రధాన కార్యదర్శి నాగరాజు, సిఐటియు జిల్లా ఉపాధ్యక్షులు రాంభూపాల్, జిల్లా జెఏసి చైర్మెన్ పెద్దన్న గౌడ్, యన్.జి.ఓ. జిల్లా ప్రధానకార్యదర్శి జయరామ్, యస్ఎఫ్ఐ జిల్లా నాయకుడు ఉదయ్ కుమార్, డివైయఫ్ఐ జిల్లా అధ్యక్షులు మనోహర్, జాక్టో నాయకులు తదితరులు ప్రసంగించారు.

స్పాట్ వాల్యుయేషన్ బహిష్కరణ ఉద్యమంలో యుటియఫ్ పక్షాన జిల్లా గౌరవాధ్యక్షులు ఈరజిన్నప్ప, అధ్యక్ష, ప్రధాన కార్యదర్శులు సి.కె. నాగేంద్రబాబు, జె. రమేష్, కోశాధికారి మహమ్మద్ జిలాన్, కార్యదర్శులు కమలాదేవి, శ్రీనివాసులు, వేణుగోపాల్, రాజశేఖర్ రెడ్డి, రాంభూపాల్ రెడ్డి, చన్నా రెడ్డి, హరికృష్ణ, ఓబులేసు, ఓబుళపతి, రమణయ్య, జిల్లా ఆడిట్ కన్వీనర్ వెంకటరెడ్డి మరియు జిల్లాలోని అన్ని మండలాల యుటియఫ్ నాయకులు, కార్యకర్తలు పాల్గొన్నారు.

**విజయనగరంలో**

విజయనగరం జిల్లాలో జాక్టో ఆధ్వర్యంలో స్పాట్ బహిష్కరణ, పోరాట కార్యక్రమం జయప్రదం అయింది. స్పాట్ మొదలైన నాటి నుండి జాక్టో నేతలు బహిష్కరణ విజయవంతానికి కృషి చేశారు. 3వ రోజు నుండి సామూహిక నిరాహారదీక్ష శిబిరాలు జరిగాయి. అన్ని ఉపాధ్యాయ సంఘాల నేతలు ఈ దీక్షలలో పాల్గొన్నారు. రెండవరోజు శిబిరాన్ని ఉత్తరాంధ్ర నియోజకవర్గ ఎమ్మెల్సీ అభ్యర్ధి ఎం.వి.ఎస్. శర్మ సందర్శించి ప్రభుత్వం జాక్టో ఉద్యమం పట్ల తీసుకుంటున్న వైఖరిని, ప్రాథమిక విద్యారంగ నిర్లక్ష్య వైఖరిని వివరిస్తూ సంపూర్ణ మద్దతును ప్రకటించారు.

5వ రోజున స్పాట్ కేంద్రంలోపలికి హాజరవుతున్న ఏసిఒడబ్ల్యు, జిటిఏ టీచర్లను పోనివ్వకుండా అడ్డుకుంటున్న సమయంలో 144వ సెక్షన్‌ను విధించారు. యుటియఫ్ నాయకులు విజయగౌరి, రాము, శేషగిరి, వెంకటరావు, ఏపిటిఎఫ్ సదాశివరావు, పిఆర్‌టియు విక్టర్‌బాబు, ఏపిటిఎఫ్ విజయ్ కుమార్, ఏపియుఎస్ సత్యం, జగన్నాధరావు తదితరులు 59 మందిని పోలీసులు ఈడ్చుకుంటుపోయి అరెస్టు చేసి స్వంత పూచీకత్తుపై మధ్యాహ్నం 3 గంటలకు విడిచి పెట్టారు.

పోలీసు స్టేషనులో ఉన్న ఉపాధ్యాయులను ఉత్తరాంధ్ర జిల్లాల టీచర్, గ్రాడ్యుయేట్ ఎమ్మెల్సీలు జి. శ్రీనివాసనాయుడు, ఎం.వి.ఎస్. శర్మని కలిసి విడుదలకు కృషి చేశారు.

**ఖమ్మంలో**

ఉపాధ్యాయుల సమస్యల పరిష్కారంలో రాష్ట్ర ప్రభుత్వ ఉదాసీన వైఖరికి వ్యతిరేకంగా రాష్ట్ర జాక్టో పిలుపు మేరకు 10వ తరగతి స్పాట్ వ్యాల్యూయేషన్ బహిష్కరణ కార్యక్రమం ఖమ్మం జిల్లాలో విజయవంతంగా జరిగింది.

జాక్టో నాయకుల అక్రమ అరెస్టులను నిరసిస్తూ అన్ని మండలాలలో రాస్తారోకోలు, ప్రదర్శనలు, ధర్నాలు జరిగాయి. ఆందోళనను తీవ్రతరం చేయడంతో భాగంగా 'స్పాట్' కేంద్రాల వద్ద జరిగిన నిరాహారదీక్షలలో అనేకమంది పాల్గొని ఎన్ని త్యాగాలైన చేసి పోరాటాన్ని ఉధృతంగా నిర్వహిస్తామని హెచ్చరించారు. ఎట్టకేలకు ప్రభుత్వంతో ఒప్పందం కుదరటంతో పోరాటాన్ని విరమించారు. ప్రభుత్వం, అధికారులు ఎన్ని కుట్రలు పన్నినా స్పాట్ విధులకు హాజరుకాకుండా పోరాటాన్ని విజయవంతం చేసిన ఉపాధ్యాయులందరికి జిల్లా జాక్టో ఉద్యమాభివందనలు తెల్పింది. జిల్లా జాక్టో నాయకులు జి. రాజశేఖర్, ఎన్. కృష్ణమోహన్, వి. మాధవరావు, వి. మనోహర్ రాజు, హెచ్. రాజయ్య, ఎం.ఎం. పాషా, రామచంద్రరావు, వీరభద్రం, రంగాచారి, మురళీకృష్ణ, సురేష్ తదితరులు ఆందోళనకు నాయకత్వం వహించారు.

**నల్లగొండలో**

నల్లగొండ జిల్లాలో స్పాట్ బహిష్కరణ విజయవంతంగా నిర్వహించబడింది. స్పాట్ బహిష్కరించిన ఉపాధ్యాయులు పెద్ద ఎత్తున 'ధర్నా' నిర్వహించనైనది. ఈ ధర్నాలో 1500 ఉపాధ్యాయులు పాల్గొన్నారు. ధర్నా శిబిరానికి జాక్టో స్టీరింగ్ కమిటీ సభ్యులు ఎ. నర్సిరెడ్డి అధ్యక్షత వహించినారు. ఈ శిబిరాన్ని యం.ఎల్.సి. డా॥ చుక్కా రామయ్య సందర్శించారు.. వీరు ఉపాధ్యాయులకు సందేశానిస్తూ, మీరు పోరాటాలు చేయండి, మీకు వెన్నుదన్నుగా

మేముంటాము అని పేర్కొన్నారు. రాష్ట్ర ప్రభుత్వము ఉపాధ్యాయ సమస్యల పరిష్కారంలో ప్రభుత్వము చేస్తున్న జాప్యము సరైంది కాదన్నారు. మీ సమస్యలు న్యాయమైనవి. మీ పోరాటము న్యాయమైనదని పేర్కొన్నారు. రాష్ట్ర పరిశీలకులుగా పిఆర్‌టియు ప్రధానకార్యదర్శి రవికిరణ్ పాల్గొన్నారు. టిఎన్‌యుఎస్ రాష్ట్ర అధ్యక్షులు యన్. దమనేశ్వర రావు, మాజీ శాసనసభ్యులు నంద్యాల నర్సింహారెడ్డి, సిఐటియు జిల్లా అధ్యక్షులు గోపి 'ధర్నా'ను సందర్శించి సందేశాన్నిచ్చారు. ఏప్రిల్ 9న జిల్లాలోని ప్రధాన పట్టణాల నుండి ఉపాధ్యాయులు స్పాట్ వ్యాల్యుయేషన్ సెంటరుకు రాకుండా సమాచారమిచ్చి ఇండ్లకు పంపించనైనది. ఏప్రిల్ 10,11 తేదీలలో నల్లగొండ, మిర్యాలగూడ, సూర్యాపేట, దేవరకొండ, భువనగిరి, కోదాడ కేంద్రాలలో రిలే నిరాహార దీక్ష శిబిరాలు నిర్వహించనైనది. ఏప్రిల్ 10న మరియు 12న నల్లగొండ పట్టణములో ఉపాధ్యాయులు ప్రదర్శనగా స్పాట్ కేంద్రము వైపు వెళ్ళగా 100 మందికి పైగా ఉపాధ్యాయులను అరెస్టు చేయనైనది. 12న యంఎల్‌సి చెరుపల్లి సీతారాములు ఉపాధ్యాయుల ప్రదర్శనలో పాల్గొని, ఉపాధ్యాయులతో పాటు అరెస్టయ్యారు. జిల్లా వ్యాప్తంగా 12 కేంద్రాలలో ఉపాధ్యాయ ర్యాలీలు నిర్వహించనైనది.

**మిర్యాలగూడలో :-** జాక్టో పిలుపు మేరకు ఏప్రిల్ 8 నుండి ఎస్‌ఎస్‌సి స్పాట్ బహిష్కరణ కొనసాగుతున్న సమయంలో, ఆ పోరాటానికి మద్దతుగా మిర్యాలగూడలో పలు కార్యక్రమాలు నిర్వహించబడినవి. 9న ఉదయమే జాక్టో నాయకులు బస్టాండులో మోహరించి ఉపాధ్యాయులెవరూ స్పాట్ క్యాంపులకు వెళ్ళవద్దని వివరించి పాఠశాలలకు పంపించారు. 10న మిర్యాలగూడెం వచ్చిన హోంమంత్రి కె. జానారెడ్డికి సమస్యలు పరిష్కరించాలంటూ వినతి పత్రం సమర్పించారు. 12న భారీ ర్యాలీని నిర్వహించారు. ఈ కార్యక్రమాలలో యుటియఫ్ నాయకులు లక్‌పతినాయక్, ఇతర జాక్టో నాయకులు పాల్గొన్నారు.

**సూర్యాపేటలో :-** జాక్టో ఆధ్వర్యంలో ఏప్రిల్ 10న సూర్యాపేట ఆర్‌డిఓ కార్యాలయం వద్ద రిలే నిరాహారదీక్షలు ప్రారంభించారు. స్థానిక రాజకీయ పార్టీల కార్మిక విద్యార్థి సంఘాల నాయకులు శిబిరాన్ని సందర్శించి పోరాటానికి మద్దతు పలికారు. ఏప్రిల్ 12న పట్టణంలో మహా ర్యాలీని నిర్వహించారు. ఈ కార్యక్రమాలకు యుటియఫ్ జిల్లా నాయకులు సిహెచ్. రాములు ఇతర జాక్టో సభ్య సంఘాల నాయకులు నాయకత్వం వహించారు.

## వరంగల్ జిల్లా మహాసభ

వరంగల్ జిల్లా మహాసభ వరంగల్ పట్టణంలోని లెర్నర్స్‌లాండ్ జూనియర్ కళాశాలలో జిల్లా శాఖ అధ్యక్షులు ఏ. రమేష్ కుమార్ అధ్యక్షతన నిర్వహించబడింది. ఈ మహాసభలో 42 మండలాల అధ్యక్ష, ప్రధానకార్యదర్శులు మరియు జిల్లా మహాసభ ప్రతినిధులు 100 మంది పాల్గొన్నారు. ముఖ్య అతిథిగా విచ్చేసిన రాష్ట్ర కార్యదర్శి, ఐక్య ఉపాధ్యాయ ప్రధాన సంపాదకులు చావా రవి మహాసభను ప్రారంభించి మాట్లాడుతూ ఎంఎల్‌సి ఎన్నికల ఫలితాలు మరియు రాష్ట్ర కమిటీ నిర్వహిస్తున్న ఉద్యమాల వలన వరంగల్ జిల్లాలో యుటియఫ్ ఉద్యమ విస్తరణకు, నిర్మాణ పటిష్టతకు అనుకూలమైన పరిస్థితులు ఉన్నాయని, కార్యకర్తలు ఉద్యమ స్ఫూర్తితో రాబోయే సంవత్సరాలలో సైనికుల్లా పని చేసి యుటియఫ్ ఉద్యమాన్ని విస్తృత పరచాలని పిలుపునిచ్చారు. జాక్టో ఒప్పందం ప్రకారం జి.ఓ.లను విడుదల చేయాలని ప్రభుత్వాన్ని డిమాండ్ చేశారు. ప్రధానకార్యదర్శి ఎస్. సదానంద్ కార్యకలాపాల నివేదికను ప్రవేశ పెట్టగా ప్రతినిధులు చర్చించి ఆమోదించారు. విద్యారంగ, ఉపాధ్యాయ సమస్యలపై పలు తీర్మానాలను మహాసభ ఆమోదించింది.

అనంతరం 2006-08 సం॥కి జిల్లా శాఖకు నిర్వహించిన ఎన్నికలలో కార్యవర్గ సభ్యులను ఎన్నుకోవడం జరిగింది. ఈ కార్యవర్గ సభ్యులు జిల్లా ఆఫీస్ బేరర్స్‌ను, ఆడిట్ కమిటీని ఏకగ్రీవంగా ఎనుకున్నారు.

వరంగల్ జిల్లా ఆఫీస్ బేరర్స్ :- గౌ॥ అధ్యక్షులు కె. యాదగిరి, అధ్యక్షులు ఏ. శ్రీనివాస్, సహాధ్యక్షులు ఎన్. బాబు, ప్రధానకార్యదర్శి ఎస్. సదానంద్, కోశాధికారి కె. సుధాకరాచారి. జిల్లా కార్యదర్శులు :- శౌరి అసెంధినా, ఎం. జయప్రకాశ్, ఎం.డి. మోయిజుద్దీన్, కె. సోమయ్య, ఎస్. సమ్మారావు, కె. రంజిత్ కుమార్, సోమశేఖర్, నాగయ్య, ఆర్. వాసుదేవ రెడ్డి, ఏ. వెంకటేశ్వర్లు. ఆడిట్ కమిటీ :- కన్వీనర్ ఎస్. మల్లా రెడ్డి, సభ్యులు ఏ. రమేశ్ కుమార్, డి. కిరణ్ కుమార్, కె. కళ, ఎం. సంగయ్య, ఎస్‌కె. హమీద్, రవి.

## పశ్చిమగోదావరి జిల్లా మహాసభ

యుటియఫ్ పశ్చిగోదావరి జిల్లా 10వ మహాసభలు ఏలూరునందు మే 7,8 తేదీలలో జరిగాయి. మహాసభల ప్రారంభ సందర్భముగా జాతీయ పతాకాన్ని శాసనమండలి సభ్యులు డి. రామిరెడ్డి ఎస్‌టిఎఫ్ఐ పతాకాన్ని రాష్ట్ర అధ్యక్షులు చెరుకూరి సుభాష్‌చంద్రబోస్, యుటియఫ్ పతాకాన్ని యుటియఫ్ మాజీ జిల్లా నాయకులు వలవల శ్రీరామమూర్తి ఆవిష్కరించారు. ప్రారంభ సభకు రాష్ట్ర అధ్యక్షులు చెరుకూరి సుభాష్‌చంద్రబోస్ అధ్యక్షత వహించి మాట్లాడుతూ యుటియఫ్ రాష్ట్రంలో ఉద్యమాలకు కేంద్ర బిందువుగా పని చేస్తుందని రాబోయే రోజులలో విద్యారంగ పరిరక్షణ ఉద్యమాలలో ఉపాధ్యాయులంతా పెద్ద ఎత్తున పాల్గొనాలని పిలుపునిచ్చారు.

శాసనమండలి సభ్యులు డి. రామిరెడ్డి మహాసభలను ప్రారంభించి మాట్లాడుతూ యుటియఫ్ ఆవిర్భావం నాటికీ నేటికి పరిస్థితులలో చాలా మార్పులు వచ్చాయని అన్నారు. ఉపాధ్యాయుల ఆర్థిక పరమైన సమస్యలు పరిష్కారం కావాలంటే రాజకీయంగా అనుకూల పరిస్థితులు వుండాలన్నారు. ప్రజాస్వామ్య యుతంగా, అంకిత భావంలో పని చేసి ఉద్యమాలను, విద్యా రంగాన్ని పు॥రక్షించుకోవాలని పిలుపునిచ్చారు.

మే 7వ తేది మధ్యాహ్నం నుండి ప్రతినిధుల సభ జిల్లా శాఖ అధ్యక్షులు అలుగు ఇజ్రాయేల్‌రాజు అధ్యక్షతన జరిగింది. కార్యదర్శి నివేదికను జిల్లా ప్రధానకార్యదర్శి షేక్ సాబ్జీ, ఆర్థిక నివేదిక, కోశాధికారి బి.వి. రమణ మూర్తి, పత్రికా నివేదిక బిఎస్. ప్రకాశరావు, ఆడిట్ నివేదిక పి. శ్రీనివాసరాజు ప్రవేశ పెట్టారు. 40 మంది ప్రతినిధులు చర్చలలో పాల్గొన్నారు.

ప్రతినిధుల వుద్దేశించి శాసనమండలి సభ్యులు పిడిఎఫ్ చైర్మన్ చుక్కా రామయ్య మాట్లాడుతూ విద్యాలయాలు పోరాట కేంద్రాలుగా తీర్చిద్దేందుకు ఉపాధ్యాయులు కృషి చేయాలన్నారు. విద్యారంగం కార్పొరేట్‌మయం కావడంలో సామాన్యులకు ఉన్నత విద్య అందడం లేదన్నారు. దీనికి వ్యతిరేకంగా యుటియఫ్ కార్యకర్తలు ఉద్యమించాలన్నారు. ఉపాధ్యాయ ఎంఎల్‌సి కె.ఎస్. లక్ష్మణ రావు మాట్లాడుతూ ప్రపంచీకరణ ప్రభావం విద్యారంగంపైన ఉపాధ్యాయులపైన తీవ్రమైన ప్రభావం చూపుతుందని యుటియఫ్ కార్యకర్తలు దీనిని అధిగమించాలని అన్నారు. శాసనమండలి సభ్యులు కె.జార్జివిక్టర్ మాట్లాడుతూ ఉపాధ్యాయులు స్వంత లాభం కొంతమానుకొని సామాజిక స్పృహతో పనిచేసి విద్యార్థుల తల్లిదండ్రుల ఆదరాభిమానాలు పొందాలన్నారు.

రాష్ట్ర ప్రధాన కార్యదర్శి ఎన్. నారాయణ మాట్లాడుతూ రాష్ట్రంలో జరిగిన జాక్టో పోరాటం, ఫలితాలు, అనుభవాలు వివరించారు. ఐక్య ఉపాధ్యాయ పత్రిక ప్రధాన సంపాదకులు చావా రవి ఎన్నికల అధికారిగా వ్యవహరించి జిల్లా శాఖ ఎన్నికలు నిర్వహించారు. ఏకగ్రీవంగా జరిగిన ఎన్నికలలో 133 మంది కార్యవర్గసభ్యులు ఎన్నికైనారు. కార్యవర్గసభ్యులు, జిల్లా ఆఫీస్ బేరర్స్‌ను, ఆడిట్‌కమిటీని ఎన్నుకోవడం జరిగింది.

జిల్లా కమిటీ :- గౌ॥ అధ్యక్షులు అలుగు ఇజ్రాయేల్ రాజు, అధ్యక్షులు కె. పార్థసారధి, సహాధ్యక్షులు టి.వి. రామకృష్ణ, ప్రధానకార్యదర్శి షేక్ సాబ్జీ, కోశాధికారి బి.వి. రమణమూర్తి, కార్యదర్శులు ఎస్. బాలయ్య, బిఎస్. ప్రకాశరావు, ఎంఎస్ఆర్‌కె. ప్రసాదు, ఎస్. జయప్రభ, జి.వి. రామానుజరావు, ఎస్. శ్రీకాంత్, ఎం. రామకృష్ణ, సిహెచ్. జగన్మోహన్‌రావు, ఎస్. చలపతి రావు, వి. రవీంద్రనాథ్, యం.వి. శ్యాంబాబు, ఎ.కె.వి. రామభద్రం, జె. రాంబాబు, సిహెచ్. భాస్కర రావు, ఎం.వి. పద్మావతి, ఐ.వి. నరసింహరాజు, పి.వి. నరసింహరావులు ఎన్నికైనారు.

ఆడిట్ కమిటీ :- పి. శ్రీనివాసరావు (కన్వీనర్), సభ్యులు వై. రామకృష్ణ, వివిబిఎఫ్. సుబ్రహ్మణ్యం, షేక్ ముస్తఫాలీ, ఎస్ఎస్‌వి. అవధాని, యం. పుల్లంరాజు, జి.వి. సూరపరాజులు.

# "అవినీతి, అక్రమాలపై సమగ్ర విచారణ కోరుతూ అనంత జాక్టో ఆధ్వర్యంలో యస్‌యస్‌ఏ ముట్టడి"

అనంతపురం జిల్లా సర్వశిక్షా అభియాన్ (యస్‌యస్‌ఏ)లో జరిగిన అవినీతి, అక్రమాలపై సమగ్ర దర్యాప్తు జరిపి బాధ్యులైన వారిపై చర్యలు చేపట్టాలని డిమాండు చేస్తూ జిల్లా ఉపాధ్యాయ సంఘాల సంయుక్త సమాఖ్య (జాక్టో) మే 8వ తేదీన యస్‌యస్‌ఏ జిల్లా కార్యాలయం ముట్టడించింది. కార్యాలయ సిబ్బందిని విధులకు హాజరుకాకుండా జాక్టో నాయకులు అడ్డుకొన్నారు. యస్‌యస్‌ఏ ముట్టడి కార్యక్రమంలో యుటియఫ్ అగ్రభాగాన నిలిచింది. మూడున్నర అడుగుల ఎత్తుగల కనీసం వెయ్యి రూపాయలు కూడా చేయని నాసిరకం బీరువాలను కమీషన్లకు కక్కుర్తిపడి 4750 రూపాయలకు కొనుగోలు చేసి ప్రజా ధనాన్ని మెక్కేశారని, పుస్తకాల ముద్రణ, కొనుగోళ్ళలోను యస్‌యస్‌ఏ అధికారులు ప్రభుత్వ నియమ నిబంధనలు పాటించక లక్షలాది రూపాయల కమీషన్లు దండుకొన్నారని ఆరోపించారు. వీటన్నింటిపైన సిబిసిఐడి చేత విచారణ జరిపించాలని, నాసిరకంగా సరఫరా చేసిన బీరువాలను వెనక్కి తీసుకోవాలని డిమాండు చేశారు. ఈ కార్యక్రమంలో యుటియఫ్ పక్షాన జిల్లా గౌ॥అధ్యక్షులు బి. ఈరజిన్నప్ప, అధ్యక్షులు సి.కె. నాగేంద్రబాబు, కోశాధికారి మహమ్మద్ జిలాన్, జిల్లా కార్యదర్శులు వేణుగోపాల్, రాంభూపాల్ రెడ్డి, హరికృష్ణ, ఓబుళపతి, అనంతపురం నగరం, అనంతపురం రూరల్ పామిడి, గార్ల దిన్నె, శింగనమల, నార్పల, బుక్కరాయ సముద్రం, రాప్తాడు, బత్తలపల్లి, తాడిమర్రి, ఆత్మకూరు, కూడేరు, యల్లనూరు, ముదిగుబ్బ, చిలమత్తూరు, అమరాపురం తదితర మండలాల నుండి యుటియఫ్ నాయకులు, కార్యకర్తలు పాల్గొన్నారు.

### శిక్షణా తరగతుల బహిష్కరణ

మే 23న అనంతపురం జిల్లా సర్వశిక్షా అభియాన్ (యస్‌యస్‌ఏ) అవినీతి, అక్రమాలపై సిబిసిఐడి విచారణ జరిపించాలని డిమాండు చేస్తూ మే 23న యస్‌యస్‌ఏ శిక్షణా తరగతులను 'జాక్టో' బహిష్కరించింది. ఈ సందర్భంగా 'జాక్టో' నేతలు ప్రసంగిస్తూ జిల్లాలో పాఠశాలలకు సరఫరా చేసిన నాసిరకం బీరువాలను వెనక్కు తీసుకోవాలని డిమాండు చేశారు. పాఠశాల గ్రాంటు, స్కూల్ గ్రాంటు వెంటనే విడుదల చేయాలని కోరారు. ఈ కార్యక్రమంలో యుటియఫ్ పక్షాన రాష్ట్ర కార్యదర్శి, జిల్లా అధ్యక్షుడు సి.కె. నాగేంద్రబాబు, గౌ॥అధ్యక్షులు బి. ఈరజిన్నప్ప.

# ఎంఎల్‌సి ఎన్నికల విజయోత్సవ సభలు

### ఒంగోలులో

ప్రకాశం, నెల్లూరు, చిత్తూరు జిల్లాల నుండి శాసనమండలి సభ్యులుగా ఎన్నికైన దాచూరి రామిరెడ్డి, విఠపు బాలసుబ్రహ్మణ్యం విజయాన్ని పురస్కరించుకొని మార్చి 29న ఒంగోలులో అపూర్వమయిన ర్యాలీ మరియు విజయోత్సవ సభ నిర్వహించబడ్డాయి. విజయోత్సవ సభకు రాష్ట్ర కార్యదర్శి కె. వెంకట్రావు అధ్యక్షత వహించారు. ముఖ్య అతిథులుగా దాచూరి రామిరెడ్డి, విఠపు బాలసుబ్రహ్మణ్యం, జెఏసి జిల్లా అధ్యక్షులు షేక్ బషీర్, సిఐటియు జిల్లా కార్యదర్శి ఎన్. ప్రభుదాసు, జె.వి.వి. ప్రధానకార్యదర్శి కె. సుబ్రహ్మణ్యాచారి, జిల్లా సీనియర్ నాయకులు కె. ఆదినారాయణ, టి. నారాయణరావు, జిల్లా గౌరవాధ్యక్షులు ఏ. సుబ్బారెడ్డి, జిల్లా సహాధ్యక్షులు పి. జాన్ విలియం జె.వి.వి. నాయకులు, ఏ.వి. పుల్లారావు మొ॥ వారు పాల్గొన్నారు. జిల్లా నలుమూలలనుండి 700 మంది ఉపాధ్యాయులు, ఉద్యోగులు కార్యక్రమంలో పాల్గొన్నారు.

### ఆదోనిలో

ఎంఎల్‌సి ఎన్నికల విజయోత్సవ ర్యాలీ, సభ మార్చి 30 సాయంత్రము కర్నూలు జిల్లా ఆదోని డివిజన్ శాఖ ఆధ్వర్యంలో ఆదోనిలో జరిగింది. 50 మంది మహిళా ఉపాధ్యాయులు ర్యాలీలో పాల్గొనడం విశేషం.

ర్యాలీ తర్వాత జరిగిన విజయోత్సవ సభకు ఆదోని శాఖ అధ్యక్షులు జగదీశ్వరయ్య అధ్యక్షత వహించగా ముఖ్య అతిథిగా యుటియఫ్ జిల్లా శాఖ అధ్యక్షులు ఎస్. నరసింహుడు హాజరయిరి. ఉపాధ్యాయ ఎంఎల్‌సిలు డి. రామిరెడ్డి, లక్ష్మణ్‌రావు, చుక్కా రామయ్య, గ్రాడ్యుయేట్ నియోజకవర్గ ఎంఎల్‌సిలు నాగేశ్వర్, జార్జ్‌విక్టర్, వి. బాలసుబ్రహ్మణ్యం, ఎంవిఎస్. శర్మ ఎన్నిక కావడం యుటియఫ్ ఘనవిజయానికి నిదర్శనం అంటూ, విజయోత్సవ ర్యాలీలో పాల్గొన్న ఉపాధ్యాయులకు జిల్లా శాఖ పక్షాన అభినందనలు తెలియజేశారు. ప్రజాసేవకు, విద్యారంగ పరిరక్షణకు యుటియఫ్ మద్దతుతో గెలుపొందిన ఎంఎల్‌సిలు కృషి చేయాలని కోరారు. యుటియఫ్ జిల్లా శాఖ సహాధ్యక్షులు డి. రామశేషయ్య జిల్లా సహాధ్యక్షులు పి. జాన్ విలియం, సిఐటియు నాయకులు, రాధకృష్ణ, ఎస్‌ఎఫ్‌ఐ, డివైఎఫ్‌ఐ నాయకులు మహిళా ఉపాధ్యాయ నాయకురాలు సుజాత తదితరులు పాల్గొన్నారు. ఆదోని డివిజన్ పరిధిలోని మండల శాఖల అధ్యక్ష, ప్రధానకార్యదర్శులు, ఉపాధ్యాయులు పాల్గొన్నారు.

### గిద్దలూరులో

ఏప్రిల్ 15న ప్రకాశం జిల్లా గిద్దలూరు నందు ఎంఎల్‌సిలు దాచూరి రామిరెడ్డి, విఠపు బాలసుబ్రహ్మణ్యం విజయోత్సవ సభ నిర్వహించడమైనది. సాయంత్రం బాణసంచా, డప్పు వాయిద్యాలతో పట్టణ వీధుల గుండా గొప్ప ఊరేగింపు నిర్వహించిన అనంతరం జరిగిన జిల్లా కార్యదర్శి జి. రవీంద్రనాథ్ రెడ్డి, అధ్యక్షతన బహిరంగసభలో ముఖ్య అతిథులుగా మాజీ శాసనసభ్యురాలు పి. సాయికల్పన, గ్రామసర్పంచ్ ఎస్. సురేంద్ర కుమార్, ఎంఆర్‌ఒ పి. రామ్మోహన రావు ఇతర సంఘ నాయకులు పాల్గొన్నారు.

డి. రామిరెడ్డి మాట్లాడుతూ అతి తక్కువ ఖర్చుతో 7 మంది ఎంఎల్‌సిలను గెలిపించుకొని, నూతన ప్రజాస్వామ్య వరవడికి యుటియఫ్ నాంది పలికిందని చెప్పారు. పెద్దల సభ గౌరవాన్ని కాపాడుతామని ప్రకటించారు. వి. బాలసుబ్రహ్మణ్యం మాట్లాడుతూ విద్యారంగ అభివృద్ధికి, నూతన విద్యా విధానాలను అధ్యయనం చేస్తామని ప్రకటించారు. సభకు 700 మంది హాజరైనారు.

16వ తేది ఉదయం 9 గంటలకు గిద్దలూరు పిఆర్ కాలనీ యందు 'ప్రజా పథం' కార్యక్రమాన్ని ఇద్దరు ఎంఎల్‌సిలు ప్రారంభించారు. తరువాత వెలుగొండ ప్రాజెక్టుకు వెళ్ళి పశ్చిమ కాలువ ద్వారా గిద్దలూరు ప్రాంతానికి కృష్ణా జలాలు మళ్ళించు సాధ్యా సాధ్యాలు పరిశీలించారు.

### చిత్తూరు

ఎమ్మెల్సీలుగా గెలుపొందిన దాచూరి రామిరెడ్డి, విఠపు బాల సుబ్రహ్మణ్యంలను చిత్తూరు ఎన్.జి.ఓ. హోమ్‌నందు యుటియఫ్ మరియు జనవిజ్ఞాన వేదిక ఆధ్వర్యంలో ఘనంగా సన్మానించారు. ఈ సమావేశానికి జిల్లా అధ్యక్షులు జి. శ్రీరామమూర్తి అధ్యక్షత వహించారు. వారు మాట్లాడుతూ శాసనమండలి ఎన్నికలలో నియోజకవర్గంలోని రెండు సీట్లు గెలుపొందడం గర్వించదగ్గ విషయమన్నారు. యుటియఫ్ రాష్ట్రంలోను, జిల్లాలోను అతి పెద్ద సంఘంగా నిరూపించామని తెలియజేశారు.

దాచూరి రామిరెడ్డి మాట్లాడుతూ ఈ రాష్ట్రంలో ఉపాధ్యాయులు డబ్బుకు అమ్ముడుపోలేదని ఉద్యమ నాయకులనే గెలిపించారనీ వారందరికీ హృదయ పూర్వక కృతజ్ఞతలు తెలియజేశారు. శాసనమండలిలో ఒక ఫ్రంట్‌గా ఏర్పడి ఉపాధ్యాయ సమస్యలపై పోరాడుతామని తెలియజేశారు.

విఠపు బాసుబ్రహ్మణ్యం మాట్లాడుతూ పైసా ఖర్చు చేయకుండా ఈ ఎన్నికలలో గెలుపొందడం ఒక విశేషం. ప్రభుత్వం ఈ రోజు ఈ ఎన్నికలలో గెలుపొందిన వారిపై విశ్లేసిస్తున్నదన్నారు. సర్పంచ్ ఎన్నికలకే లక్షలాది రూపాయలు ఖర్చు చేసే ఈ రోజుల్లో మేధావులైన ఉపాధ్యాయులు, ఉద్యోగులు, కార్మికులు మేధావి వర్గానికే పట్టం గట్టారు. ఈ సమావేశంలో రాష్ట్ర కార్యదర్శి ఎన్. సోమచంద్రారెడ్డి, జిల్లా ప్రధానకార్యదర్శి వై. శ్రీనివాసులు రెడ్డి జనవిజ్ఞాన వేదిక నాయకులు, సిఐటియు నాయకులు, ఎల్ఐసి, బ్యాంకు ఉద్యోగ సంఘ నాయకులు పాల్గొన్నారు.

**అభిమాని ఆనందం :-** చిత్తూరు నుండి ఎమ్మెల్సీలుగా ఎన్నికైన దాచూరి రామిరెడ్డిని, విరపు బాలసుబ్రహ్మణ్యంలను పట్టాభినాయుడు శాలువ కప్పి పూలమాలతో సన్మానించారు. అంతేకాక చిత్తూరులో ఇద్దరు అభ్యర్థులకు తన స్వగృహములోనే వారికి నివాసము కల్పించారు. గత మూడు మాసాలుగా వీరి గెలుపు కోసం ఇంటింటి ప్రచారం చేశారు. వీరి గెలుపుతో వారి కుటుంబ సభ్యుల ఆనందానికి అంతులేక పోయినది.

**గంగాధర్ నెల్లూరులో :-**చిత్తూరు జిల్లా నుండి ఎన్నికైన శాసనమండలి సభ్యులు దాచూరి రామిరెడ్డిని, విరపు బాలసుబ్రహ్మణ్యంలను గంగాధర్ నెల్లూరు మండల శాఖ కార్యకర్తలు ఘనంగా సన్మానించారు. అదే మండలంలో పని చేస్తున్న జిల్లా అధ్యక్షులు జి. శ్రీరామమూర్తి సూచన మేరకు మండలంలోని ప్రతి ఓటరును కలుసుకొని వీరి గెలుపు కోసం కృషి చేసారు. ఇద్దరు అభ్యర్థులను ఘనంగా సన్మానించారు. మండలంలో ర్యాలీలు జరిపి ఓటర్లకు స్వీట్లు పంచి పెట్టారు. గంగాధర్ నెల్లూరు మండల కేంద్రంలో టపాకాయలు పేల్చి ఆనందోత్సవాలు జరుపుకొన్నారు.

**ఇబ్రహీంపట్నంలో :-** ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్, మంచాల, ఇబ్రహీంపట్నం, యాచారం, మండల శాఖల ఆధ్వర్యంలో రంగారెడ్డి, హైదరాబాద్, మహబూబ్‌నగర్ నియోజకవర్గం పట్టభద్రుల ఎంఎల్సిగా ఎన్నికైన డా॥ కె. నాగేశ్వర్ విజయోత్సవ సభ ఏప్రిల్ 10వ తేదీన ఇబ్రహీంపట్నం సాయి ఫంక్షన్ హాల్‌లో 750 మందితో జిల్లా కార్యదర్శి ఇ. గాలయ్య అధ్యక్షతన ఘనంగా జరిగింది.

ఈ కార్యక్రమానికి ముఖ్య అతిథిగా ఎంఎల్‌సి డా॥ కె. నాగేశ్వర్ హాజరైనారు. ఈ సందర్భంగా మాట్లాడుతూ పట్టభద్రులకు, శ్రేయోభిలాషులకు అందరికీ ప్రత్యేక అభినందనలు తెలియచేస్తూ ఉపాధ్యాయుల, పట్టభద్రుల ఉద్యోగుల సమస్యలపై ప్రభుత్వం పై ఒత్తిడి తెస్తూ రాజీలేని పోరాటం చేస్తానని, ప్రభుత్వం వినకపోతే ఉద్యోగ, ఉపాధ్యాయుల, పట్టభద్రులతో కలసి వీధులలో పోరాటం చేస్తానని ప్రకటించారు. యుటియఫ్ జిల్లా ప్రధానకార్యదర్శి పి. మాణిక్ రెడ్డి మాట్లాడుతూ ఉద్యోగ, ఉపాధ్యాయ, పట్టభద్రుల సమస్యలపై పట్టువిడుపులేని పోరాటంలో మనమంతా ఐక్య ఉద్యమాలు నడపాలని పిలుపునిచ్చారు. ఈ కార్యక్రమంలో ఇబ్రహీంపట్నం మండల సహాధ్యక్షులు కె. శేఖర్ రెడ్డి, యుటియఫ్ జిల్లా గౌ॥అధ్యక్షులు ఆర్. నర్సింహ్మాచారి, సహాధ్యక్షులు డి. మల్లారెడ్డి, యుటియఫ్ మంచాల మండల శాఖ బాధ్యులు కె. మోతీలాల్, బి. సుందరయ్య, ఇబ్రహీంపట్నం, బాధ్యులు, బి. రాములయ్య, బి. అనిల్, యాచారం బాధ్యులు, యాదయ్య, శీను మరియు వివిధ పార్టీల నాయుకులు, వివిధ ప్రజా సంఘాల నాయకులు, సోదర ఉపాధ్యాయ సంఘ నాయకులు, పట్టభద్రులు పాల్గొన్నారు.

**పరిగిలో:-** జిల్లా సమగ్ర అభివృద్ధి కోసం మేధావులందరం సంఘటితంగా ప్రభుత్వంపై ఒత్తిడి తీసుకురావాల్సిన అవసరముందని హైదరాబాదు పట్టభద్రుల నియోజకవర్గ ఎంఎల్‌సి డా॥ కె. నాగేశ్వర్ అన్నారు. ఏప్రిల్ 21 నాడు పరిగి కేంద్రంలో జరిగిన సన్మాన సభలో ఆయన ప్రసంగించారు. రాష్ట్ర రాజధానికి ఆమడదూరంలోనున్న రంగారెడ్డి అభివృద్ధిలో ముఖ్యంగా విద్యారంగంలో మరింత వెనుకబడి వుండడం బాధాకరమని అన్నారు. జిల్లా విద్యారంగ అభివృద్ధికి కృషి చేస్తానన్నారు. పరిగి సర్పంచ్ సిద్ధాంతి పార్థసారథి, పరిగి మండల పరిషత్ ఉపాధ్యక్షులు కె. శ్రీనివాస్ రెడ్డి మాట్లాడుతూ డా॥ కె. నాగేశ్వర్‌గారు చేపట్టబోయే కార్యక్రమాలన్నింటికి పరిగి ప్రాంతంలో పూర్తి సహకారాలందిస్తామన్నారు. కార్యక్రమానికి యుటియఫ్ పరిగి మండల శాఖ అధ్యక్షులు శ్రీ పి. సత్యనారాయణ రెడ్డి అధ్యక్షత వహించగా జిల్లా ప్రధానకార్యదర్శి పి. మాణిక్ రెడ్డి, సహాధ్యక్షులు మల్లారెడ్డి, జిల్లా కార్యదర్శి ఎస్. రాజశేఖర్, దోమ, పరిగి మండల విద్యాశాఖాధికారులు, పరిగి, దోమ, కుల్కచర్ల, గండ్వీడ్ మండలాలల కార్యకర్తలు పాల్గొన్నారు. అంతుకు ముందు పరిగి పుర వీధులలో పెద్ద ఎత్తున మోటార్ సైకిల్ ర్యాలీ నిర్వహించారు.

**తాండూరులో :-**ఏప్రిల్ 21 నాడు సాయంత్రం తాండూరు పట్టణ కేంద్రంలో జరిగిన సభలో డా॥ కె. నాగేశ్వర్ మాట్లాడుతూ రంగారెడ్డి జిల్లాకు డిగ్రీ కళాశాల సాధించేవరకు విశ్రమించేది లేదని ప్రకటించారు. ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ ఆధ్వర్యంలో నిర్వహించిన అభినందన సభలో వక్తలు మాట్లాడుతూ డా॥ కె. నాగేశ్వర్ గెలుపు నిజమైన ప్రజాస్వామ్య గెలుపుకు నిదర్శనమన్నారు. కార్యక్రమానికి సిఐటియు జిల్లా కమిటీ సభ్యుడు గోపాల్ అధ్యక్షత వహించగా, యుటియఫ్ జిల్లా ప్రధాన కార్యదర్శి పి. మాణిక్ రెడ్డి, మున్సిపల్ కౌన్సిలర్ సోమశేఖర్, యుటియఫ్ సహాధ్యక్షులు మల్లారెడ్డి, న్యూ నలందా పాఠశాల కరస్పాడెంట్ ఎం. బాల్ రెడ్డి, తాండూరు డిగ్రీ కళాశాల మాజీ ప్రిన్సిపాల్ వైశ్య సంఘం ప్రతినిధులు, పుర ప్రముఖులు తాండూరు మండల యుటియఫ్ అధ్యక్ష కార్యదర్శులు వెంకటయ్య, శ్రీనివాస్, మహిపాల్ రెడ్డి, నర్సాయ్య నాయక తదితరులు పాల్గొన్నారు.

**తెనాలిలో :-** శాసనమండలిని వేదికగా చేసుకొని ఉపాధ్యాయుల సమస్యల పరిష్కారానికి శక్తివంచన లేకుండా కృషి చేస్తానని ఎంఎల్‌సి కె.ఎస్. లక్ష్మణరావు పేర్కొన్నారు. గుంటూరు జిల్లా తెనాలిలోని ఎన్‌జీవో హోమ్‌లో ఉపాధ్యాయ, అధ్యాపక సంఘాల ఆధ్వర్యంలో లక్ష్మణరావుకు అభినందన సభ జరిగింది. సభకు యుటియఫ్ రాష్ట్ర కౌన్సిలర్ టి. మల్లేశ్వరరావు అధ్యక్షత వహించారు. ఈ సందర్భంగా లక్ష్మణరావు మాట్లాడుతూ కులం, ధనం ప్రలోభాలకు లొంగకుండా ఉపాధ్యాయులు తనను అత్యధిక మెజారిటీతో గెలిపించారన్నారు. శ్రీరామా రూరల్ కళాశాల డైరెక్టర్ తులసీ విష్ణు ప్రసాద్ మాట్లాడుతూ ఎంఎల్‌సి ఎన్నికల ద్వారా శాసనమండలికి సమర్థవంతమైన ప్రతినిధిని పంపించడం సంతోషదాయకమన్నారు. ఈ సభలో పట్టణానికి చెందిన ప్రముఖ డా॥ బి. సాంబిరెడ్డి, కొల్లూరు జూనియర్ కళాశాల ప్రిన్సిపాల్ గుత్తా వెంకటరత్నం, యుటియఫ్ జిల్లా కోశాధికారి యం. హనుమంతరావు, ఎన్జీఓ సంఘం తెనాలి డివిజన్ అధ్యక్షుడు కె. దశరాధరామయ్య, రవిప్రకాష్, సీనియర్ నేతలు వై.ఎల్. నారాయణ, వి. వెంకటేశ్వర్లు, కె. నారాయణరావు, పరుచూరి ఉమామహేశ్వర రావు తదితరులు ప్రసంగించారు. తెనాలి పట్టణశాఖ అధ్యక్షుడు డివిఆర్. ప్రసాద్, ప్రధానకార్యదర్శి హుస్సేన్ పాల్గొన్నారు. లక్ష్మణరావును తెనాలి ప్రాంతీయ ఎన్నికల కార్యాలయం పక్షా ఘనంగా సన్మానించారు. కొల్లూరు జూనియర్ కళాశాల ప్రిన్సిపాల్ గుత్తా వెంకటరత్నం, యుటియఫ్ ప్రాంతీయ శాఖల నిర్వహణకు రు. 2500/-లు విరాళం ప్రకటించి లక్ష్మణరావు చేతులమీదుగా ఐక్య ఉపాధ్యాయ పత్రిక సంపాదకులు ఎ.వి. సత్యనారాయణకు నగదు అందించారు.

**మాచర్లలో :-** శాసనమండలి వేదికగా ఉపయోగించుకొని, విద్యా, ఉపాధ్యాయ రంగాల్లో నెలకొన్న సమస్యల పరిష్కారానికి కృషి చేస్తానని, కృష్ణా - గుంటూరు నియోజకవర్గ ఎమ్మెల్సీ కె.ఎస్. లక్ష్మణరావు పేర్కొన్నారు. ఏప్రిల్ 12న మాచర్ల, దుర్గి, వెల్దుర్తి యుటియఫ్ శాఖల ఆధ్వర్యంలో మాచర్ల పట్టణంలో భారీ మోటారు సైకిళ్ళ ర్యాలీ జరిగింది. అనంతరం జరిగిన అభినందన సభలో యుటియఫ్ రాష్ట్ర కౌన్సిలర్ గాదె కిరీటి రెడ్డి సభాధ్యక్షత వహించారు. ఎమ్మెల్సీ లక్ష్మణరావు మాట్లాడుతూ సమస్యల పరిష్కారానికి ఐక్య ఉద్యమాలు చేపట్టవలసిన అవసరం ఎంతైనా ఉందన్నారు. డబ్బు, కుల, కండ బలం బలీయంగా పనిచేస్తున్న నేటి తరుణంలో వాటన్నింటికి అతీతంగా విజయం సాధించడం యుటియఫ్, సిఐటియు సంఘాల కృషే కారణంగా పేర్కొన్నారు. ప్రైవేటీకరణను అడ్డుకొని ప్రభుత్వ విద్యారంగాన్ని పరిరక్షించేందుకు శక్తివంచన లేకుండా కృషి చేస్తానని హామీ ఇస్తారు.

సిఐటియు జిల్లా కార్యదర్శి కె.బి.ప్రసాద్, మాచర్ల మున్సిపల్ ఛైర్మన్ బత్తుల ఏడుకొండలు, మాచర్ల ఎంఇఓ జి. రామకృష్ణారావు, సిస్టర్ జి. క్లారా, యుటియఫ్ జిల్లా సీనియర్ నాయకులు వి. విశ్వనాథం పాల్గొని ప్రసంగించారు.

**మడకశిరలో :-** ఏప్రిల్ 19వ తేదీన అనంతపురం జిల్లా మడకశిర మండల కేంద్రంలో యుటియఫ్ మండల శాఖ ఆధ్వర్యంలో జిల్లా అసోసియేట్ అధ్యక్షుడు జి. సన్నేగౌడ్ అధ్యక్షతన ఎంఎల్‌సి గుండుమల తిప్పేస్వామిని ఘనంగా సన్మానించారు. సన్మాన గ్రహీత తిప్పేస్వామి ప్రసంగిస్తూ ఉపాధ్యాయుల ప్రేరణచే, యుటియఫ్ తోడ్పాటుతో ప్రజలకు సేవనందించే భాగ్యం తనకు కల్గిందని తెలిపారు. మడకశిర తాలూకా యుటియఫ్‌కు అవసరమైన సహకారం అందించగలనని చెప్పారు.

యుటియఫ్ జిల్లా అధ్యక్షులు సి.కె. నాగేంద్రబాబు మాట్లాడుతూ యుటియఫ్ యంఎల్‌సిలు 7 మంది, మద్దతుతో 1 ఎమ్మెల్సీ గెలుపొందారని తెల్పారు. యుటియఫ్ ఎంఎల్‌సీలతో పాటు తిప్పేస్వామి విద్యారంగం సంక్షేమం కోసం కృషి సల్పగలరని ఆశిస్తున్నట్లు చెప్పారు. జిల్లా ప్రధాన కార్యదర్శి జె. రమేష్, సీనియర్ నాయకులు రంగారెడ్డి, ఎంఇఓ అశ్వత్తరామప్ప, మాజీ ఎంఇఒ లింగణ్ణ, రాష్ట్ర ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు గ్రహీత సత్యనారాయణ, రిటైర్డు టీచర్ కరియణ్ణ, మడకశిరా మండల యుటియఫ్ నాయకులు ప్రసంగించారు.

# "మే" దినోత్సవాలు

**నల్లగొండ :-** నల్లగొండ జిల్లా కేంద్రములో మేడే సందర్భముగా యుటియఫ్ జెండాను జిల్లా గౌ॥ అధ్యక్షులు పి. విద్యాసాగర్‌రెడ్డి ఎగరువేశారు. జిల్లా ప్రధానకార్యదర్శి ఎ. నర్సిరెడ్డి ఈ సందర్భంగా మేడే సందేశాన్నిచ్చారు. జిల్లాలో ప్రాంతీయ కార్యాలయాలు యున్న దేవరకొండ, మిర్యాల గూడ, సూర్యాపేట, నకిరేకల్, కోదాడ, కేంద్రాలలో యుటియఫ్ జెండాలు ఎగురవేసి మేడే కార్యక్రమాలు నిర్వహించారు.

**తూ॥గో॥ జిల్లాలో :-** మేడే సందర్భంగా తూర్పుగోదావరి జిల్లా కాకినాడ యుటియఫ్ హోమ్‌నందు గౌ॥అధ్యక్షులు పి.వి. రాఘవులు ఎస్‌టిఎఫ్‌ఐ పతాకాన్ని జిల్లా అధ్యక్షులు కె. సత్తిరాజు, యుటియఫ్ పతాకాన్ని ఆవిష్కరించారు. అనంతరం కాకినాడ మున్సిపల్ కార్పొరేషన్ కార్యాలయం వద్ద మేడేను పురస్కరించుకొని కాకినాడ నగర శాఖ యుటియఫ్ పతాకాన్ని ఆవిష్కరించారు. 50మంది ఉపాధ్యాయులు పాల్గొన్నారు.

అమలాపురంలో గల ఎంప్లాయిస్ హోమ్‌నందు అప్పారి ఉమామహేశ్వర రావు యుటియఫ్ పతాకాన్ని ఆవిష్కరించారు. 50 మంది పాల్గొన్నారు. రాజమండ్రి ప్రాంతీయ కార్యాలయం వద్ద యుటియఫ్ తూ॥గో॥ జిల్లాశాఖ ప్రధాన కార్యదర్శి జి.ప్రభాకర వర్మ యుటియఫ్ పతాకాన్ని ఆవిష్కరించారు. జిల్లాలో అన్ని తాలూకా కేంద్రాల్లో, ప్రాంతీయ కార్యాలయాల వద్ద యుటియఫ్ పతాకావిష్కరణ జరిగాయి.

తూర్పుగోదావరి జిల్లా ప్రత్తిపాడులో యుటియఫ్, జెవిసి మరియు సిఐటియుల ఆధ్వర్యంలో 'మేడే' వేడుకలు ఘనంగా జరిగినాయి. ఉద్యమ జెండాను బి. లత్సారావు ఆవిష్కరించారు. అనంతరం 'మేడే సభ' నిర్వహిచుట జరిగింది. ఈ సభకు యుటియఫ్ నాయకులు ఐ. ప్రసాదరావు అధ్యక్షత వహించి మాట్లాడుతూ ఉద్యోగులు, ఉపాధ్యాయులు, కార్మికులు ఐక్యంగా ఉండి సమస్యలపై పోరాడాలని, సమ్మెహక్కును చట్ట బద్ధం చేయాలని, నూతన పెన్షన్ విధానాన్ని రద్దు చేయాలని, డిమాండ్ చేశారు. మండల యుటియఫ్ అధ్యక్ష, ప్రధానకార్యదర్శులు ఎస్‌ఎస్‌వి చలపతి, ఎన్.బి. మురళీధర్, జెవిసి నేతలు శ్రీకాంత్‌రాజ్, రాఘవులు, శ్రీనివాస్, సిఐటియు నాయకులు, ఉపాధ్యాయులు పాల్గొన్నారు.

**అనంతపురంలో :-** మే 1వ తేదీన 'కార్మిక దినోత్సవం'ను అనంతపురం యుటియఫ్ జిల్లాశాఖ ఘనంగా జరుపుకొంది. యుటియఫ్ పతాకాన్ని జిల్లా గౌ॥అధ్యక్షులు బి. ఈరజిన్నప్ప ఎగురవేశారు. సమావేశంలో జిల్లా ప్రధానకార్యదర్శి జె. రమేష్ ప్రసంగిస్తూ ప్రపంచీకరణ, సరళీకృత విధానాలు శ్రామికుని నిలువు దోపిడి చేస్తున్నాయని ఆవేదన వ్యక్త చేశారు. సిఐటియు జిల్లా నాయకులు రత్నయ్య మాట్లాడుతూ కార్మిక దినోత్సవ ఆవిర్భావం, మేడే ప్రాధాన్యత గురించి వివరించారు. కె.వి.పి.యస్. జిల్లా అధ్యక్షులు ఎం. అంజయ్య, యుటియఫ్ జిల్లా కార్యదర్శులు కె. హరికృష్ణ, కె. ఓబుళపతి, వేణుగోపాల్ తదితరులు ప్రసంగించారు. అనంతపురం చుట్టు ప్రక్క మండలాల నుండి యుటియఫ్ నాయకులు, కార్యకర్తలు, ఉపాధ్యాయులు పాల్గొన్నారు.

**బయ్యారంలో:-** ప్రపంచ కార్మిక దినోత్సవాన్ని పురస్కరించుకొని ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ ఆధ్వర్యంలో ఖమ్మం జిల్లా బయ్యారం మండల కేంద్రంలో మేడే ఉత్సవాలు జరిగాయి. బస్టాండ్ సెంటర్‌లో యుటియఫ్ జెండాను యుటియఫ్ జిల్లా కార్యవర్గ సభ్యులు ఎస్‌కె. సోందు ఎగురవేశారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ సంస్కరణలు కార్మికులకు ప్రపంచవ్యాప్తంగా ఉపాధి లేకుండా చేస్తున్నాయని ఈ సంస్కరణలకు వ్యతిరేకంగా కార్మికులంతా ఐక్యంగా పోరాడాలని పిలుపునిచ్చారు.

ఈ కార్యక్రమంలో యుటియఫ్ అధ్యక్ష, కార్యదర్శులు వి. వీరస్వామి, జె. రాంబాబు, నాయకులు కె. సుధాకర్ రావు, బి. వెంకన్న, బి. రమేష్, బి. వెంకటేశ్వర్లు, ఏ. రూప్లా, ఎన్. సీతారామయ్య తదితరులు పాల్గొన్నారు.

**జగ్గంపేటలో:-**తూ॥గో॥ జిల్లా జగ్గంపేటలో యుటియఫ్, సిఐటియు, గ్రామ సేవకుల సంఘం, సైకిల్ షాపు వర్కర్స్ యూనియన్‌ల ఆధ్వర్యంలో మేడేను ఘనంగా నిర్వహించారు. యుటియఫ్ కార్యాలయం వద్ద మండల అధ్యక్షులు ఎం. మల్లేశ్వరరావు అరుణ పతాకాన్ని, చంద్రమౌళి వెంకటశాస్త్రి జాతీయ పతకాన్ని ఆవిష్కరించారు. సిఐటియు ఆధ్వర్యంలో సైకిల్ షాప్ వర్కర్స్ నిర్వహించిన మేడే కార్యక్రమంలో యుటియఫ్ అధ్యక్షుడు మల్లేశ్వర రావు జండాను ఎగురవేశారు. ఎంఆర్‌ఓ కార్యాలయం వద్ద గ్రామ సేవకుల సంఘం అధ్యక్షులు వారా సూకరాజు జండాను ఆవిష్కరించారు.

ఈ కార్యక్రమాలలో యుటియఫ్ నాయకులు సాయిరాం, ఎ. వీరబాబు, డి. మోసేప్, ఎం. రాఘవులు, జి. రామారావు తదితరులు పాల్గొన్నారు.

**ఆదిలాబాల్లో :-** ప్రపంచ కార్మిక దినోత్సవం మేడేను పురస్కరించుకొని యుటియఫ్ ఆధ్వర్యంలో ఆదిలాబాద్ యుటియఫ్ కార్యాలయంలో కవి సమ్మేళనం నిర్వహించబడినది. ఈ కార్యక్రమానికి యుటియఫ్ జిల్లా అధ్యక్షులు సి. స్వామిరెడ్డి అధ్యక్షత వహించగా, యుటియఫ్ జిల్లా ప్రధానకార్యదర్శి ఎ. వెంకట్ కవి సమ్మేళనాన్ని ప్రారంభించారు. ముఖ్యఅతిథిగా హాజరైన ఆర్‌టిసి ఉద్యోగుల సంఘం ఎస్‌డబ్ల్యుఎఫ్ ప్రాంతీయ కార్యదర్శి సత్యనారాయణ ప్రసంగిస్తూ మేడే కార్మిక వర్గానిది మాత్రమేకాదని ఉద్యోగులది, ఉపాధ్యాయులది కూడా అని అన్నారు.

అనంతరం జరిగిన కవి సమ్మేళనంలో పాల్గొన్న కవులు హిందీ, తెలుగు, ఉర్దూ భాషల్లో తమ కవితలు వినిపిస్తూ ప్రపంచబ్యాంకు విధానాల కోరల్లో నలుగుతున్న విద్యారంగ దుస్థితిని, ప్రపంచీకరణ నేపథ్యంలో క్షీణిస్తున్న సామాజిక విలువలను బహిర్గతం చేశారు. కవి రచయిత అయిన సుకుమార్ సమన్వయకర్తగా వ్యవహరించిన ఈ సమ్మేళనంలో మధుబావులర్ డా॥ ఉదారి నారాయణ, సుధాకర్, భూమన్న, నారాయణ, వెంకటరమణ, నాగరాజు, మురళీ, కిరణ్ వైద్యులతోపాటు ఛాత్రోపాధ్యాయులు తోకల రాజేశం తమ కవితలు వినిపించారు వెంకట్ రెడ్డి వందన సమర్పణ చేశారు.

**నిర్మల్ డివిజన్‌లో:-** ఆదిలాబాద్ జిల్లా నిర్మల్ డివిజన్‌లోని అన్ని మండలాల్లో యుటియఫ్ ఆధ్వర్యంలో మేడే ఉత్సవాలు జరుపుకొన్నారు. నిర్మల్‌లో పతాకావిష్కరణ అనంతరం జరిగిన సమావేశంలో జిల్లా అసోసియేట్ అధ్యక్షులు ఎ. రాజేశ్వర్ ప్రసంగిస్తూ శ్రామికుల దినమైన మేడేను ప్రభుత్వం తరపున జరిపి కార్మికుల స్థితిగతుల గురించి ఆలోచించాలని కోరారు. ప్రైవేటు భ్రమల్లో పడి కనీస వేతనాన్ని కూడా అమలు చేయకుండా విద్యావాలంటీర్లకు, గ్రామ సేవకులకు, అంగన్‌వాడి కార్యకర్తలకు అన్యాయం చేస్తున్న ప్రభుత్వం తీరుపై ఆగ్రహం వ్యక్త చేశారు. ఈ కార్యక్రమంలో సిఐటియు నాయకులు కిషన్ కుమార్, నూతన కుమార్, జిల్లా యుటియఫ్ బాధ్యులు పరమేశ్వర్, బక్కన్న, వివిధ మండలాల బాధ్యులు ప్రసాద్ రెడ్డి, మురళి మనోహర్ రెడ్డి, వెంకటరమణారెడ్డి, కాశీరాం, ధర్మరాజ్, క్రిష్టమూర్తిలు, గ్రామ సేవకుల సంఘం అధ్యక్ష నాగభూషన్, టేలర్స్ సంఘం, ఖాసీం మరియు కార్మికులు పాల్గొన్నారు.

## జన్నారంలో ఏవిఎస్ విజ్ఞాన కేంద్రం ప్రారంభం

ఆదిలాబాద్ జిల్లా జన్నారం మండల కేంద్రంలో అప్పారి వెంకటస్వామి విజ్ఞాన కేంద్రాన్ని (యుటియఫ్ భవన్) సంఘం రాష్ట్ర కార్యదర్శి సిహెచ్. కమలకుమారి ప్రారంభించారు. ఈ సందర్భంగా ఏర్పాటైన సమావేశాన్ని ఉద్దేశించి ఆమె మాట్లాడుతూ ప్రతి మండల కేంద్రంలో యుటియఫ్ కార్యాలయాలు ఏర్పాటు చేయాలని ఆ దిశగా జన్నారం యుటియఫ్ శాఖ స్పందించటం సంతోషదాయకమన్నారు. జిల్లా అధ్యక్షులు సి. స్వామి రెడ్డి, ప్రధానకార్యదర్శి ఏ. వెంకటి, జన్నారం మండల శాఖ అధ్యక్షులు వి. అంజయ్య, ప్రధానకార్యదర్శి బి. రూప్లానాయక్, జిల్లా కార్యదర్శులు, ఎం.ఇ.ఓ. ప్రేంసాగర్, జన్నారం కార్యదర్శులు, సభ్యులు పాల్గొన్నారు.

## పిఆర్‌టియుకు రాజీనామా- యుటియఫ్‌లో చేరిక

ఆదిలాబాద్ జిల్లా జన్నారం యుటియఫ్ మండల శాఖ టీచర్ల సమస్యల పరిష్కారం – సామాజిక కార్యక్రమాల పట్ల చూపుతున్న చొరవకు ఆకర్షితులై 10 మంది ఉపాధ్యాయులు జె. కిష్టు, ఎం. మల్లేషం, ఇ. మల్లేషం, పి. సత్యం, సిహెచ్. సురేష్ కుమార్, ఎం. మల్లేషం, ఎస్. ప్రవీణ్ కుమార్, ఏ. సుధాకర్, జి. ఉమారాణి, సిహెచ్. కాంత, పిఆర్‌టియుకు రాజీనామా చేసి యుటియఫ్ ప్రాథమిక సభ్యత్వాన్ని స్వీకరించారు. ఈ సందర్భంగా యుటియఫ్‌లో చేరిన వారికి మండల శాఖ తరపున హార్దిక శుభాకాంక్షలు తెలిపారు.

## యుటియఫ్‌పై ఎంఫిల్

యుటియఫ్‌పై కృష్ణా జిల్లాకు చెందిన శ్రీనివాస్ అనే విద్యార్థి ఆచార్య నాగార్జున విశ్వ విద్యాలయంలో ఎంఫిల్ చేశారు. ఇప్పటివరకు ఉద్యోగ, ఉపాధ్యాయ, కార్మిక సంఘాలపై ఎవరూ ఎంఫిల్, పిహెచ్‌డి చేయలేదు. యుటియఫ్‌పై శ్రీనివాస్ ఎంఫిల్ చేయడమే కాకుండా భవిష్యత్తులో పిహెచ్‌డి కూడా చేస్తానని చెప్పారు. యుటియఫ్ నిర్మాణం, అడ్మినిస్ట్రేటివ్ వ్యవహారాలతోపాటు సమస్యల పరిష్కారానికి వినతులు, బహిరంగ లేఖలతో సర్కారుకు సమయమిచ్చి ఆ తరువాత పోరుబాట పడుతున్న విషయాన్ని తాను గమనించానని శ్రీనివాస్ చెప్పారు. విస్తృత ఉద్యమ నేపథ్యమున్నందునే యుటియఫ్‌పై ఎంఫిల్ చేసినట్లు శ్రీనివాస్ మహాసభ వేదికపై చెప్పారు. ఆచార్య నాగార్జున యూనివర్సిటీలో యుటియఫ్‌పై పిహెచ్‌డి చేయాలని నిర్ణయించినట్లు ఆయన ప్రకటించారు. యుటియఫ్‌పై ఎంఫిల్ చేసిన విద్యార్థి శ్రీనివాస్‌కు రాష్ట్ర మహాసభ వేదికపై రాష్ట్ర అధ్యక్షులు సిహెచ్. సుభాష్‌చంద్రబోస్ మెమెంటో బహుకరించి సత్కరించారు.

## యుటియఫ్‌పై అధ్యయన పత్రము

యుటియఫ్ గుంటూరు జిల్లా శాఖ కార్యదర్శిగా పని చేస్తున్న యన్. కుమార్ రాజా ఉస్మానియా యూనివర్సిటీ అనుబంధ రచన జర్నలిజం కళాశాల నుండి "ఉపాధ్యాయ ఉద్యమంలో ఆంధ్రప్రదేశ్ ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్" అనే అంశాన్ని ఎంచుకొని 25 పేజీలతో 'అధ్యయన పత్రాన్ని' సమర్పించి జర్నలిజంలో పోస్టు గ్రాడ్యుయేట్ డిప్లొమా(పిజిడిసిజె) పూర్తి చేసారు. 'యుటియఫ్‌పై అధ్యయన పత్రాన్ని రూపొందించి పిజిడిసిజె ఉత్తీర్ణులైనందున ఇటీవల విజయవాడలో జరిగిన 10వ రాష్ట్ర మహాసభ ఆయనకు అభినందనలు తెలిపింది.

## జమాండ్ల పల్లిలో వేసవి తరగతులు

వరంగల్ జిల్లా జమాండ్ల పల్లి ఉన్నత పాఠశాలలో ఏప్రిల్ 26 నుండి మే 25 వరకు యుటియఫ్ ఆధ్వర్యంలో ఎస్ఎస్‌సి వేసవి ఉచిత శిక్షణా శిబిరం నిర్వహించబడింది. ది. 24.05.07న సమావేశం మండల శాఖ అధ్యక్షులు టి. బ్రహ్మం అధ్యక్షతన జరిగింది.

ఈ సమావేశానికి ముఖ్యఅతిథిగా విచ్చేసిన ఆర్డీవో దామోదర్ రెడ్డి ప్రసంగిస్తూ విద్యార్థులు అన్ని రంగాల్లో పరిజ్ఞానాన్ని పెంపొందించుకుని సంపూర్ణ విద్యార్థులుగా ఎదగాలని ఉద్బోధించారు. ముందు వేసవిలో ఇలాంటి ఉచిత శిక్షణా తరగతులను యుటియఫ్ నిర్వహించటం అభినందనీయం అని అన్నారు.

యుటియఫ్ జిల్లా అధ్యక్షులు అవారి శ్రీనివాస్ మాట్లాడుతూ యుటియఫ్ కేవలం ఉపాధ్యాయుల సమస్యలపైనే కాకుండా సామాజిక సేవా కార్యక్రమాలను కూడ నిర్వహిస్తుందని అన్నారు. జిల్లా ప్రధానకార్యదర్శి యస్. సదానంద్, మండల విద్యాశాఖాధికారి నల్లా లింగయ్య, సర్పంచ్ భద్రమ్మ, ఉపసర్పంచ్ ఐలయ్యలు విద్యార్థులనుద్దేశించి ప్రసంగించినారు. ఈ సమావేశంలో శిక్షణా తరగతుల కన్వీనర్ వెంకటయ్య, మండల ప్రధాన కార్యదర్శి జి. సంజీవ, సహాధ్యక్షులు ఎస్‌కె. అమీన్, కోశాధికారి వెంకట్రామ నర్సయ్య, ఉపాధ్యాయులు లచ్చయ్య, రాంచందర్, అంకిటి వెంకటేశ్వర్లు, మైస నాగయ్య, దామోదర్, ఆరుద్ర వెంకటేశ్వర్లు, గోపి, ఏ. తిరుమలయ్య, కేసముద్రం మండల అధ్యక్షులు బాలకృష్ణ, జె. ప్రతాప్, శ్రీమతరావు, టి. వెంకట్రామ నర్సయ్య తదితరులు పాల్గొన్నారు.

## అగ్ని బాధితులకు వితరణ

**ఏఎస్ పేటలో :-** నెల్లూరు జిల్లా ఏ.ఎస్. పేట మండల కేంద్రంలోని హరిజన వాడలో ప్రమాదవశాత్తూ ఇళ్ళు కాలి సర్వం కోల్పోయిన వారికి యుటియఫ్ ఏ.ఎస్. పేట మండల శాఖ బిందెలు, బక్కెట్లు వంట పాత్రలు సహాయం చేసినది. ఈ కార్యక్రమంలో మండల గౌ॥ అధ్యక్షులు బి. యద్దలయ్య, ప్రధానకార్యదర్శి బి. శివప్రసాద్, నాయకులు ఎం. నాయబ్, పి. శ్రీనివాసులు, జిలానీ, కె. కరుణాకర్, జి. సుబ్బయ్య, ఎస్‌కె. ఖాదర్ భాష, ఎంఎల్‌ఒ ఎ. మురళీధర రావు పాల్గొన్నారు.

**పాత ఇర్సులాపురంలో:-** ఖమ్మం జిల్లా, బయ్యారం మండలం, పాత ఇర్సులాపురంలో అగ్ని ప్రమాదం సంభవించి 49 కుటుంబాలు తీవ్రంగా నష్టపోయాయి. యుటియఫ్ ఆధ్వర్యంలో మే 19, 20 తేదీల్లో దుస్తుల సేకరణ జరిపి మే 21న వారికి జిల్లా కార్యదర్శి బి. రాందాస్ చేతుల మీదుగా పంపిణీ చేయనైనది. ఈ కార్యక్రమంలో మండల ప్రధానకార్యదర్శి జె. రాంబాబు, డి. నాగేశ్వరరావు, బి. చిన్నా, టి. తులసీ దాస్, బి. రాజు, ఎం. ధనుంజయ, బి. రమేష్, వై. యల్లయ్య, జె.వి.వి. నాయకులు ఆర్.వి. ప్రసాదరావు, కె. సుధాకర్ రావు పాల్గొన్నారు.

## సామాజిక సేవలో విశాఖ యుటియఫ్

ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్ కార్యకర్తలు కేవలం ఉపాధ్యాయుల సమస్యలు పరిష్కరించడంలోనే కాకుండా సామాజిక సేవా కార్యక్రమాల్లో కూడా చురుకైన పాత్ర పోషిస్తున్నారు. విశాఖ జిల్లా నక్కపల్లి మండల యుటియఫ్ కార్యవర్గం అక్కడికి సమీపంలో ప్రసిద్ధ ఉప్మా దేవాలయంలో వెంకటేశ్వరస్వామి కల్యాణోత్సవాల్లో విశేషమైన సేవలను అందించారు. సంఘం నాయకులు డివి సన్యాసిరావు, కె.కె. జేజేలు, జిల్లా కార్యదర్శి బి.వి. రమణ, మండల శాఖ అధ్యక్ష, కార్యదర్శులు ఎన్. చలపతిరావు, బి. రాధాకృష్ణ తదితరులు 50 మంది కార్యకర్తలతో వాలంటీర్లుగా విశేషమైన సేవలను అందించారు.

## కల్లూరులో చలివేంద్రం ప్రారంభం

ఆదిలాబాద్ జిల్లా కుంటాల మండలం కల్లూర్‌లో కుంటాల మండల యుటియఫ్ శాఖ ఆధ్వర్యంలో ఏర్పాటైన చలివేంద్రాన్ని ఆదిలాబాద్ జిల్లా పరిషత్ చైర్మన్ రాథోడ్ రమేష్ ప్రారంభించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ ఆదిలాబాద్ జిల్లాలో ఉపాధ్యాయ ఉద్యమాల్లో చురుకైన పాత్ర పోషిస్తున్న యుటియఫ్ సామాజిక సేవలో కూడా అందరికంటే ముందుండి ప్రజల ఆధారాభిమానాలను చూరగొనడం హర్షనీయమని అన్నారు. ఈ కార్యక్రమానికి జిల్లా పరిషత్ వైస్ చైర్మన్ జుట్టు అశోక్, మాజీ చైర్మన్ లోలం శ్యాంసుందర్, యుటియఫ్ జిల్లా అసోసియేట్ అధ్యక్షులు ఎ.రాజేశ్వర్, జిల్లా కార్యదర్శి ఎ. భాజారెడ్డి, మండల శాఖ అధ్యక్ష, ప్రధానకార్యదర్శులు కోటేశ్వరరావు, చంద్రశేఖర్ రావు, స్థానిక మండలాధ్యక్షుడు పెంట రవి, సర్పంచ్ రమణాగౌడ్ కుంటాల జిల్లా బాధ్యులు యం. పరమేశ్వర్, బక్కన్న తదితరులు పాల్గొన్నారు.

**కుబేర్, లోకేశ్వరంలలో**

నిర్మల్ డివిజన్‌లోని కుబేర్, లోకేశ్వరం మండల కేంద్రాలలో చలి వేంద్రాలను మండల శాఖలు ఏర్పాటు చేశాయి. కుబేర్‌లో స్థానిక మండలాధ్యక్షులు హర్ష, లోకేశ్వరంలో జెడ్‌పిటిసి హన్మంతరావులు ప్రారంభించి యుటియఫ్ మండల శాఖలను అభినందించారు. ఈ కార్యక్రమంలో జిల్లా అసోసియేట్ అధ్యక్షులు ఎ. రాజేశ్వర్, జిల్లా కార్యదర్శి భాజారెడ్డి, జిల్లా బాధ్యులు, బక్కన్న, పరమేశ్వర్‌లు మండల బాధ్యులు, జె. రాజేశ్వర్, నారాయణ, కాశీరాం, గంగారం, గంగా ప్రసాద్, చక్రధర్, ముత్తన్న తదితరులు పాల్గొన్నారు.

## వివిఎల్ 5వ వర్ధంతి సభ

ఖమ్మం జిల్లా యుటియఫ్ ఉద్యమ నిర్మాతల్లో ఒకరైన అమరజీవి వివిఎల్ నర్సింహారావు 5వ వర్ధంతిసభ మే 17వ తేదీన ఖమ్మంలోని యుటియఫ్ భవన్‌లో జిల్లా ప్రధాన కార్యదర్శి జి. రాజశేఖర్ అధ్యక్షతన జరిగింది. సభకు ముఖ్య అతిథిగా విచ్చేసిన ఖమ్మం శాసనసభ్యులు తమ్మినేని వీరభద్రం మాట్లాడుతూ వివిఎల్ నర్సింహారావు, ప్రముఖ ఉపాధ్యాయ నాయకుడు మాత్రమే కాదని ఆదర్శ కమ్యూనిస్టు నాయకుడు కూడా అని కొనియాడారు. విమర్శ ఆత్మ విమర్శలకు కామ్రేడ్ వివిఎల్ అత్యంత ప్రాధాన్యత ఇచ్చే వారని, నిర్భయంగా సమరశీల పోరాటాల్లో పాల్గొనేవారిని, జ్ఞప్తికి తెచ్చుకొన్నారు. తుది శ్వాస వరకు నమ్మిన సిద్ధాంతాన్ని విడువకుండా ఆచరించిన వివిఎల్ ధన్య జీవి అని పేర్కొన్నారు. యుటియఫ్ సీనియర్ నాయకులు వివిఎల్ సహచరులు దొండేటి రామచంద్రయ్య, రావెళ్ళ రాఘవయ్య, పారుపల్లి సత్యనారాయణ, ఎస్. గోపాలరావు, ఆర్. పురుషోత్తమరావు, మల్లెంపాటి వీరభద్రం, జిల్లా గౌ॥అధ్యక్షులు కె. శ్రీనివాసులు అధ్యక్షులు బి. నర్సింహారావు, వివిఎల్ త్యాగనిరతిని కొనియాడుతూ వారి ఆశయ సాధనకు యువ కార్యకర్తలు పట్టుదలతో కృషి చేయాలని కోరారు. కామ్రేడ్ వి.ఎల్. కుమారులు రవి కుమార్, మధుబాబు కుమార్తె రమాదేవి తదితరులు కూడా సభలో పాల్గొన్నారు.

## టెక్కలి ఎంఇఓకు వ్యతిరేకంగా ధర్నా

అవినీతి, అక్రమాలకు పాల్పడుతూ ఉపాధ్యాయుల్ని వేధిస్తున్న శ్రీకాకుళం టెక్కలి మండల విద్యాశాఖాధికారిని శిక్షించాలని, తన అక్రమాల్ని కప్పిపుచ్చుకునేందుకు తప్పుడు రిపోర్టులతో యుటియఫ్ నాయకుడు మోహనరావు పై విధించిన అక్రమ సస్పెన్షన్‌ను రద్దు చేయాలని డిమాండ్ చేస్తూ యుటియఫ్ ఆధ్వర్యంలో టెక్కలి మండలి పరిషత్ కార్యాలయం ఎదుట ఏప్రిల్ 25న ఉపాధ్యాయులు పెద్ద ఎత్తున ధర్నా చేశారు. ధర్నాకు టెక్కలి యుటియఫ్ అధ్యక్షులు టి. అప్పలస్వామి అధ్యక్షతన వహించగా ధర్నా శిబిరాన్ని జెఏసి నాయకులు హెచ్. కనకాచలం ప్రారంభించారు. యుటియఫ్ జిల్లా ప్రధానకార్యదర్శి గొంటి గిరిధర్ ధర్నానుద్దేశించి ప్రసంగిస్తూ ఎంఇఒ అవినీతి అక్రమాల్ని ప్రశ్నిస్తే సస్పెండ్ చేయడం దానికి జిల్లా విద్యాశాఖాధికారి వంత పాడటం గర్హనీయమన్నారు. యుటియఫ్ జిల్లా అధ్యక్షులు బొడిగి భాస్కరరావు మాట్లాడుతూ మే 3వ తేదీన జిల్లా విద్యాశాఖ కార్యాలయం ఎదుట పెద్ద ఎత్తున ధర్నా చేస్తామని హెచ్చరించారు. కార్యక్రమంలో జిల్లా గౌ॥అధ్యక్షులు కె. కామేశ్వరరావు, జిల్లా కార్యదర్శులు పి. ధర్మారావు, ఎల్. వెంకటా చలం, ఏపియుఎస్ జిల్లా అధ్యక్షులు టి. ఆనందరావు, పిఆర్‌టియు నాయకులు జె. బాబూరావు, ఎం. గణపతిరావు, ఎస్‌ఎల్‌టిఏ నాయకులు అయ్యబాబు, సిఐటియు నాయకులు నంబూరు షణ్ముఖరావు, వ్యవసాయ కార్మిక సంఘ నాయకులు, ఎంపిటిసి సభ్యులు కొల్లి ఎల్లయ్య, రైతు సంఘ నాయకులు పి. ప్రసాద్ తదితరులు ప్రసంగించారు. ధర్నాలో టెక్కలి, నందిగాం, వజ్రపు కొత్తూరు, సంతబొమ్మాళి కార్యకర్తలు పాల్గొన్నారు.

యుటియఫ్ పోరాటానికి జెడ్‌పి వైస్ చైర్మన్ దువ్వాడ శ్రీనివాస్ మండల పరిషత్ అధ్యక్షులు చింతాడ మంజు లు సంఘీభావం ప్రకటించారు. యుటియఫ్ పోరాటఫలితంగా టెక్కలి మండలం యుటియఫ్ ప్రధానకార్యదర్శి కె. మోహనరావు, అక్రమ సస్పెన్షన్‌ను 5 రోజుల్లో రద్దు చేయటం జరిగింది.

## యుటియఫ్ పోరాట ఫలితం అక్రమాల డిటిడబ్ల్యుఓ సస్పెన్షన్

విజయనగరం జిల్లాలో గత 2 సంవత్సరాలుగా గిరిజన సంక్షేమ విద్యాశాఖలో జరుగుతున్న అనేక అవకతవకలపై, అవినీతిపై యుటియఫ్ అలుపెరుగని ఆందోళనలు చేపట్టింది. ఒక కోటి ఇరవై లక్షలు కేవలం విద్యాశాఖలోనే గల్లంతు అయినట్లు, ప్రతి పనికి రేట్లను ఆపాదించి వసూలు చేయడం వంటి అంశాలపై నిరంతరం యుటియఫ్ నిలదీస్తూ వచ్చింది.

ఈ నేపథ్యంలో మే 19న జిల్లాకు వచ్చిన గిరిజన సంక్షేమ శాఖామంత్రిని, ప్రిన్సిపల్ సెక్రటరీని కలిసి డిటిడబ్ల్యుఓ చేసిన అవినీతిని, అక్రమాలను వినతి రూపంలో యుటియఫ్ నాయకులు కె. విజయగౌరి, ఎస్. మురళీమోహన్, డి. రాములు అందచేశారు.

గిరిజన అభివృద్ధిపై జరిగే సమీక్షా సమావేశంలో యుటియఫ్ పిర్యాదుపై సుదీర్ఘమైన చర్చ జరిగింది. జె.డి. చిన వీరభద్రులు తక్షణమే స్పందించి ఎంక్వయిరీ వేయించారు. ఫలితంగా గిరిజన సంక్షేమ శాఖను భ్రష్టు పట్టిస్తున్న డిటిడబ్ల్యుఓను రంపచోడవరానికి బదిలీ చేశారు. అనంతరం సస్పెన్షన్ కూడా చేశారు. కార్యదీక్షతో గిరిజన విద్యారంగం బాగుపడాలనే సామాజిక స్పృహతో చేసిన పోరాటాలకు పలువురు మద్దతు తెలిపారు.

## భద్రాచలం ఐటిడిఏలో జరుగుతున్న అవినీతిపై యుటియఫ్ సమరశంఖం

ఖమ్మం జిల్లాలోని గిరిజన ప్రజల ప్రయోజనాలు పరిరక్షించడానికి భద్రాచలం ఐటిడిఏ ఆధ్వర్యంలో వేల కోట్ల రూపాయలు ఖర్చు పెడుతున్నా ఫలితాలు మాత్రం అంతంత మాత్రంగానే వుంటున్నవి. పై స్థాయి నుండి అట్టడుగుస్థాయి వరకు అవినీతి విచ్చలవిడిగా జరుగుతుండడంతో గిరిజనుల ప్రయోజనాలు దెబ్బతింటున్నాయి. నీతికి, నిజాయితీకి మారుపేరుగా అందరికీ ఆదర్శంగా ఉండాల్సిన అత్యున్నత స్థాయి అధికారులే నిధుల దుర్వినియోగానికి పాల్పడటం శోచనీయం. సిబ్బంది తమ చేతి వాటాన్ని ప్రదర్శిస్తూ గిరిజన ప్రజలను గిరిజన సంక్షేమ ఉపాధ్యాయులను నష్టపరుస్తున్నారు. భద్రాచలం ఐటిడిఏ ప్రాజెక్టు అధికారి జరిపిన నిధుల దుర్వినియోగాన్ని వివిధ స్థాయిలలో జరుగుతున్న అవినీతిని సాక్షాత్తూ ప్రాజెక్టు అధికారే ఆశ్రిత పక్షపాతానికి పాల్పడిన ఘటనలను యుటియఫ్ ఖమ్మం జిల్లా కమిటీ మే 25న భద్రాచలంలో పత్రికా విలేఖరుల సమావేశం వెల్లడించింది. మే 27న రాష్ట్ర గిరిజన సంక్షేమ శాఖా మంత్రిని, ఉన్నతాధికారులను కలిసి ఫిర్యాదు చేసింది.

## అవినీతి, అక్రమాలపై పూరించిన సమర శంఖం

ఆదిలాబాద్ జిల్లా యుటియఫ్ విస్తృత స్థాయి కార్యవర్గ సమావేశం ఏప్రిల్ 26న జిల్లా కార్యాలయంలో జిల్లా అధ్యక్షులు సి. స్వామిరెడ్డి అధ్యక్షతన జరిగినది. ముఖ్య అతిథిగా రాష్ట్ర కార్యదర్శి సి. కమలకుమారి హాజరయ్యారు. తొలుత సి. స్వామిరెడ్డి మాట్లాడుతూ ఉపాధ్యాయుల సమస్యలపై యుటియఫ్ జరిపిన పోరాటాలు, సాధించిన ప్రగతి వివరించారు. జిల్లా విద్యాశాఖాధికారి కార్యాలయంలోను, జిల్లా పరిషత్ కార్యాలయంలోను పెరిగిపోతున్న అవినీతి అలసత్వాలపై యుటియఫ్ త్వరలో పోరాటం చేయనున్నదని ఇందుకు కార్యకర్తలందరూ సన్నద్ధం కావాలని పిలుపునిచ్చారు.

జిల్లా గౌ॥ అధ్యక్షులు ప్రభాకర్ రావు మాట్లాడుతూ జిల్లాలో కొందరు ఎంఇఓలు మరియు డివైఇఓలతో పాటు డిఇఒ పని తీరు అధ్వాన్నంగా తయారయ్యిందని దీన్ని మార్చుకునేలా యుటియఫ్ ఉద్యమం చేపడ్తుందని అన్నారు. జిల్లా ప్రధానకార్యదర్శి ఏ. వెంకట్ కార్యకలాపాలు, నివేదికను ప్రవేశ పెట్టారు. జిల్లా విద్యాశాఖలో పెరుగుతున్న అవినీతి, ఉద్దేశ్య పూర్వక అలసత్వాన్ని నివారించుటకు ధర్నాలు, ఆందోళనలు చేయవల్సిన అవసరాన్ని స్పష్టపర్చారు. జూన్ 14 నుంచి 30 వరకు జిల్లా వ్యాప్తంగా ఐక్య ఉపాధ్యాయ పక్షోత్సవాలు నిర్వహించి చందాదారుల పెంపుదల చేయాలని పిలుపునిచ్చారు.

మధ్యాహ్నం జరిగిన చర్చలో వివిధ మండలాల ప్రధాన బాధ్యులు పాల్గొంటూ తమ మండలాల్లో ఉద్యమ స్థాయిని, వివరించారు. సమస్యలను జిల్లాశాఖ దృష్టికి తెచ్చారు. ప్రధాన కార్యదర్శి నివేదికను ఏకగ్రీవంగా ఆమోదించారు. ముఖ్యఅతిథి రాష్ట్ర కార్యదర్శి సి. కమలకుమారి మాట్లాడుతూ ఉపాధ్యాయుల, విద్యారంగ సమస్యల పరిష్కారానికి రాష్ట్ర శాఖ పక్షాన జరుగుతున్న కృషిని వివరించారు. సమావేశం పలు తీర్మానాలను ఆమోదించింది.

## కాంట్రాక్టు లెక్చరర్స్ సమస్యలపై ముఖ్యమంత్రి సానుకూలం

ప్రభుత్వ కళాశాలల్లో పనిచేస్తున్న కాంట్రాక్టు లెక్చరర్స్‌ని ఈ విద్యా సంవత్సరంలో రెన్యువల్ చేయుటకు ముఖ్యమంత్రి డా॥ వై.ఎస్. రాజశేఖర్ రెడ్డి సానుకూలంగా స్పందించారు. మే 5న టీచర్ ఎంఎల్‌సి డి. రామిరెడ్డి, పట్టభద్రుల ఎంఎల్‌సి ఎం.వి.ఎస్. శర్మ ఆధ్వర్యంలో ముఖ్యమంత్రిని కలిసిన సందర్భంగా కాంట్రాక్టు లెక్చరర్స్ రెన్యువల్ అంశంపై ప్రాతినిధ్యం జరిపి కాలేజిని యూనిట్‌గా కాంట్రాక్టు లెక్చరర్స్‌ను రెన్యూవల్‌కు అంగీకరించారని, అదే విధంగా కాంట్రాక్టు లెక్చరర్స్‌కు జెఎల్ రిక్రూట్‌మెంటు "వెయిటేజీ మార్కుల విషయమై ట్రిబ్యునల్ ఇచ్చిన తీర్పును ముఖ్యమంత్రి దృష్టికి తీసుకు వచ్చినట్లు తెలియజేశారు. అదే విధంగా కాంట్రాక్టు లెక్చరర్స్ ఎదుర్కొంటున్న పలు సమస్యలను ముఖ్యమంత్రి దృష్టికి తీసుకురాగా సానుకూలంగా స్పందించినట్లు తెలియజేశారు. ఈ కార్యక్రమంలో కాంట్రాక్టు లెక్చరర్స్ నాయకులు డా॥ కొప్పిశెట్టి సురేష్, బి.జె. గాంధీ, వి. శ్రీనివాస్, రాజోలు శ్రీనివాస్ తదితరులు పాల్గొన్నారు.

## వృత్తి విద్య ఉపాధ్యాయుల సమస్యల పరిష్కారానికి ముఖ్య మంత్రి హామీ

మే 27వ తేదీన రాష్ట్ర ముఖ్యమంత్రి వైఎస్. రాజశేఖర రెడ్డిని వృతి విద్య ఉపాధ్యాయ అసోసియేషన్ రాష్ట్ర ప్రధాన కార్యదర్శి గోపారపు రాజు, అధ్యక్షులు అగస్టేన్ మరియు ప్రతినిధి బృందంతో కలసి తమను రెగ్యులరైజ్ చేయాలని ప్రాతినిధ్యం జరపగా వారు స్పందిస్తూ గతంలో వృత్తి విద్య ఉపాధ్యాయులకు రు. 2000/-లు మాత్రమే వేతనము ఉండేదని రాష్ట్రంలో కాంగ్రెస్ ప్రభుత్వం వచ్చిన తదుపరి రు. 3500/-లుగా పెంచామని మరల పెంచుతామని తెలుపగా, ప్రతినిధి బృందం అభ్యంతరం తెలియజేసి వేతనాలు పెంపు సమస్య పరిష్కారం కాదని వృత్తి విద్య ఉపాధ్యాయులను రెగ్యులర్ చేయాలని విన్నవించారు. ఆ మేరకు వై.ఎస్. రాజశేఖర రెడ్డి తదుపరి చర్యలకు విద్యాశాఖ ముఖ్య కార్యదర్శికి ఆదేశాలు జారీ చేశారు.

# "వికసించిన అగ్ని పుష్పం అంబేద్కర్"

అంబేద్కర్ జయంతి సందర్భంగా ఏప్రిల్ 14న అనంతపురంలో జిల్లా శింగనమల మండల ఐక్య ఉపాధ్యాయ ఫెడరేషన్, జనవిజ్ఞాన వేదిక సంయుక్త ఆధ్వర్యంలో శింగనమలలో యుటియఫ్ జిల్లా కార్యదర్శి కరుణం హరికృష్ణ అధ్యక్షతన "సామాజిక న్యాయం సదస్సు" జరిగింది. సదస్సులో కె. హరికృష్ణ మాట్లాడుతూ భారత దళిత జీవన స్రవంతిలో వికసించిన అగ్నిపుష్పం అంబేద్కర్ అని పేర్కొన్నారు. కంప్యూటర్ యుగంలో కూడా "మైల" "అంటరానితనం" "అస్పృశ్యత' పదాలు దళితుల గుండెల్లో నిరంతరం గాయాలు చేస్తూ తొలిచి వేస్తున్నాయని ఆవేదన వ్యక్తం చేశారు.

జన విజ్ఞాన వేదిక జిల్లా ప్రధాన కార్యదర్శి యస్. భాస్కర్ యుటియఫ్ జిల్లా కార్యదర్శి రాంభూపాల్ రెడ్డి, జిల్లా ఆడిట్ కమిటీ కన్వీనర్ వెంకటరెడ్డి, జె.వి.వి. జిల్లా కార్యదర్శి పి.వి. శ్రీనివాసులు, అనంతపురం నగర అధ్యక్షులు టి. ప్రకాశం, వివేకానంద, శింగనమల మండల యుటియఫ్ నాయకులు వి. కోటేశ్వరప్ప, కె. ఖాజావలి, హేమంత్ కుమార్, వెంకట ప్రసాద్, శివ భూషణం, వీరా రెడ్డి, రాజా రవీంద్ర, చంద్రశేఖర్, బుక్క రాయసముద్రం, శివయ్య, గార్లదిన్నె గోవర్ధన్ గౌడ్ తదితరులు పాల్గొన్నారు. అనంతరం దళిత వివక్షతను వ్యతిరేకిస్తూ, సామాజిక న్యాయం కోరుతూ ర్యాలీ జరిగింది.

## మిర్యాలగూడలో డా॥ బిఆర్ అంబేద్కర్ జయంతి సభ

డా॥ బిఆర్ అంబేద్కర్ జయంతిని యుటియఫ్ మిర్యాలగూడ డివిజన్ కమిటీ ఆధ్వర్యంలో నిర్వహించనైనది. పట్టణంలో సాగర్ ప్రధాన రహదారిపై ఉన్న అంబేద్కర్ విగ్రహానికి యుటియఫ్ జిల్లా సహాధ్యక్షులు పి. లక్‌పతినాయక్, సీనియర్ నాయకులు బంగారయ్య, వి. కె. సురేందర్ రెడ్డి తదితరులు పూలమాలలు వేసి నివాళులు అర్పించారు. అనంతరం సీనియర్ నాయకులు వి. బంగారయ్య అధ్యక్షతన అంబేద్కర్ జయంతి సభ జరిగింది. ఈ కార్యక్రమానికి హాజరైన మిర్యాలగూడ శాసనసభ్యులు జూలకంటి రంగారెడ్డి మాట్లాడుతూ భారత రాజ్యాంగ నిర్మాత డా॥ బిఆర్ అంబేద్కర్ ఆశయ సాధనకు ఉద్యమించాలని తెలియజేశారు. ఈ కార్యక్రమంలో మానవ హక్కుల వేదిక రాష్ట్ర ఉపాధ్యక్షులు పి. సుబ్బారావు, సీనియర్ జర్నలిస్టు, ఖాజా హమీదుద్దీన్, మున్సిపల్ వైస్ చైర్మన్ డి. మల్లేశం, యుటియఫ్ జిల్లా సహాధ్యక్షులు పి. లక్‌పతినాయక్, కె. సురేందర్ రెడ్డి, శ్రీనివాస చారి, అమరయ్య, ఓబులరాజు, లచ్చయ్య, విద్యాసాగర్, శ్యాంసుందర్, వెంకయ్య, కోట్యానాయక్, గోపి నాయక్, చంద్రారెడ్డి, మహిముద్ అలీ, శ్రీధర్ రెడ్డి, నర్సింహ్మానాయక్ తదితరులు పాల్గొన్నారు.

## ఎస్‌సి, ఎస్‌టి కమీషన్ చైర్మన్‌కు మెమోరాండము

గుంటూరు జిల్లాలోని ఎస్‌సి, ఎస్‌టి వర్గాలకు చెందిన ఉపాధ్యాయులు ఎదుర్కొంటున్న సమస్యలను పరిష్కరించాలని కోరుతూ ఎస్‌సి, ఎస్‌టి కమీషన్ చైర్మన్ ఎం. నాగార్జునకు యుటియఫ్ జిల్లా ప్రతినిధి వర్గం మే 25న మెమోరాండం అందజేసింది. ఉపాధ్యాయులు ప్రమోషన్ పొందడానికి అవసరమయ్యే విద్యార్హతలు సాధించడానికి ఆన్ డ్యూటీ సౌకర్యం కల్పించాలని కోరింది. డిఎస్సి 2000 ద్వారా నియామకం పొంది ట్రైనింగ్ పూర్తి చేసిన ఎస్‌సి, ఎస్‌టి ఉపాధ్యాయులకు నోషనల్ ఇంక్రిమెంట్లు మంజూరుకు తగు చర్యలు తీసుకోవాలని కోరింది. రిజర్వేషన్లు సక్రమంగా అమలు జరిగేలా చర్యలు తీసుకోవాలని, ఎస్‌టి స్పెషల్ విద్యావాలంటీర్లకు మార్చి 2005 నుంది రెగ్యులర్ స్కేలు మంజూరుకు కృషి చేయాలని కోరింది. కమీషన్ చైర్మన్ స్పందిస్తూ జిల్లా విద్యాశాఖాధికారితో, సంబంధిత శాఖ అధికారులతో చర్చించి వారి సమస్యల పరిష్కారానికి కృషి చేస్తానని హామీ ఇచ్చారు. యుటియఫ్ ప్రతినిధి వర్గంలో జిల్లా అధ్యక్షులు ఎన్. తాండవ కృష్ణ ప్రధాన కార్యదర్శి జి. ప్రభుదాసు, కోశాధికారి ఎం. హనుమంతరావు తదితరులున్నారు.

## సామాజిక చైతన్య సైకిల్ యాత్రలో యుటియఫ్

కుల వివక్షత నిర్మూలనకై అనంతపురం జిల్లా నందు కె.వి.పి.ఎస్. ఐక్యవేదిక ఆధ్వర్యంలో 'సామాజిక చైతన్య సైకిల్ యాత్ర' జిల్లా వ్యాప్తంగా 650 కిలోమీటర్లు, 25 మండలాలు, 184 గ్రామాలలో జరిగింది. అందుకు మద్దతుగా యుటియఫ్ పలు చోట్ల స్వాగతాలు, పలుచోట్ల వసతి ఏర్పాట్లు, మరికొన్ని చోట్ల ర్యాలీ, బహిరంగ సభలలో పాల్గొన్నది. జిల్లా బాబూ జగజ్జీవన్ రామ్ జయంతి ఏప్రిల్ 5 నుండి అంబేద్కర్ జయంతి ఏప్రిల్ 14 వరకు జరిగింది.

గుంతకల్ పట్టణంలోని అంబేద్కర్ సర్కిల్ నందు 'జిల్లా సామాజిక చైతన్య యాత్ర' శ్రీ కృష్ణ దేవరాయ యూనివర్సిటీ వైస్-ఛాన్సలర్ అత్తోట రామారావు ఏప్రిల్ 5న ప్రారంభించారు. 'జాత' ప్రారంభ కార్యక్రమంలో యుటియఫ్ పక్షాన జిల్లా అధ్యక్షులు సి.కె. నాగేంద్రబాబు, జిల్లా కోశాధికారి మహమ్మద్ జిలాన్, జిల్లా కార్యదర్శులు ఓబుళపతి, రమణయ్య, గుంతకల్లు నగరం, గుంతకల్ రూరల్ ఉపాధ్యాయులు అధిక సంఖ్యలో పాల్గొన్నారు. గుంతకల్లు నుండి ఉరవకొండ వరకు 50 కి.మీ. సైకిల్ యాత్రలో కోశాధికారి మహమ్మద్ జిలాన్ పాల్గొన్నారు. ఉరవకొండలో వజ్రకరూరు మండల యుటియఫ్ బాధ్యులు భాస్కర్ స్వాగతం పలికారు. కళ్యాణదుర్గంలో మంజు, రాజేంద్ర, శివప్రసాద్, ఈశ్వరయ్యల ఆధ్వర్యంలో స్వాగత ఏర్పాట్లు జరిగాయి. అమరాపురం మండలంలో కె.బి. నాగరాజు, విజయ భాస్కర్‌లు 'జాత'కు అవసరమైన సౌకర్యాలు సమకూర్చారు. బ్యానర్లతో జాతాను ఆహ్వానించారు. మడకశిర మండలంలో మారుతీ ప్రసాద్, నరసింహులు, దత్తాత్రేయ, భూతన్న తదితరులు ఆహ్వానం పలికి ర్యాలీలో పాల్గొన్నారు. పరిగి మండల కేంద్రంలో జిల్లా కార్యదర్శి ఓబుళేసు స్వాగతం పలికి హిందూపురం వరకు వెన్నంటే వుండి హిందూపరం బహిరంగ సభలో ప్రసంగించారు. చిలమత్తూరు మండలంలో జిల్లా కార్యదర్శి రామకృష్ణ, లక్ష్మి నరసింహప్ప, చంద్రశేఖర రెడ్డి, నాగేంద్ర, అలీముల్లా, కొండప్ప మరియు 15 మంది కార్యకర్తలు పూలహారాలతో స్వాగతం పలికి సౌకర్యాలు సమకూర్చారు. గ్రామ సేవకుల నిరాహార దీక్షకు కె.వి.పి.ఎస్.తో పాటు మద్దతుగా పాల్గొన్నారు. గోరంట్ల మండలంలో హనుమంతు, నరసింహులు తదితరులు పాల్గొన్నారు. ఓ.డి. చెరువులో మండల ప్రధానకార్యదర్శి రమేష్‌బాబు మరియు ఉపాధ్యాయులు స్వాగతించారు. కదిరిలో జిల్లా కార్యదర్శి శ్రీనివాసులు, నాయకులు మొయినుద్దీన్, గౌస్‌ఖాన్, రామ్‌ప్రసాద్ రెడ్డి, ఆనంద్, రమేష్ బాబు, తాహర్ అలీ, సుధాకర్, భాస్కర్‌రెడ్డి, రామచంద్రారెడ్డి తదితరులు ఘనస్వాగతం ఏర్పాటు చేశారు. అమడగూరు మండలంలో సూర్యనారాయణ, అబ్దుల్ మునాఫ్, నల్లమాడ మండలంలో నాగరాజు, మహమ్మద్‌రఫీ, రాజు, చెన్నకేశవులు స్వాగతం చెప్పారు. ముదిగుబ్బ ఎనుముల వారి పల్లిలో గంగిరెడ్డి, శ్రీనివాసులు తదితర కార్యకర్తలు పాల్గొన్నారు. బత్తలపల్లి మండలం రామాపురంలో ఈశ్వరయ్య, వెంకటేష్, చంద్రశేఖర్ తదితరులు స్వాగతించి, సౌకర్యాలు సమకూర్చి ర్యాలీలో పాల్గొన్నారు.

## "రాష్ట్ర సామాజిక చైతన్య సైకిల్ యాత్రకు సంఘీభావం

రాష్ట్ర సామాజిక చైతన్య సైకిల్ యాత్ర అనంతపురం జిల్లాలో ఏప్రిల్ 8,9,10 తేదీలలో జరిగింది. కడప జిల్లా నుండి అనంతపురం జిల్లా తాడిమర్రి మండలం దాడితోట గ్రామంలో ప్రవేశించింది. నార్పల మండలంలో యుటియఫ్ నాయకులు శ్రీకాంత్, ఆంజనేయులు, నాగరాజు, జయరాములు యాత్ర బృందానికి రాత్రి బస, బ్యానర్లు, తోరణాలతో స్వాగత ఏర్పాట్లు చేశారు. శింగనమల మండలంలో జిల్లా కార్యదర్శి కె. హరికృష్ణ, మండల నాయకులు కోటేశ్వరప్ప, ఖాజావలి, వెంకటప్రసాద్, జయరాజ్, శివప్రసాద్, చంద్రశేఖర్‌లు ఘనస్వాగతం పలికి ర్యాలీ, బహిరంగ సభ ఏర్పాటు చేశారు. 'యాత్ర'లోని రాష్ట్ర నాయకులు, యుటియఫ్ జిల్లా కార్యదర్శి కె. హరికృష్ణ తదితరులు ప్రసంగించారు. పామిడి మండలంలో జిల్లా కార్యదర్శి వేణుగోపాల్, నాగసాయి క్రిష్ణ, బాబా ఫక్రుద్దీన్, అల్లీవీరా, జయరాజ్ తదితరులు 'జాత'కు అపూర్వ స్వాగతం చెప్పారు. రాష్ట్ర సైకిల్ జాతాకు అనంతపురం నుండి కర్నూలుకు ఘనంగా వీడ్కోలు పలికారు.

## రెడ్డీస్ ల్యాబ్ కార్మికుల రిలే నిరహారదీక్షకు యుటియఫ్ సంఘీభావం

మిర్యాలగూడ ఆర్‌డిఓ నల్లగొండ జిల్లా కార్యాలయం ఎదుట 46 రోజులుగా రెడ్డిస్ ల్యాబ్ సిఐటియు, ఐఎన్‌టియుసి కార్మిక సంఘాల నాయకత్వంలో రిలే నిరహారదీక్షలు చేస్తున్న కార్మికులకు సంఘీభావంగా ఏప్రిల్ 21న యుటియఫ్ డివిజన్ కమిటీ శిబిరాన్ని సందర్శించింది. ఈ సందర్భంగా యుటియఫ్ జిల్లా సహాధ్యక్షులు పి. లక్‌పతినాయక్ మాట్లాడుతూ 46 రోజులుగా రిలే నిరవహారదీక్షలు చేస్తున్నప్పటికీ ప్రభుత్వానికి, యాజమాన్యానికి చీమ కుట్టినట్లయినా లేదన్నారు. కార్మికుల హక్కుల కోసం పాటుపడుతున్నా, కార్మిక నాయకులను అకారణంగా తొలగించడం అన్యాయమని తెలియజేశారు. యాజమాన్యం వెంటనే స్పందించి తొలగించిన కార్మికులను పనుల్లోకి తీసుకోవాలని డిమాండ్ చేశారు. ఈ కార్యక్రమంలో యుటియఫ్ సీనియర్ నాయకులు వి. బంగారయ్య, పి. సత్యనారాయణరావు, పి. శ్యాంసుదర్, పి. కృష్ణమూర్తి, లక్ష్మినారాయణ, విద్యాసాగర్, శ్రీరాములు, బి. శ్రీనివాస్ చారి, అమరయ్య, నర్సరాజు, శివశంకర్, శ్రీధర్ రెడ్డి, డి. వెంకటరెడ్డి, సత్యం పాల్గొన్నారు.

## నెల్లూరు జెడ్‌పి సమావేశంలో పాఠశాలల సమస్యలపై గళం విప్పిన ఎంఎల్‌సి డి. రామిరెడ్డి

ప్రముఖ విద్యావేత్త ఉపాధ్యాయ ఎంఎల్‌సి దాచూరి రామిరెడ్డి మే 11న జరిగిన జిల్లా పరిషత్ సమావేశంలో పాఠశాలల సమస్యలపై గళం విప్పారు. పాఠశాలల్లో నెలకొన్న సమస్యలపైనా, డిఇఓ కార్యాలయ పనితీరుపైనా ఆయన సుదీర్ఘ ప్రసంగం చేశారు. ప్రసంగాన్ని ఆద్యంతం వేదికపై ఉన్న మంత్రులు, అధికారులు, సమావేశంలో పాల్గొన్న సహచర ఎంఎల్‌సీ, జడ్‌పిటిసి, ఎంపిటిసి అధికారులు ఆసక్తికరంగా విన్నారు. విద్యా వ్యవస్థలో నెలకొన్న సమస్యలను పరిష్కరించటంలో డిఇఒ కార్యాలయ సిబ్బంది నిర్లక్ష్య ధోరణిపై చర్యలు తీసుకోవాలని కోరారు. విద్యాపరంగా జిల్లా పరిషత్ పాఠశాలల స్థాయి పెంపు కోసం అనేక ప్రతిపాదనలు డిఇఓ కార్యాలయానికి పంపినా అవి ప్రభుత్వానికి, ఆర్‌జెడి కార్యాలయానికి చేరడం లేదన్నారు. 195 పాఠశాలలకు నాన్ టీచింగ్ స్టాఫ్ లేదన్నారు. వాచ్‌మెన్ లేకుండా జడ్‌పి స్కూల్‌లు ఎలా నడుస్తున్నాయో అర్థం కావటం లేదన్నారు. వాచ్‌మెన్ లేని కారణంగా పలు చోట్ల దొంగలు పడి పాఠశాలల్లోని వస్తువులు అపహరించుకొని వెళ్లారన్నారు. దీనిపై డిఇఓ వివరణ ఇవ్వాలన్నారు.

పాఠశాలల వారీగా సమస్యలను ప్రస్తావిస్తూ రామిరెడ్డి చేసిన ప్రసంగాన్ని సమావేశంలో పాల్గొన్న జిల్లా మంత్రులు ఆనం నారాయణ రెడ్డి, శ్రీమతి నేదురుమల్లి రాజ్యలక్ష్మి ఇతర సభ్యులు సావధానంగా విన్నారు. చైర్‌మెన్ కాకాని గోవర్ధన్ రెడ్డి స్పందించి తగు చర్యలు తీసుకొనే దానికి కృషి చేస్తామని తెలిపారు. జిల్లా విద్యాశాఖాధికారి గాని ఉపవిద్యాశాఖాధికార్లు గాని, అసిస్టెంట్ డైరెక్టరు గాని హాజరుకాకపోవడం దురదృష్టంగా సభ్యులు విమర్శించారు. కలెక్టరు స్పందించి త్వరలో జిల్లా విద్యాశాఖాధికారి కార్యాలయాన్ని సందర్శించి, సమస్యల పరిష్కారానికి కృషి చేస్తానని రామిరెడ్డికి హామీయివ్వడం ముదావహం.

## జాక్టో ఒప్పందాన్ని అమలు పర్చాలి

యుటియఫ్ ఖమ్మం జిల్లా కార్యవర్గ సమావేశం ఏప్రిల్ 22వ తేదీన ఖమ్మంలోని యుటియఫ్ భవన్‌లో బి. నర్సింహారావు అధ్యక్షతన జరిగింది. సమావేశానికి పరిశీలకులుగా హాజరయిన రాష్ట్ర కార్యదర్శి చావ రవి సమావేశాన్ని ప్రారంభించి ప్రసంగించారు. ఉపాధ్యాయులకు సంబంధించి దీర్ఘకాలంగా పెండింగులోనున్న సమస్యలపై జాక్టోతో ఒప్పందం కుదుర్చుకొని రోజులు గడుస్తున్నా దాన్ని అమలు చేయడంలో ప్రభుత్వం తీవ్రమైన నిర్లక్ష్యాన్ని ప్రదర్శిస్తుందని ప్రభుత్వం వ్రాత పూర్వకంగా ఇచ్చిన హామీని వెంటనే అమలు చేయాలని ఆయన ప్రభుత్వాన్ని డిమాండ్ చేశారు. పోరాట సమయంలో జాక్టో సభ్య సంఘాలు, ఉపాధ్యాయులు అపూర్వమైన రీతిలో ఐక్యతను ప్రదర్శించాయని ఇదే ఐక్యత భవిష్యత్ ఉద్యమాలలో కూడా ప్రస్ఫుటం కావాలని ఆకాంక్షించారు. ఎంఎల్‌సి ఎన్నికలలో రాష్ట్ర వ్యాప్తంగా బ్రహ్మాండమైన విజయాలు సాధించి యుటియఫ్ తిరుగులేని శక్తిగా తనను తాను నిరూపించుకొన్నదని, ఆ విజయాల నేపథ్యంలో అనేక జిల్లాలలో ఇతర సంఘాల నుండి వలసలు ప్రారంభం అయినాయని అందువలన యుటియఫ్ కార్యకర్తలు మరింత బాధ్యతాయుతంగా పని చేయాల్సిన అవసరం వుందని ఆయన ఉద్బోధించారు. జిల్లా ప్రధాన కార్యదర్శి జి. రాజశేఖర్, జిల్లాశాఖ కృషి నివేదిక సమర్పించగా వివిధ మండలాల బాధ్యులు చర్చల్లో పాల్గొన్నారు. జాక్టో ఒప్పందాన్ని అమలు చేయాలని పాఠశాల పునః ప్రారంభంలోగానే ఉపాధ్యాయుల బదిలీలు, ప్రమోషన్లు జరపాలని నిరుపయోగమైన విద్యా రెగ్యులేటరీ కమిటీల ఏర్పాటు, కాన్సెప్ట్ స్కూళ్ళ స్థాపన యోచనను విరమించుకోవాలని 10, 7 తరగతుల స్పాట్ రెమ్యూనరేషన్ పెంచాలని తదితర తీర్మానాలను సమావేశం ఆమోదించింది. జిల్లా గౌరవాధ్యక్షులు కె. శ్రీనివాసులు, సహాధ్యక్షులు కళ్యాణం నాగేశ్వరరావు ఇతర జిల్లా ఆఫీస్ బేరర్లు పాల్గొన్నారు.

## ఆదిలాబాద్‌లో విద్యపై వర్క్‌షాప్

ఆంధ్రప్రదేశ్ విద్యారంగంలో అమలవుతున్న వివిధ పథకాలపై వర్క్‌షాప్‌ను పాఠశాల విద్యాశాఖ మంత్రి దామోదర్ రాజనర్సింహ ఆదిలాబాద్‌లో మే 28న ప్రారంభించారు. ఉపాధ్యాయులు విద్యావేత్తలు, పోషకులు, విద్యార్థులు వివిధ ఉపాధ్యాయ సంఘాల నాయకులు పాల్గొన్న ఈ సమావేశంలో యుటియఫ్ ఆదిలాబాద్ జిల్లా అధ్యక్షులు సి. స్వామిరెడ్డి ప్రధానకార్యదర్శి ఎ. వెంకట్, కోశాధికారి పి. నారాయణరెడ్డి, జిల్లా కార్యదర్శి వై. రాంరెడ్డిలు పాల్గొన్నారు.

ఈ వర్క్‌షాప్‌లో జిల్లా ప్రధానకార్యదర్శి ఎ. వెంకట్ ప్రసంగిస్తూ ఇలాంటి వర్క్ షాప్ ఏర్పాటు చేసినందుకు రాష్ట్ర ప్రభుత్వాన్ని అభినందిస్తూ ఆదిలాబాద్ లాంటి వెనుకబడిన జిల్లాలో మొదటగా ప్రారంభించడాన్ని స్వాగతించారు. బడిబాట కార్యక్రమం గూర్చి ప్రస్తావిస్తూ ప్రచారానికై లక్షలు ఖర్చు చేస్తున్న ప్రభుత్వం ఈ కార్యక్రమపు వాలంటీర్లకు రు. 1000-1200 చెల్లించడం, అవి సక్రమంగా ఈయకపోవటం భవిష్యత్తులో జరగరాదని ఇలాంటి చర్యలు వాలంటీర్ల పని తనంపై ప్రభావం చూపుతుందని హెచ్చరించారు.

నిలుపుదలను పెంచటానికి అవసరమైన చర్యలు సూచిస్తూ ఒక విద్యా సంవత్సరానికి ఏ కార్యక్రమం అమలు చేయాలో ముందే నిర్ణయించుకొని వేసవి సెలవుల్లో ఇందుకు అవసరమైన శిక్షణ సంబంధితులకు అందజేసి సంవత్సరం పొడుగునా అదే కార్యక్రమం మధ్యలో మార్పులేకుండా తరగతి గదుల్లో అమలు చేయాలని విద్యా సంవత్సరానికి కార్యక్రమాన్ని మదింపు చేసి ఫలితాలను బేరీజు వేసి మార్చాలా? కొనసాగించాలా? అనేది నిర్ణయించినప్పుడే పథకాలు విజయవంతమవుతాయి. తద్వారా నిలుపుదల పెరుగుతుందని సూచించారు. జిల్లా, ప్రాంత అవసరాలకు తగినట్లుగా ప్రణాళికలు రూపొందించు కోవాలని అన్నారు. పాఠశాల తెరిచేనాటికి టెక్స్ట్‌బుక్స్ విద్యార్థులందరికీ అందుబాటులో ఉండాలని, పంపిణీ సక్రమంగా జరగాలని అన్నారు.

రాష్ట్రస్థాయి ప్రధాన సమస్యలు పరిష్కరించాలని జిల్లా విద్యాశాఖాధికారి పనితీరు వల్ల జిల్లా విద్యారంగం అస్తవ్యస్తంగా మారిందని క్రిందిస్థాయి అధికారుల్లో అవినీతి పెరిగి ఉపాధ్యాయులు తీవ్ర సమస్యల నెదర్కొంటున్నారని తెలుపుతూ డిఇఓ పని తీరుపై సమగ్ర విచారణ జరపాలని, విశాలమైన ఆదిలాబాద్ జిల్లాలో ప్రస్తుతమున్న 2 ఉప విద్యాధికారి, పరిషత్ విద్యాధికారి పోస్టులకు తోడు నిర్మల్, అసిఫాబాద్ డివిజన్ ప్రాంతాలకై మరో 2 ఉప విద్యాధికారి పోస్టుల మంజూరు చేపట్టాలని కోరగా విద్యాశాఖమంత్రి తక్షణం స్పందించి వీటిని మంజూరు చేస్తున్నట్లుగా ప్రకటించారు.

ఈ సమావేశంలో పాఠశాల విద్యా డైరెక్టరు బాలసుబ్రహ్మణ్యం, ఆర్‌జెడి జేసుపాదంలతో పాటు జిల్లా కలెక్టరు ఆర్. సుబ్బారావు, జిల్లా విద్యాశాఖాధికారి నర్సింగరావు తదితరులు పాల్గొన్నారు.

## 'ప్రభుత్వ విద్యారంగ పరిరక్షణ'కై ఉద్యమించాలి

జూన్ 3వ తేదీన అనంతపురం నగరంలోని 'లలిత కళాపరిషత్'నందు యుటియఫ్ రాష్ట్ర కార్యదర్శి సి.కె. నాగేంద్ర బాబు అధ్యక్షతన యుటియఫ్, జె.వి.వి.ల సంయుక్త ఆధ్వర్యంలో "విద్యారంగంలో ప్రమాణాలు-ఫలితాలు-ఆటంకాలు" అనే అంశంపై నిర్వహించిన 'విద్యా సదస్సు'లో ఆయన ప్రసంగించారు. పరీక్షా ఫలితాలు ఆయా జిల్లాల విద్యాశాఖాధికారుల "మంత్ర దండాల"పై ఆధారపడి వుంటాయని వివరించారు. పరీక్షా ఫలితాలను బట్టి విద్యాప్రమాణాలను నిర్ణయించలేమని తెలిపారు. ఉపాధ్యాయులను చిత్త శుద్ధిగా, మనశ్శాంతిగా పని చేయనివ్వట్లేదని ఆరోపించారు. కార్పొరేట్ సంస్థలకు ధీటుగా ప్రచారం చేయాల్సిన ఆవశ్యకత వుందని వివరించారు. ఎమ్మెల్సీ విఠపు బాలసుబ్రహ్మణ్యం మాట్లాడుతూ మార్కులు, ర్యాంకులు గీటు రాయిగా విద్యా ప్రమాణాలను కొలవలేమన్నారు. ప్రభుత్వ గ్లోబలైజేషన్ ప్రక్రియలో భాగంగా భారత యువశక్తిని ప్రపంచ మార్కెట్‌కు అనుగుణంగా తయారు చేస్తోందని విమర్శించారు. విద్యార్థులు ఉపాధిపై చూపుతున్న శ్రద్ధ పరిశోధనలపై చూపడం లేదని విచారం వ్యక్తం చేశారు. తల్లిదండ్రులకు నాణ్యతగల చదువు పట్లగల ఆసక్తిని వ్యాపార సంస్థలు, కార్పోరేట్ సంస్థలు దోచుకొంటున్నాయని తెలిపారు.

స్వచ్ఛంద సంస్థలు, కార్పోరేట్ సంస్థలకు ప్రభుత్వ విద్యారంగంను అప్పనంగా అప్పగించే కుట్ర పన్నుతోందని ఆరోపించారు. రాష్ట్రంలో 6500 పాఠశాలలు మూసేందుకు ప్రయత్నిస్తుండటం శోచనీయమన్నారు. అధికార భాషా సంఘం సభ్యులు ఆచార్య రాచపాళెం చంద్రశేఖర రెడ్డి సందేశాలిచ్చారు. జిల్లా కోశాధికారి మహమ్మద్ జిలాన్ ప్రవేశ పెట్టిన 'బడిబాట'ను యుటియఫ్ విజయవంతం చేయటం, 20లోపు పిల్లలున్న పాఠశాలలన్నింటిని యుటియఫ్‌తో పాటు జె.వి.వి. మరియు కలిసొచ్చే సంస్థలు సర్వే నిర్వహించి వాస్తవాలు ప్రభుత్వానికి నివేదించుట అనే తీర్మానాలను ఆమోదించారు. జె.వి.వి. జిల్లా ప్రధాన కార్యదర్శి యస్. భాస్కర్ యుటియఫ్ జిల్లా ప్రధాన కార్యదర్శి జె. రమేష్, జె.వి.వి. రాష్ట్ర ఉపాధ్యక్షుడు డా॥ గేయానంద్ మాట్లాడారు.

యుటియఫ్ జిల్లా గౌరవాధ్యక్షుడు బి. ఈరజిన్నప్ప, జిల్లా ఉపాధ్యక్షుడు జి. సన్నేగౌడు, జిల్లా కార్యదర్శులు వి. శ్రీనివాసులు, బి. రామకృష్ణ, యస్.వి.వి. రమణయ్య, శ్రీమతి కమలాదేవి, కె. హరికృష్ణ కె. ఓబుళపతి, యన్. వేణుగోపాల్, ఆడిట్ కన్వీనర్ వెంకటరెడ్డి, యుటియఫ్ జె.వి.వి. నాయకులు, కార్యకర్తలు, ఉపాధ్యాయులు, విద్యారంగ శ్రేయోభిలాషులు 600 మంది పైగా హాజరయ్యారు.

## ప్రభుత్వ విద్యారంగ పరిరక్షణకై రౌండ్ టేబుల్

ప్రభుత్వ విద్యారంగాన్ని నిర్వీర్యం చేసేందుకు ప్రభుత్వం పన్నుతున్న కుట్రలను ఉపాధ్యాయ వర్గం అప్రమత్తతతో గమనించి తల్లిదండ్రుల భాగస్వామ్యంతో తిప్పి కొట్టాలని యుటియఫ్ జిల్లా సహాధ్యక్షులు పి. లక్‌పతినాయక్ పిలుపునిచ్చారు. ప్రభుత్వ విద్యారంగ పరిరక్షణకై యుటియఫ్ మిర్యాలగూడ డివిజన్ ఆధ్వర్యంలో జూన్ 3న జరిగిన రౌండ్‌టేబుల్ సమావేశంలో ఆయన మాట్లాడుతూ రాష్ట్రంలో అక్షరాస్యత చాలా తక్కువగా వున్నదన్నారు. ప్రభుత్వం రేషనలైజేషన్ పేరుతో పాఠశాలల రద్దు, ఉపాధ్యాయులచే కుదింపు చర్యలు పద్దుతున్నదని, పాఠశాలలు, ఉపాధ్యాయులు అనేక సమస్యలతో సతమత మవుతున్నన్నారు. మున్సిపల్ వైస్ చైర్మన్ డి. మల్లేష్ మాట్లాడుతూ ప్రపంచ బ్యాంకు విధానాలకు అమలు చేస్తున్న ఈ ప్రభుత్వం ప్రైవేటీకరణను, కార్పొరేటీకరణను ప్రోత్సహిస్తున్నదన్నారు. టిడిపి నాయకులు ఇ. రాంచంద్రు నాయక్, మానవ హక్కుల వేదిక నాయకులు పి. సుబ్బారావు, జాతీయ ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు గ్రహీత ఎం. రామానుజాచార్యులు, యుటియఫ్ జిల్లా కార్యదర్శి ఎం. లక్ష్మారెడ్డి, సీనియర్ నాయకులు వి. బంగారయ్య, పి. సత్యనారాయణ రావు, మాజీ సర్పంచ్ వి. పాండురంగారావు, సిఐటియు నాయకులు లక్ష్మి నారాయణ, వీరవెల్లి వెంకటేశ్వర్లు, డా॥ ఎం. గౌతం రెడ్డి, యుటియఫ్ మిర్యాలగూడ, నిడమనూరు, దామరచర్ల, త్రిపురారం, వేములపల్లి, అధ్యక్ష కార్యదర్శులు తదితరులు పాల్గొన్నారు.

## ఉద్యమ శిక్షణా తరగతులు

**విశాఖలో**

విశాఖపట్నం జిల్లాలో ఉక్కునగరం సెక్టార్ వన్‌లో ఏప్రిల్ 27,28 తేదీల్లో ఉద్యోగ, ఉపాధ్యాయ వేదిక ఆధ్వర్యంలో ఉపాధ్యాయులకు శిక్షణా తరగతులను నిర్వహించారు. జిల్లాలో ఆనందపురం పరవాడ, ఎలమంచిలి ఎస్. రాయవరం, పద్మనాభం, భీమిలి తదితర మండలాల నుంచి 200 మంది కార్యకర్తలు హాజరయ్యారు. మొదటి రోజు ప్రపంచీకరణ గూర్చి సిపిఎం నాయకులు డా॥ ఎం. గంగారావు, రాజకీయాలు, రాజకీయ పరిణామాలు గూర్చి ఎల్ఐసి ఉద్యోగ సంఘ నాయకులు బి. చలపతి మాట్లాడారు. రెండవ రోజు జరిగిన శిక్షణలో యుటియఫ్ రాష్ట్ర సంయుక్త ప్రధాన కార్యదర్శి ఐ. వెంకటేశ్వరరావు పాల్గొని వర్తమాన ఉపాధ్యాయ ఉద్యమం, ఐక్య ఉద్యమాలు - అనుభవాలను వివరించారు. రాష్ట్రంలో పోరాటాల ద్వారా సాధించుకున్న సమస్యలను ఉత్తర్వులను ఉపాధ్యాయులకు ఉపయోగపడేలా చేయాలని కోరారు. మధ్యాహ్నం ఉత్తరాంధ్ర ఎమ్మెల్సీ ఎం.వి.ఎస్. శర్మ ఉపన్యాసకులుగా విచ్చేసారు. విద్యని ప్రైవేటీకరించడానికి ప్రభుత్వం చేస్తున్న ప్రయత్నాలను అడ్డుకోవాలని పిలుపునిచ్చారు. ఉన్నత స్థాయి విద్యను నిర్వీర్యం చేసిన ప్రభుత్వం ప్రాథమిక విద్యపై దృష్టి కేంద్రీకరించిందన్నారు. ఈ శిక్షణా శిబిరాల్లో యుటియఫ్ జిల్లా అధ్యక్ష, ప్రధానకార్యదర్శులు పొత్తూరి రాజేంద్రప్రసాద్ వర్మ, నెల్లి సుబ్బారావులు పాల్గొని ఉపాధ్యాయులకు ఉద్యమ విషయంలో సూచనలు అందించారు. ఈ తరగతులకు ఎం. రామసుబ్బారెడ్డి ప్రిన్సిపాల్‌గా వ్యవహరించారు.

**నెల్లూరులో**

మే 31, జూన్ 1 తేదీలలో నెల్లూరులో జిల్లా స్థాయి ఉద్యమ శిక్షణా తరగతులు జరిగినవి. ఈ తరగతులలో ఉద్యమ చరిత్రను ఎంఎల్‌సి డి. రామిరెడ్డి మరియు సీనియర్ నాయకులు టి. కొండాచారి బోధించారు. వర్తమాన ఆర్థిక, రాజకీయ సామాజిక అంశాలను మిరియం వెంకటేశ్వర్లు సంఘ నిర్మాణమును యుటియఫ్ రాష్ట్ర కార్యదర్శి పి. బాబురెడ్డి బోధించారు. రెండవ రోజు విద్యారంగంలోని సవాళ్లు-మన కర్తవ్యం అను అంశంపై ఎంఎల్‌సి వి. బాలసుబ్రహ్మణ్యం, ఉపాధ్యాయ సర్వీసు సమస్యలు పరిష్కారాలు రాష్ట్ర కార్యదర్శి కె. వెంకట్రావు కార్యాచరణ ప్రణాళిక-భవిష్యత్ కర్తవ్యాలను జిల్లా ప్రధానకార్యదర్శి కె. పరంధామయ్య బోధించారు. తరగతులకు మండల శాఖ అధ్యక్ష, ప్రధానకార్యదర్శులు, జిల్లా కార్యవర్గ సభ్యులు హాజరైనారు.

**మర్లపాడులో**

ప్రకాశం జిల్లా ఉద్యమ శిక్షణా తరగతులు జిల్లా శాఖ ఆధ్వర్యంలో మే 29,30 తేదీలలో టంగుటూరు మండలం, మర్లపాడు నిర్వహించబడినాయి. మే 29 ఉదయం ఎస్‌టిఎఫ్ఐ పతాకాన్ని రాష్ట్ర కార్యదర్శి కె. వెంకట్రావు, యుటియఫ్ పతకాన్ని జిల్లా అధ్యక్షులు యం. వెంకటేశ్వర రెడ్డి ఆవిష్కరించగా కార్యక్రమాన్ని కోశాధికారి పి. హరిబాబు నిర్వహించారు. ప్రారంభ సభకు అధ్యక్షత వహించిన జిల్లా అధ్యక్షులు యం. వెంకటేశ్వర రెడ్డి శిక్షణా తరగతుల యొక్క ఆవశ్యకతను వివరించారు. ముఖ్య అతిధిగా పాల్గొన్న యుటియఫ్ సీనియర్ నాయకులు ఎమ్మెల్సీ డి. రామిరెడ్డి మాట్లడుతూ ప్రతి యుటియఫ్ కార్యకర్త ఒక సామాజిక కార్యకర్తగా తయారవ్వాలని, ఈ శిక్షణా తరగతుల సాంప్రదాయం మన సంఘం మొదలు పెట్టిందేనని, ఈ క్లాసులను విజయవంతం చేయాలని కోరారు. రాష్ట్ర కార్యదర్శి కె. వెంకట్రావు మాట్లడుతూ మన సంఘం ఆశయాలు , నిర్మాణ సూత్రాలు,కార్యకర్తల నిబద్ధత గురించి వివరించారు. జిల్లా ప్రధానకార్యదర్శి కె. శ్రీనివాసరావు , యుటియఫ్ వార్తలు సంపాదకులు కె. ఆదినారాయణ, ఆఫీస్ కార్యదర్శి టి. నారాయణరావు, జి. శేషయ్య, గొరంట్ల అంజయ్య, సర్పంచ్ బి. సుబ్బారాజు, పాఠశాల హెచ్‌ఎం. వెంకటేశ్వర్లు, జిల్లా అధ్యక్షులు పిజెవి విలియం, డి. వీరాంజనేయులు ప్రసంగించారు.

డి. రామిరెడ్డి "నిన్న-నేడు-రేపు" అనే వినూత్న అంశాన్ని బోధిస్తూ యుటియఫ్ ప్రస్థానం గూర్చి వివరించారు. కార్యకర్తలకు ఆర్థిక క్రమశిక్షణ అవసరమని, ఉద్యమం గతంలో ఎలా ఉన్నది నేడు ఏ రూపంలో ఉంది అని వివరించారు. 34 సం॥ ఉద్యమ చరిత్రను, విద్యారంగ సమస్యలకు మిళితం చేసి చక్కగా వివరించి కార్యక్రమంతో ఉత్తేజితులను చేశారు. అనంతరం 'మెడికల్ రీయింబర్స్‌మెంట్' అనే అంశాన్ని సీనియర్ నాయకులు, వార్తల సంపాదకులు కె. ఆదినారాయణ వివరించారు. జిల్లా కార్యదర్శి ి. సత్యనారాయణ శర్మ, నాయకులు జె. కేశవ రాజు పెన్షన్ రూల్స్ వివరించారు. పెన్షన్ పేపర్స్ పూర్తి చేయడంపై కూడా కార్యకర్తలకు వర్క్‌షాపు నిర్వహించారు. జిల్లా గౌ॥అధ్యక్షులు జి. రవీంద్రనాథ్ రెడ్డి ప్రిన్సిపాల్‌గా వ్యవహరించారు.

రెండవరోజు పి.జె.వి. విలియం ప్రిన్సిపాల్‌గా వ్యవహరించగా జిల్లాకార్యదర్శి జి. శేషయ్య "లీవ్‌రూల్స్' బోధించగా రాష్ట్ర కార్యదర్శి కె. వెంకట్రావు సమన్వయం చేశారు. ఏపిజిఎల్ఐసి ఫారాలు పూర్తి చేయడం గూర్చి యం. వెంకటేశ్వర రెడ్డి, 'ఫండమెంటల్ రూల్స్' 'ఆటోమేటిక్ అడ్వాన్స్ మెంట్ స్కీం' గూర్చి కె. వెంకట్రావు వివరించారు. తదుపరి ప్రధానకార్యదర్శి కె. శ్రీనివాసరావు అర్హత పత్రాలపై విశ్లేషణ చేశారు.

ఈ క్లాసులకు జిల్లా నలుమూలల నుండి 200 మంది కార్యకర్తలు హాజరైనారు. మర్లపాడు గ్రామ నివాసి గోరంట్ల అంజయ్య కార్యకర్తలకు భోజన వసతి కల్పించారు. పాఠశాల ప్రధానోపాధ్యాయులు వెంకటేశ్వర్లు వసతి ఏర్పాట్లు చేశారు. టంగుటూరు మండల శాఖ బాధ్యులు రమేశ్, చంద్రమౌళి, హనుమంతరావు, నాగేంద్ర, శ్రీధర్, జె.వి. నారాయణ, కె. క్రిష్ణమూర్తి, టి. రమేశ్ తదితరులు ఏర్పాట్లను పర్యవేక్షించారు.

## యుటియఫ్ కార్యకర్త ఇ. సత్తిరెడ్డి రిటైర్మెంట్

రంగారెడ్డి జిల్లా కుత్బుల్లాపూర్ ప్రభుత్వ ప్రాథమిక పాఠశాల ప్రధానోపాధ్యాయుడు ఇ. సత్తిరెడ్డి మే 31న ఉద్యోగ విరమణ సందర్భంగా కుత్బుల్లాపూర్ మండల శాఖ చేత అభినందన సభ నిర్వహించబడింది. యుటియఫ్ మండల సహాధ్యక్షులు ఎన్. విల్సన్ అధ్యక్షతన జరిగిన ఈ కార్యక్రమంలో రాష్ట్ర గౌరవాధ్యక్షులు పి. కృష్ణమూర్తి ముఖ్య అతిధిగా పాల్గొని సత్తిరెడ్డిని సత్కరించారు. విశిష్ట అతిధి, యుటియఫ్ రాష్ట్ర ప్రధాన కార్యదర్శి ఎన్. నారాయణ మాట్లాడుతూ ఉపాధ్యాయులు సామాజిక సేవలో ముందుంటూనే, ప్రభుత్వం అనుసరిస్తున్న విద్యా వ్యతిరేక చర్యలపై ఉద్యమించాలన్నారు. జిల్లా అధ్యక్షులు ఎన్. పురుషోత్తం రావు మాట్లాడుతూ మండలంలో యుటియఫ్ స్థాపనలో సత్తిరెడ్డి కృషిని ప్రశంసించారు. జిల్లా ప్రధానకార్యదర్శి పి. మాణిక్ రెడ్డి, మండల యుటియఫ్ అధ్యక్షులు సిహెచ్. వెంకటేశం, ముదిరాజ్ ఎంఇఓ కె. ఉమాపతి తదితరులు పాల్గొన్నారు.



మెడికల్ రీయింబర్స్‌మెంట్ గరిష్ఠ పరిమితి రు. 2లక్షలకు పెంపు
మరియు ఇతర సవరణలు

**GOVENMENT OF ANDHRA PRADESH**

**ABSTRACT**

APIMA Rules, 1972-Certain amendments to G.O.Ms.No.74, HM & FW(K1) Department, dt. 15.03.2005 Issued.

**Health, Medical and Family Welfare (K1) Dept.**

**G.O.Ms.No. 105** **Dt. 09.04.2007**

Read the following:

1. G.O.Ms.N. 74, HM & FW (K1) Dept., Dt. 15.03.2005.
2. G.O.Ms.N. 180, HM & FW (K1) Dept., Dt. 11.05.2005.
3. Representation from the progressive Teachers Union, AP Hyd Letter No. 49/2006, Dt. 22.03.2006.
4. Representation from the President / Secretary AP Secretary at Associatation, Hyd. 18.04.2006.
5. Representation from the General Secretary AP State Govt. Retired Employees Association, Sultan Baza, Hyd. dt. 22.04.2006.
6. Representation from the APNGOs Association, District Branch, Ananthapur through CMP No. 10482/CMP/2006, dt. 16.10.2006.
7. From the DME, AP, Hyd RC.No. 20866/MA/(I)A/2006 Dt. 16.04.2006 and 9.11.2006.
8. From the DME Lr.No. 1797/LC-B/2006, Dt. 6.10.2006.
9. Representation from President / General Secretary, AP NGOs Association Lr.Dt. 27.11.06.

***

**ORDER :**

Government have issued AP Integrated Medical Attendance Rules, 1972, applicable to state Government employees and their dependents, employees of local bodies, students of Medical Colleges, members of state Legislature, AIS Officers, AP State Higher Judical Officers etc. Many Private Hospitals both in the State and out side the state have been recognized by the Government as referral hospitals, for the purpose of treatment for the above category of persons on reimbursement basis.

2. Government have constituted a Committee under the Chairmanship of the Director of Medical Education for review of rules and submission of recommendations. Accordingly, the said committee has submitted the report. Based on the said report, orders have been issued liberalizing the scheme vide G.O.Ms.No.74 HM&FW(K1) Dept., Dt. 15.03.2005.

3. Government have conducted a review meeting on 28.01.2006 with the Officials of Finance and Health Medical & Family Welfare Department and the Director of Medical Education on the subject of medical reimbursement and review the matter including the following points.

1. To fix up the ceiling limit on Central Government Health Scheme (CGHS) Package rates.
2. To fix up the ceiling limit for the dental treatment.

4. It has also been brought to the notice of the Government that the dental rates prescribed in the said G.O. are high for certain procedures and by taking advantage of these rates, most of the Dental bills are Piesented with maximum rates between Rs. 15000/- and Rs. 24500/- In some cases one procedure is done, but high rates are being claimed mentioning other procedures. The matter has been referred to the Director of Medical Education.

5. The AP Secretariat Employees Coordination Association has also submitted a representation for discussions with officers committee's meeting constituted vide G.O.Rt.No. 2272, GA. (SW-II) Department, dt. 2.05.2006. Similarly, AP Secretariat, Association has also represented. They have requested for issue of orders on the following.

1. For Dental treatment Rs. 20000/- may be fixed as ceiling limit and three times to each of employees and their dependents separately in the entire service or life.
2. Credit facility for health checkup.
3. Issue of net admissible certificate by NIMS at the time of dischange.
4. Credit Lr. should be accepted by all private recognised hospitals/NIMS/SVIMS issued by departments for any emergency treatment.
5. One month time may be prescribed for clearing medical bills by scrutiny authority.

6. In the G.O. second read above, ceiling limit of Rs. 1,70,000/- has been fixed for the treatment obtained in private hospitals in respect of diseases for which no package rates of CGHS are available. The Pay Revision Commission, 2005 has made recommendations for enhancement of ceiling limit for medical reimbursement to Rs.2 lakhs for serving employees and Rs. 1 lakh for retired persons.

7. After careful examination of the matter and with a view to rationalize the medical reimbursement procedure, keeping in view the recommendations of PRC, 2005, and with a view to prevent misuse of facilities, the Government have decided to amend the orders issued in G.O.s first and second read above Accordingly, Government hereby issue the following amendments to G.O.Ms.No. 74, HM & FW(K1) Department, dt. 15.03.2005 read with G.O.Ms. No. 180, HM&FW(K1) Department, Dt. 11.05.2006.

**AMENDMENTS**

1. In Sub-para (1) of para 9 of G.O.Ms. No. 74, HM &FW(K1) Department dt. 15.03.2005, as Department dt. 11.05.2006 the following shall be substituted, namely:

"1. a) The rates prescribed in the Central Government Health scheme (CGHS) package by Government of India. Ministry of Health and Family Welfare Affairs, New Delhi for Central Government Health Scheme, Hyd are adopted in the state for the purpose of reimbursement of medical expenditure incurred by the state Government employees both in service/retired and their dependents; family pensioners, MLAs and their family members and all other eligible categories who are entitled for free medical treatment as mentioned in AP Integrated medical Attendance Rules, 1972 when the treatment was taken in the private hospitals recongnised by the state Governmnet within the state. If medical treatment is taken outside the state, the rates of Central Government Health Scheme, Delhi Shall be applicable.

b) The maximum ceiling limit of Rs. 2 lakhs (Rupees two lakhs only) is fixed for the major ailments of Bypass Heart Surgery, CABGS, Double valve replacement, Opern Heart procedure, aortic valve replacement, Kidney Trasplantation, Cancer and Neuro-Surgery to Brian irrespective of package rates of CGHS for the treatment obtained in private hospitals, Tirupathi or actual cost which ever is less. This ceiling limit of Rs. 2 lakhs is applicable to the serving employees and the dependents. In respect of retired employees, their dependents and family pensioners, the ceiling limit is Rs. 1 laksh (Reupees on lakh only )for these ailments, as per the recommendation of PRC-2005.

c) In the conditions, procedures, surgeries where CGHS package rates are available, the CGHS tariff is the ceiling limit and shal be followed for the treatment obtained in Private Hospitals except for the major ailments mentioned in point 1 (b) above. The Private Hospitals recoginsed as referral hospitals should abide and follow CGHS package rates and Government orders while giving treatment to the employee and their dependents as per APIMA Rules. They shall not charge excess amount over the package rates mentioned in CGHS package rates.

d) Where package rates in CGHS, NIMS/SVIMS are not available for certain treatments other than Dental ailments, the ceiling limit as perscribed in G.O.Ms.No.58, HM&FW(K1) Dept., 5.05.2000 shall be followed for scruitny and reimbursement purpose, duly modifying the orders issued in G.O Ms.No.180, HM&FW(K1) Department, dt.11.05.2006, viz. the ceiling limit will be Rs. 1 lakh (Rupees one lakh only) for serving employees and their dependents and in respect of retired employees and their dependents and family pensioners, it shall be Rs. 75,000/- (Rupees Seventy five thousand only)

2. In sub-para (3) of Para 9, of the said G.O. the sentence "and package rates for dental treatment/diseases are mentined in Annexure-II to the orders' shall be deleted and consequently the annexure-II to G.O.Ms.N.74 HM&FW (K1) Department, dt. 15.03.2005 be cancelled and deleted

3. After sub-para(3) of Para 9 of the said G.O. the following procedure shall be followed.

a The employee should approach Government Hospitals, i.e. Teaching Hospital or District Headquarters Hospitals or APVVP Area Hospital for Dental treatmet or where facilities not availble, obtain referral letter before approaching any recognised Dental Hospital for treatment. With prior permission of the concerned Government Hospital only, one should obtain dentals treatment in recognized dental Hospitals.

b. Reimbursement in respect of treatment for dental diseases to each of the employee or their dependents separately in the entire service or life as the case may be shall be limited to three times and the ceiling limit shall be Rs. 10,000/- (Rupees ten thousand only) for each time.

i. No relaxation of rules be accepted for sanction of claim beyond Rs. 10,000/- (Rupees ten thousand only) in any case.

ii. With regard to cosmetic dental surgery, Claims regarding Cosmetic dental surgery are not eligible for any medical reimbursement, except in case of Road Traffic accidents involving upper and low jaws.

4. After the existing sub-para 9, of the said G.O. of para 4, the following proviso shall be inserted, namely:

Provided scrutiny of medical bills of Govt. employees and their dependents of Raj Bhavan is entrusted to the Civil Surgeon Specialist, Civil Dispensary, AP Secretariat, Hyd upto Claim of Rs. 25,000/- (Rupees twenty five thosand only).

5. After sub-para(10) of para 9 of the said G.O. the following shall be added, namely:-

"In respect of treatment obtained in un-recongnized private hospitals for treatment/surgeries under emergency conditions, as stipulated in G.O.Ms.No.175, HM&FW (K1) Dept, 29.05.1997.

i. such claims shall be examined by Head of the Department concerned and if it is found genuine, then the proposal shall be referred to their concerned administative Department in AP Secretariat, Hyd. With specific recommendations justify for relaxation of rules, together with scrutiny report of the DME or NIMS or SVIMS or other scrutinizing authority as the case may be.

ii. The Concerned Administrative Department in Secretariat shall examine the proposal in consultation with Finance Department for relaxation of rules and take a decision for sanction of medical reimbursment based on scrutiny report as per the business rules. In such cases, the Administrative Department concerned shall not refer files to Health Medical & Family Welfare Department for remarks/opinion.

iii. While referring for any specify clarification/proposal to Government in their concerned Administrative Department, the Head of the Department shall obtain and enclose the scrutiny report of Director of Medical Education or Nizam's Institute of Medical Science (NIMS)/ Sri Venkateswara Institute of Medical Sciences (SVIMS) or other scrutiny authority as may be applicable to each case, to avoid unnecessary and avoidable correspondence"

6. After the existing sub-para(13) of para 9, of the said G.O., the following shall be inserted, namely:

13. A NIMS, Hyd and SVIMS, Tirupathi while issuing final bills to the employee etc. they should also issue a separate scrutiny certificate on the net admissibility of the claim in terms of APIMA Rules 1972 simultaneously as amended from time to time to avoid delays. Based on the scrutiny certificate, the concerned Department shall take necessary action for sanction of claims as per the procedure"

7. For Sub-para (17) of para 9 or the said G.O. the following shall be substitued, namely:

The State Govt. employees both in service and retired and their dependents, and all other eligible categories are allowed to secure treatment under emergency cases, in AP State Govt. recognised private hospitals outside the state with 10% cut on the eligible amount and as per CGHS rates.

8. After the existing sub-para (24) of para 9 of the said G.O. the following shall be inserted namely:

"24. A. In respect of Master Health Checkup for employees who crossed 40 years as per above sub-para, the concerned employee shall submit application to the concerned HOD/ Regional Office/District Office for his checkup to a particular recognized hospital, SVIMS/NIMS. The concerned / HOD/Reginal Offices as the case may be refer the employee concerned to that hospital for Master Health checkup on Letter of Credit (LOC) basis and the departments should obtain bills from the hospitals and send for scrutiny and arrange payment to the hospital as per CGHS rates, NIMS rates/SVIMS rates respectivly"

24.B. The ceiling limit for reimbursement to master Health checkup is fixed at Rs. 3000/- (Rupees three thousand only) and Master Health checkup shall include (1) Haemogram (CBP,ESR, Plate count) (2) complete urine examination, (3) Biochemistry: Serum Uric Acid, Lipid Profile, LFT, Blood sugar, Fasting and post prandial Blood Urea and Serum Creatinine (4) Cardilogy. ECG, 2D, ECHO Tread mill test whenever necessary (5) Radiology chest X-Ray, Ultra sound Exam abd. (6) PAP Smear (HP) for ladies (7) Micro Bilogy: HIV, HBs.Ag. (8) Blood Grouping Rh. Typing (9) Eye checkup and consultation with physician (10) Thyroid Test and T3,T4,TSH

9. This order issues with the concurrence of Finance Department vide their U.O.No. 4522/331/A2/Expr. HM&FW.I/2006, dt. 5.8.2006.

**(BY ORDER AND IN THE NAME OF THE GOVERNOR OF A.P.)**

**P.K. Agarwal,**

PRINCIPAL SECRETARY TO GOVERNMENT

***

## జాక్టో డిమాండ్ల పరిశీలనకు 5గురు ఉన్నతాధికారుల కమిటీ నియామకం

**GOVERNMENT OF ANDHRA PRADESH**
**ABSTRACT**

School Education Department - Demands of Teachers presented by JACTO - Appointment of a Committee to examine and submit report on the demands of JACTO- Orders - Issued.

**EDUCATION (SER.V) DEPARTMENT**

**G.O.Rt.No. 293** **Dt.23.04.2007**

**Read the following:-**

Notice given by the Joint Action Committee of Teachers Organisation - A.P., Dt. 31.03.2007.

**ORDER :**

The representatives of Joint Action Committee of Teachers Organisation have served notice on the Government containing (nine) demands vide reference read above and boycotted the spot valuation of 10th class Public Exams-2007 as a protest against the unresolved demands.

2. As a result pf doscissons held with the representatives of Joint Action Committee of Teachers Organisation. Andhra Pradesh by Hon'ble Chief Minister in the meeting on 12.04.2007, the Government hereby appoint a committee with the following officers to examine the demands raised by JACTO AP., and submit a report to Government within 3(three) months.

1. PRINICIPAL SECRETARY, SCHOOL EDUCATION
2. SECRETARY (SERVICES) GENERAL ADMINISTRATION DEPARTMENT.
3. SECRETARY (FP), FINANCE DEPARTMENT.
4. SECRETARY, LAW DEPARTMENT
5. DIRECTOR OF SCHOOL EDUCATON-MEMBER CONVENOR

**(BY ORDER AND IN THE NAME OF THE GOVERNOR OF A.P.)**

**J. HARINARAYANA**
CHIEF SECRETARY TO GOVERNMENT

***

## పిఆర్‌సి అనామలీస్ నుండి యుటిఎఫ్‌కు లేఖ

**FINANCE (ANOMALIES COMMITTEE) DEPARTMENT**

**Letter No. 8118-C/20/AC/2007** **Dt. 18.04.2007**

**To**
**Sri N. Narayana**, General Secretary
APUTF, Hyderabad

**Sir,**

**Sub:-** Anomalies Committee-Communication Terms of reference - Reg.

**Ref :-** G.O.Ms.No. 219. G.A.(Spl.A) Department, Dt. 7.04.2007.

***

Government in the reference cited has constitued and Anomalies Committee with the following terms of reference :-

i. To consider the representation on anomalies arising out of recommendations of the Pay Revision Commission, 2005 and make suitable recommendations taking into account the conditions of service existing Master scale, Parities, perquisites in cash or kind and also keeping in view the financial position of the State Government.

ii. To workout the financial cost on account of its recommendations and submit to the State Government.

iii. The representation regarding anomalies arising out of the recommendations of the Pay Revision Commission, 2005 shall only be considered. For example, there may be anomalies wherein the promotion post is assigned a similar pay scale to that of the feeder category.

iv. Representations requesting new parities with various cadres in differents or for sancton of higher quantum of various allowances, special pays etc., or adding new categories for sanction of various special pays, allowances, etc., will not construed as anomalies and will not come under the purview of the Committee.

v. The Committee may also examine the representation of conferring Gazetted status which do not involve enhancing of the pay scales and make suitable recommendations.

vi. The change of designation/nomenclature of posts, or up gradation or conversion of posts may not be constructed as anomalies.

I shall be grateful if your organization could go through the terms and furnish me with any suggestions for consideration of items of importance, as you think fit. Your suggestion may be sent at the **Latest by 19.05.2007.**

**Yours faith fully**

**CHAIRMAN**
**ANOMALIES COMMITTEE**

***

## ఎస్‌సి, ఎస్‌టి టీచర్ల ఉన్నత చదువులకు ఓడి కాలంలో నెల నెలా వేతనం చెల్లించాలని ఆదేశం

**PROCEEDINGS OF THE DIRECTOR OF SCHOOL EDUCATION :: ANDHRA PRADESH, HYDERBAD**

**Rc.No. 1197/D2-3/2007** **Dt. 21.04.2007**

**Sub:-** O/o. DSE, AP, Hyd., - SC/ST Teachers deputation for Higher Studies-Payment of Pay and allowances - Istructions issued - Reg.

**Ref :-** 1. G.O.Ms.No. 342 Socail Welfare (B3) Dept., Dt. 30.08.77.
2. Representation received from the General Secretary A.P. UTF, Hyd, Lr.No. nil, Dt. 14.03.2007.

***

The General Secretary APUTF, Hyderabad has represented in his letter 2nd read above stating that the District Educational Officer, Ranga Reddy District has issued instructions to all H.Ms/ M.E.Os under his jurisdiction not to pay salary every month to the SC/ST teaches who are deputed B.Ed Training during the year 2006-07 and the same will be paid after successful completion of the training course.

In view of the report of the General Secretary APUTF, Hyderabad, the District Educational Officer, Ranga Reddy District is informed that it is not correct to pay the salary to such trainee teachers only after successufl completion of the entire training period and the teachers will be put to hardships if salary is not paid to them every month. Hence the District Educational Officer is instructed to pay salary every month to the teachers of SC/ST teachers who are deputed to B.Ed training during the year 2006-07 duly obtainig the attendance Certificate from the Principal of the respective Colleges.

The District Educational Officer, Ranga Reddy District is requested to issue necessary instructions to all the H.Ms/M.E.Os uner his jurisdiction to pay salaries as per G.O.Ms.No.342/SW(B3), Dt. 30.08.77 immediately.

**Sd/- S. BALASUBRAMANYAM**
**DIRECTOR OF SCHOOL EDUCATION**

***

## ఏకీకృత సర్వీస్ రూల్స్ కోసం విద్యాశాఖ అదనపు డైరెక్టర్‌ను ఢిల్లీకి డెప్యుటేషన్ యిచ్చిన ఉత్తర్వులు

**GOVERNMENT OF ANDHRA PRADESH**
**ABSTRACT**

School Education – Sri P. Veerabhadra Reddy, Additional Director (Coordination), O/o the Director of School Education, A.P. Hyderbad temporarily attached to the Resident Commissioner A.P. Bhavan, New Delhi Orders - Issued.

